# చతుర

౩౭౨ వ సంచిక
జూన్ 2005
రూ.7/-

Extra

సి.ఎన్.చంద్రశేఖర్ నవల హీరో



'వెన్నెల్లో ఆడపిల్ల'
కథ వెనుక కథ చెబుతున్న
యండమూరి వీరేంద్రనాథ్

## సచిత్ర విచిత్రం



# గులాబీలు నవ్విన వేళ

పువ్వులు ప్రకృతి చిత్రించిన వర్ణ చిత్రాలు. పరమాత్మ అందించిన కానుకలు. నేత్రోత్సవం చేసే పూలవనాలు ఎంతో ఆహ్లాదం కలిగిస్తాయి. మనసులోని ఆందోళనలను, చికాకులను పాలదోలతాయి వాటి సుగంధాలు. ఈమధ్య బెంగుళూరులోని అత్యంత పేరు ప్రఖ్యాతులు పొందిన లాల్ బాగ్ గ్లాస్‌హౌస్‌లో నర్సరీ ఉత్సవం అత్యంతవైభవంగా ఆనందభరితంగా జరిగింది. ఎటుచూస్తే అటు విరబూసిన పువ్వులు, సువాసనల పలకరింపులు, చూడముచ్చటైన గులాబీల ప్రదర్శన అందర్నీ ఆకట్టుకొంది. వేలాది రోజాలతో రూపొందించబడిన ఓ స్తంభం చూపరులను మంత్రముగ్ధుల్ని కావించింది. ఆ పూల ఇంద్రజాలాన్ని తిలకించి మీరూ పులకించండి.

రసమయ నవలాతరంగం

# చతుర

సంపుటి : 28 సంచిక : 5

జూన్ : 2005 329వ సంచిక



## లోపలి పేజీలలో...





బొమ్మలు: పినిశెట్టి

కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: జయకృష్ణ

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు (7)

### చెహోవ్ లేఖలు

(1888 నాటి లేఖ)

"నవలల వ్యవహారం వేరు. కాస్త ఎక్కువ రాసినా చెల్లుతుంది. కాని కథలో ఇంతెందుకు రాశాడు" అనిపించుకోవటం కన్నా 'అయ్యో, చాలా వదిలేశాడు' అనిపించుకోవడం శ్రేయస్కరం".

"... ... ..."

సువోరిన్‌కు రాసిన మరో లేఖ–1888

"... (ఒక కథలోని) పాత్ర చిత్రణ సమగ్రంగా లేదంటారా? ఏం చెయ్యను మూర్ఖుణ్ణి. అసమగ్రంగా ఉందని నాకూ తెలుసు. పాత్రల వ్యక్తిత్వాల్ని ఎదగనివ్వకుండా మొగ్గలోనే చిదిమేస్తాను. ఎన్ని మంచి కథావస్తువుల్ని ఇలా నాశనం చేసుకున్నానో! ఒక్కొక్క కథ ఆర్నెల్లు రాయగలిగితే పాత్రలు బాగానే ఎదుగుతాయి. అప్పుడు ప్రతి పాత్ర మనస్తత్వం జీవితం, అతి చిన్న విషయమూ బాగా చిత్రించవచ్చు. హీరోహీరోయిన్లు మాత్రమే అనేమిటి అందరి గురించీ రాయచ్చు. కాని పదిహేను రోజుల్లో కథ కావాలన్నారు పత్రికవాళ్లు. కాల పరిమితిలో రాయకపోతే డబ్బులు రావు. పరిణామం ఇల్లు గడవదు. నేనొక్కణ్ణే కాదు. నా మీద ఆధారపడిన వాళ్లు కూడా పస్తులు పడుకోవాలి. చూశారుగా కథా ప్రారంభం బాగానే ఉంటుంది. కాని మధ్యకు చేరుకునే సరికి భయమేస్తుంది. పొడుగు పెరిగిపోతుందేమోనని. అందువల్ల నవల అన్న భ్రమ కలిగించిన ప్రారంభం కాస్తా చివరికి, హడావిడిగా తుస్సుమన్న టపాకాయలాగ ముగుస్తుంది. కథ మొత్తం మొదటే ఆలోచించుకోవాలి. (అని నాకు తెలుసు). అనేక డజన్ల మనుషుల్లో ఒక్క ప్రధానపాత్రను ఎన్నుకోవాలి-ఆడో మగో! మన (కథా) కాన్వాస్‌మీద వాళ్లను మాత్రం ప్రధానంగా చిత్రించి మిగతావాళ్లను చిల్లర నాణాల్లాగ చుట్టూ వెదజల్లాలి. అంటే చంద్రుడిచుట్టూ తారల్లాగ. కాని చుక్కలు సహజంగా పరచుకుంటే తప్ప చంద్రుడి ప్రాధాన్యత గ్రహించలేం. నాకు తెలుసు. ఇది సాహిత్యం కాదు. నావన్నీ అతుకుల బొంత కథలు. కాలమే వాటి విలువ నిర్ణయిస్తుంది.

ఎవరు నమ్మినా నమ్మకపోయినా నా మనసులోని మాట చెబుతున్నాను. నాకు సాహిత్య బహుమతులు వచ్చాయి. (పుష్కిన్‌ప్రైజు) కాని ఇంత వరకూ అసలైన సాహిత్యం సృష్టించలేదని నాకు తెలుసు. ప్రస్తుతం నా బుర్రలో అయిదు కథలూ, రెండు నవలలూ రూపుదిద్దుకుంటున్నాయి. ఒక నవల గురించి ఆలోచిస్తూ ఏళ్లు గడిచాయి. ఆ పాత్రలు పుట్టిపెరిగి, వృద్ధులై మరణశయ్యమీదికి చేరుకున్నాయి. అసంఖ్యాకమైన పాత్రలు తమను పదాల్లో బంధించి లోకం మీదికి వదలమని ఊపిరి సలపకుండా చేస్తున్నాయి. రాయాలనుకున్న దానితో పోల్చితే ఇప్పటికి నేను రాసిందంతా 'చెత్త.' భుక్తికోసం చేసే చవకబారు గిమ్మిక్కులు, యాంత్రిక రచనలు. సీరియస్‌గా ఉండే నా మొహాన్ని చూసి జనం ఇంప్రెస్ అయినట్టుగా, నా కథల్తో కూడా నేను పాఠకుల్ని మోసం చేస్తున్నాను. రాసిన చెత్త కాగితంమీద కనిపిస్తున్నది. రాయాలని కలలుగనే అద్భుత సృష్టి' మాత్రం పాతపుస్తకాలలా మనసులోనే దుమ్ముగొట్టుకుపోతు

న్నది.

ఇందులో కొంత అతిశయోక్తి లేకపోలేదు. అయినా నిజం కూడా ఉంది. మంచి కథావస్తువుల్ని, మంచి పాత్రల్ని రాయవలసినంత సహజంగా రాయలేకపోతున్నాను. టైం లేదు. రాయకపోతే డబ్బు రాదు. అందువల్ల హడావిడిగా రాసి నాకు నేనే ద్రోహం చేసుకుంటున్నాను. ఇది నిజం. నన్ను మూర్ఖుడంటారో, అహంకారి అంటారో మీఇష్టం. రాయాలనుకున్నవి రాసే తీరికలేదు. రచనా రహస్యం తెలుసు. కాని ఆచరించలేని సత్యంవల్ల ఫలమేమి? బహుశా, రచయితలందరి బతుకూ యింతేనేమో!...

**(1895 నాటి లేఖ)**

... నీ కథలు బాగానే వుంటాయి. కాని తిరగరాయ గలిగితే మరింత బాగుంటాయి. రచనలో క్లుప్తత లేదు. ప్రతిభ ఉంది. బాగానే రాస్తావు. కాని 'నేర్పు' కావాలి. బహుశా బద్ధకమూ, అశ్రద్ధా అనుకుంటాను. పాత్రల గురించి తీసుకోవలిసినంత జాగ్రత్త తీసుకోలేదనిపిస్తుంది. అనవసరమైన సమాచారంతో పాఠకుడికి విసిగెత్తిస్తావు. రాతినించి శిల్పం చెక్కటమంటే ఆకారానికి అనవసరమైన రాతినంతా తొలగించటమని అర్థం.

తెలిసిందా? ....

**ఐ.ఎల్. షెగ్లోవ్‌కు రాసిన లేఖ–1988 "లైట్స్" కథ గురించి**

"...ముగింపు గురించిన నీ అభిప్రాయంతో అంగీకరించను. మానసిక శాస్త్రజ్ఞుడు తనకు అర్థం కానిది కూడా అర్థమైందని బుకాయించక్కర్లేదు. ముఖ్యంగా ఎవరికీ అర్థం కానిది తనొక్కడికే అర్థమైందని అసలు చెప్పగూడదు. దీని గురించి ఎక్కువగా మాట్లాడటం వదరుబోతు తనమనిపించుకుంటుంది. ఈ లోకంలో ఏదీ మనకు పూర్తిగా అర్థంకాదని అంగీకరిద్దాం. మూర్ఖులు, వదరుబోతులు మాత్రమే తాము సర్వజ్ఞులమనుకుంటారు..."

**1888 నాటి మరో లేఖ**

"...పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నవాడు అబద్ధమాడలేడంటారు నిజమే. కాని దుఃఖానికీ, తాగుడుకూ పోలిక వుంది. అబద్ధాలకోర్లు ప్రాణం పోతున్నప్పుడు కూడా అబద్ధాలాడతారు..."

**డైరీలో నుంచి**

"దేవుడున్నాడు", "లేడు" అన్న అభిప్రాయాల మధ్య పరచుకున్నదో మైదానం. విజ్ఞుడు ఈ మైదానంలో సంచరించాలనుకుంటాడు. సగటు మనిషి ఏదో ఒకటి నమ్ముతాడు. ప్రయాణం అతడికిష్టం వుండదు. అంటే తెలుసుకునే కోరిక లేదన్నమాట.

**నోట్‌బుక్‌లో నుంచి**

చరిత్రను కొందరు వరుస యుద్ధాలుగా అభివర్ణించారు అంటే జీవిత లక్ష్యం యుద్ధమేనా?

అందరూ గొప్పలు చెప్పుకుంటారు. మామూలు మనుషులు పైకెన్ని చెప్పినా తాము పిచ్చుకలకన్నా గొప్పేమీ కాదని వాళ్లకు తెలుసు. కాని సాహితీ సమరాంగణ సార్వభౌములు మాత్రం తాము గండభేరుండపక్షులమనుషులమనుకుంటారు. పేడపురుగులకన్నా విలువలేని నీచులు.

సగటు మనిషి అంటే ఎవరు? మనకన్నా తక్కువ ఆదాయం ఉన్నవాడు. ప్రభుత్వం జనాభాను రెండుగా విభజించి చూస్తుంది. పన్నులు కట్టేవాళ్లు... కట్టని వాళ్లు...

వాడు (చెహోవ్ తమ్ముడు) ప్రేమ గురించి తెగ లెక్చర్లిస్తాడు. కాని ప్రేమించలేడు.

– ముక్తవరం పార్థసారథి

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)**

★

జ్ఞానతరంగిణి

# మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్‌గారి సందేశం

# మిత్రులు

కష్ట సమయంలో ఉపయోగ పడి, సాయపడే మనిషే అసలైన మిత్రుడు.

మిత్రుని కష్టాల్ని చూసి బాధ పడని వారిని చూస్తేనే పాపం చుట్టుకుంటుంది. "ఏ మనిషైనా తన దుఃఖం కంటే తన మిత్రుని దుఃఖాన్ని పర్వతమంతటిదిగా భావించి తనే మోసే ప్రయత్నం చేయాలి" అని సుగ్రీవుడిని స్నేహితునిగా స్వీకరించేటప్పుడు శ్రీరామచంద్రుడు చెప్పాడు.

మనిషికి మిత్రులు దొరకనూవచ్చు, దొరకక పోనూవచ్చు. కానీ మంచి మిత్రులు అరుదుగా లభిస్తారు.

మంచి మిత్రుడు దొరికిన మనిషి గొప్ప భాగ్యవంతుడనుకోవాలి.

బంధువులు, ఇరుగుపొరుగు, పరిచయస్తులు ముప్పాతిక భాగం స్వార్థపరులు, అసత్యవంతులే. వీరు నీ కష్టాల్ని పంచుకోరు. సత్యమైన మిత్రులే కష్టకాలంలో ఆదుకుంటారు.

బంధువులు అవసరానికి సాయపడక పోగా అపాయాల్ని, ఆపదల్ని మరింతగా సృష్టిస్తారు. మంచి మిత్రుడే నీ దుఃఖంలో పాలు పంచుకుంటాడు.



మహర్షి దాతాదయాల్ శివవ్రత్‌లాల్ వర్మన్

బాధపడుతున్న పుత్రునికోసం ఏ తల్లయినా దుఃఖితురాలవుతుంది. అదే విధంగా మిత్రుడు దుఃఖ సమయంలో తనవన్నీ సమర్పించడానికి సిద్ధపడతాడు.

నీకు చాలా మంది మిత్రులున్నారా? వాళ్ళు నీ సత్యమైన మిత్రులమని నిన్ను నమ్మిస్తున్నారా? వారి మాటల్ని విశ్వసించకు. వారి కుహనా ప్రేమల్ని నమ్మి మోసపోవద్దు.

మాటలు చెప్పటం తేలికే! ఆచరించటమే కష్టం. నాలుక కత్తెరలా నడుస్తూనే ఉంటుంది. మనోస్థితి దానికర్థం కాదు.

నీటిపై రాసిన రాతలు నిలువవు. అట్లాగే అసత్యవంతుల వాగ్దానాలకు, ప్రమాణాలకు నిలకడ ఉండదు. వారి నోటితో చెప్పేదానికీ, చేసే పనులకూ పొంతన ఏమాత్రం ఉండదు.

కొందరు మిత్రులు ఒకటి, రెండూ సార్లు సాయపడ్డా మూడోసారి నిరాకరిస్తుంటారు. నిన్ను చేతకాని వాడివనీ, దుఃఖం కలిగిస్తావనీ అనవచ్చు. సత్యమైన మిత్రుని నిర్ధారించటం కష్టం. ఎంతటి మిత్రునికైనా, ఏ దశలోనైనా సంపూర్ణ అధికారం ఇవ్వకు. ఒక వేళ అతను నీకు పరిస్థితుల దృష్ట్యా శత్రువుగా మారితే తన శత్రుత్వంతో నీకు హాని కలిగించవచ్చు.

విద్యా బుద్ధి, వివేకం, గొప్ప పేరు, ధన సంపద గలవాళ్లు ఎందరో ఉంటారు. వీరిలో నుండి ఎవరూ ఎవరికీ సత్యమైన మిత్రులు కాలేరు. అందరూ స్వార్థవశాన ప్రశంసించుకుంటూ ఉంటారు. మేఘం ఛాయ గాలి రానంతసేపే!

స్వార్థ ప్రయోజనం కోసం చేసే స్నేహం దుష్పరిణామాలకి దారి తీస్తుంది. ఈ రోజు అది తీయగా అనిపించినా రేపు చేదుగా మారవచ్చు.

మిత్రత్వం ఒక విధమైన భక్తి, అది నిష్కామమైనదీ, నిస్వార్థమైనదీ కావాలి.

స్నేహం నిర్మలమై, అచలమై ఉండాలి. క్షణం క్షణం మారేది స్నేహం అనిపించుకోదు.

స్నేహం ఒకవిధమైన భక్తి, దీనిని సఖా భావం అంటారు. ఎవరైతే తనను తాను నీ కర్పించుకుంటాడో అతనే సత్యమైన మిత్రుడనవచ్చు.

మోసగించడానికే కొందరు స్నేహం చేస్తుంటారు. వాళ్లు పరోపకారులు అనిపించుకోడానికి తమ పేరు ప్రతిష్ఠలు పెరగాలనే స్వార్థంతో సహాయం చేస్తారు. వీరి నుండి జాగ్రత్తగా వ్యవహరించు. నీ రహస్యం వీరికి చెప్పకు. వారి రహస్యాల్ని తెలుసుకునేటందుకు ప్రయత్నించకు. ఇలాంటి వారితో కలయిక జరిగినా లాభం లేదు. వారు విశ్వసించినందువల్ల నీ ప్రతిష్ట పెరగదు కూడా.

ఎవరైనా మిత్రుడు నీ దగ్గరకొచ్చి ఏదో ఒక రహస్యం చెప్పి జాగ్రత్తగా ఉండుమనీ, ఎవరికే చెప్పకుమనీ నిన్ను హెచ్చరిస్తే ఈ మాట అతను మరో మనిషికి కూడా ఇలాగే చెప్తాడని నిశ్చయించుకో. ఎప్పుడైనా విషయం బయటికి వస్తే అతను నీపేరే చెప్పి, నీపై అభాండం తోసెయ్యగలడు. ఆపై శత్రువుగా మారగలడు.

సద్గురువు అదృష్టవంతులకే దొరుకుతాడు. సత్యమైన మిత్రులు కొందరికే లభిస్తారు.

నిజమైన మిత్రుని సలహాను నిరాదరించకు.

దుఃఖంలో అందరూ నిన్ను వదిలేసినా మిత్రుని స్నేహం ఛాయలా నిన్నంటి ఉంటుంది. నిన్నందరూ దోషిగా నిలబెట్టినా సత్యమైన మిత్రుడు నీకు సాయపడతాడు.

ప్రేమికుల కళ్లలాగే మిత్రుని కళ్లు కూడా గుడ్డివేనని చెప్పవచ్చు. ఎందుకంటే అవి నీలోని లోపాల్ని, బలహీనతల్ని పరిశీలించవు. లైలా కురూపి, మజ్నూ అందగాడు. అయినా అతనికి ఆమె ప్రపంచంలోకెల్లా రూపవతిగా తోచేది. ఇలాంటి మిత్రత్వాన్నే సత్యమైన ప్రేమ అంటారు.

మిత్రుని స్నేహం నీకు కావాలి. కానీ అతనిలోని లోపాలతో నీకేం పని?

నిజమైన మిత్రుడు నీ కోసం దూషణానికి గురి అవుతాడు. కానీ నీ స్నేహం విడువడు. ప్రపంచం నిన్ను దూషించినా అతని మనస్సులో నీపట్ల స్నేహభావన మారదు. మిత్రుడు సత్యమైన మనసుతో నిన్ను ప్రేమిస్తాడు. నిన్నెందరు నిర్లక్ష్య పరిచినా మిత్రుని సాయం తప్పకుండా ఉంటుంది. ఇలాంటి మిత్రుడు దొరికితే అది పరమాత్ముని దయే అనుకోవాలి. మిత్రుడు నీ ఆపత్సమయంలో ఓదార్పునిస్తాడు. అవసరమైతే ప్రాణమైనా ఇస్తాడు.

సేకరణ, అనువాదం: జ్యోతిరాణి

★

వ్యంగ్య రచన

# రై(లా)లు...సవారీ

*'బండెనక బండి కట్టి, పదహారు బండ్లు కట్టి...'*

*సమస్యలన్నీ మూటకట్టి... రైలెక్కి పోదము కొడకో!*

ఎప్పుడూ అలవాటుగా లేటుగా వచ్చే రైల్లోకి పాడుకుంటూ ఎక్కబోతుంటే... ఒకటే తోపులాట. అది జనరల్ కంపార్ట్‌మెంట్.. మన రాజకీయపార్టీ కార్యాలయంలా ఉంది. కాస్త దౌర్జన్యంతో లోపలకి వెళ్లాను. కూర్చున్న వాడు 'రాజు'...నిలుచున్నవాడు 'పేద'గా కనిపించారు.. ఎలక్షన్లలో సీటు సంపాదించ వచ్చునేమోగాని, రైలులో చోటు సంపాదించలే మనుకున్నా...

పక్క స్టేషన్లో ఉసూరుమంటూ ఆగిపోయిన రైలుని చూసి అందరూ నిట్టూర్చారు.. కొందరు కబుర్లలో పడ్డారు... శ్రీకాకుళం అప్పడాల నుంచి శ్రీహరికోటలో అంతరిక్ష కేంద్రం వరకూ చర్చల్లో చోటు సంపాదించు కుంటున్నాయి. నేనేదో ఆలోచనలో పడ్డాను... కొందరు కునికిపాట్లు పడుతు న్నారు...

కాసేపటికి...

'అరెవో సాంబా!' అని తలుపు దగ్గర సడ న్‌గా పెద్ద గాండ్రింపు వినిపించింది.

ఎవరాని అదిరిపడి చూశాం...

ఎదురుగా ఫుల్ వైట్ ఖుర్తా, పైజమాలో ఓ వ్యక్తి మెరిసిపోతూ కనిపించాడు. హెయి ర్‌స్టైల్ హిప్పీ కటింగ్‌లా ఉంది... చేతిలో ఓ తల్వార్ ఉంది.

'అరే భయ్యా! మేరా నామ్ లాలూ హై! అంటూ అందరికీ షేక్‌హ్యాండ్ ఇస్తూ పరి చయం చేసుకున్నారు.

ఆశ్చర్యంగా చూశాం...

కాసేపటికి...'ఏంటి సార్! రైలు కదలడం లేదు... మూడుగంటలైంది' ఆవేదనగా అన్నా హిందీలో వెంటనే స్పాట్‌లో ఎంక్వైరీ నెంబర్ తీసుకొని సెల్‌ఫోన్‌లో చకచకా నెంబర్ నొక్కారు. ఎంతసేపైనా ఎవరూ తీయలేదు...వెంటనే రైల్లోంచి కిందకు దూకి శతాబ్ది కన్నా స్పీడుగా ప్లాట్‌ఫారమ్‌పై నుంచి వెళుతుంటే దబ్‌మని ముందుకు తూలి పడ బోయారు. చివరి క్షణంలో నిభాయించుకొని చూస్తే అక్కడో పెద్ద గొయ్యి కనిపించింది...

ఆ పక్కనే కుళాయి కనిపించింది. గబ గబా వెళ్ళి తిప్పారు... నీళ్ళు రాలేదు... నుదురు చిట్లించారు. బాత్‌రూమ్‌ల దగ్గరకు వెళ్ళి ఆగిపోయారు. అర్థమైనట్లుగా... కుర్చీలు ఎక్కడో విసిరేసినట్లున్నాయి. ప్రయాణికులంతా పట్టాలు దాటి వెళుతుంటే బ్రిడ్జి లేదాని వెదికారు... అదెక్కడో విసిరేసి నట్లుగా కనిపించింది.

ఇంక ఆగలేదు.. గబగబా స్టేషన్ మాస్టర్ దగ్గరకు వెళ్ళారు... ఫోన్ ఎందుకు తీయలే దని చెడా మడా తిట్టేసి... నేలమీదే చతికల పడిపోయారు.

అధికారులు క్షణాల్లో మట్టిముంతల్లో చాయ్, లస్సీ, మాతాకోలాలు తీసుకొచ్చారు, మూతి తుడుచుకోవడానికి ఖద్దరు రుమాలు పట్టుకొని వినమ్రంగా నిలుచున్నారు.

డ్రైవర్‌ని పిలవమని గాండ్రించారు.

అతను ఒణికిపోతూ వచ్చి.. 'సార్ బ్రేకులు... అంటూ నసిగాడు'

లాలూ సాబ్ ఆగ్రహంతో 'ఎందుకైనా మంచిదని, నా కుడి జేబులో మూడు, ఎడమ జేబులో మూడు సస్పెన్షన్ లెటర్లు పెట్టుకు తిరుగుతున్నా.. అందులో ఒకటి నీకిస్తా.. కావాలా' అని హిందీలో అనగానే డ్రైవర్ హడి లిపోయాడు.

రైలు కదులుతుంటే అందరం ఎక్కి కూర్చు న్నాం. మాతోపాటే లాలూసాబ్ కూడా ఎక్కారు.

'ఈ రైలు ఎటెళుతుందీ' అని అడిగారు...

కలకత్తా వైపు... అన్నాం...

'అలా వద్దూ! బీహార్ వెళదాం... అక్కడ

*8 జూన్ 2005*

మీరు చక్కగా నాతోపాటు గెంజి తాగొచ్చు.. ఆలూ సమోసాలు తినొచ్చు.. రాత్రంతా చలి మంటేసుకుని వెచ్చగా కూర్చోవచ్చు..నాలా చొక్కాలేకుండా తిరగొచ్చు కుప్పిగంతులు వేయొచ్చు మా రబ్రీకి 300 ఆవులు ఉన్నాయి..వాటి పాలు పితకొచ్చు ఇంకా ఎన్నో ఆటలున్నాయి..అని కళ్లింతచేసుకుంటూ ఓ పాన్ వేసుకొని..

సడన్‌గా అమితాబ్ పాట అందుకున్నారు.

'ఓ ఖైకే పాను బనారస్‌వాలా' అంటూ నడుంమీద ఓ చెయ్యి పెట్టుకొని, మరోచేయిని పైకిఎత్తి తిప్పుతూ బీహారీ నృత్యం మొదలెట్టారు..

అందరం ఆశ్చర్యంగా చూసి..చప్పట్లు కొట్టాం..

ఇంతలో రైలు నెమ్మదిగా కదిలింది...

మాతోపాటు ఎక్కిన ప్రయాణికుడు ...

'ఇప్పుడు బీహారేటిరా బాబూ! ముందు మా అత్తోరింటికెళ్ళాలి... అయినా అక్కడ దోపిడీదారులు, దొంగలు ఎక్కువంట కదా! ఆందోళనగా అన్నాడు.

అవేమీ పట్టించుకోకుండా బుద్ధిమంతునిలా మూతిమీద వేలు పెట్టుకొని కూర్చున్న లాలూని ఉండబట్టలేక అడిగా

'సార్! బడ్జెట్.. మీ స్టైల్‌లా వెరైటీగా లేదన్సార్'

కలకత్తా స్వామీజీలా నవ్వారు.

'ఉమాభారతిని చూశారా! తను పదవిలో ఉన్నప్పుడు ఉద్యోగస్తులందరూ కట్నం తీసుకోకూడదని, పెళ్ళిల్లో వచ్చే గిఫ్టులకు లిస్టురాసి ప్రభుత్వానికి చూపించాలని రూలింగ్ ఇచ్చిందా! నేనూ అలాగే వెరైటీగా చేద్దామనుకున్నా! పెళ్ళికాని యువకులు..కట్నం తీసుకోనని రాసిస్తేనే.. రైలెక్కాలని, వారు గిఫ్టులు అడిగినట్లు... ప్రయాణికుల సూట్‌కేసులు, లగేజీలు అన్నీ రైల్వేవాళ్ళకి అప్పగించి...ఒట్టి చేతులతో ఇంటికి వెళ్ళమని చెప్పేవాడిని..! కానీ కుదరలేదు. కొన్ని అదృశ్యశక్తులు పనిచేశాయి ..ప్చ్ అని బాధపడ్డారు

'అది కాదండీ! ఆంధ్రాకు బాగా అన్యాయం చేశారు'

ఓ ప్రయాణికుడు అన్నాడు

ఆమాటలకు సీరియస్ అయిపోయి.. మరి నాకు జరిగిన అన్యాయాన్ని ఎవరితో చెప్పుకోను.. ఉపప్రధాని పదవి అడిగాను ఇవ్వలేదు, ఆఖరికి హోంశాఖ అడిగాను.. అదీ ఇవ్వలేదు.. చివరాఖరికి ఇది ఇచ్చారు..నేను సర్దుకుపోలా..మీరు నాలాగే సర్దుకుపోవాలి..

'అంతా బీహార్‌కే చేశారని అంటున్నారు'.. నెమ్మదిగా అన్నా

అందరిదీ అదే ఏడుపు... అక్కడ ఎన్నికలు జరిగాయి..అదెవరూ అర్థం చేసుకోరేం!..అందుకే చేశాను..అయినా ఫలితం లేదు..గమ్యస్థానం ఎప్పటికి చేరుతామో తెలియని రైలు ప్రయాణంలా' ఆవేదనగా అన్నాడు.

ఇంతలో రైలు వేగం పెరిగింది... ఆగాల్సిన స్టేషన్లో ఆగలేదు... క్షణక్షణానికి స్పీడు పెరుగుతూనే ఉంది... అందరికీ విషయం అర్థమైంది...

లాలు మహరాజ్‌కి కూడా! ఓ చేతిలో ఉన్న ఆలూ సమోసాలు, మరో చేతిలోని కళ్ళజోడు డబ్బా జారిపోయాయి...

బతికుంటే బలుసాకు తినొచ్చు... బ్రేకుల్లేని రైల్లోంచి దూకడమే మేలని లాలు... భుజం మీద కండువాతీసి నడుంకు చుట్టుకుని రడీ అయ్యారు...

అందరూ అతని వెనుకే దూకడం మొదలు పెట్టారు...

నేనూ దూకాను

కాని... ఒక్కసారే పక్కనే కూర్చుని ఉన్న మిత్రులమీద పడిపోయాను

అందరూ నవ్వేశారు

'ఏంటిరా! కలగన్నావా!' అని అందరూ అనగానే క్షణంసేపు అర్థం కాలేదు..

పగటి కలని తెలిసి నాలో నేను నవ్వుకున్నాను...

– శ్రీనివాస్ మిర్తిపాటి

★



# మూడు వారాలనుకున్నది... పదిహేడు వారాలు నడిచింది

కథ వెనుక కథ

తెలుగులో వచ్చిన గొప్ప రొమాంటిక్ నవలల్లో తొలివరుసలో నిలుస్తుంది. 'వెన్నెల్లో ఆడపిల్ల'. ఇరవైరెండేళ్ల క్రితం రాసిన ఈ నవల అప్పట్లో సృష్టించిన సంచలనం అంతా ఇంతా కాదు. ప్రముఖ రచయిత యండమూరి వీరేంద్రనాథ్ 'కీర్తిపథ'సోపాన పటంలో దీన్ని వెన్నెల మెట్టుగా మనం భావించవచ్చు. 'ఆంధ్రభూమి'లో ఆ నవల సీరియల్‌గా వచ్చినంత కాలం పాఠకుల్ని ఉర్రూతలూగించింది. నవలగా వచ్చాక కూడా ఆంధ్ర రాష్ట్రాన్ని ఓ ఊపు ఊపింది. ఆ రోజుల్లో కాలేజీ కుర్రాళ్లు, అమ్మాయిలు ఎవరిచేతిలో చూసినా ఈ నవలే కన్పించేదంటే అతిశయోక్తి కాదు. ఎందుకంటే ముఖ్యంగా నాటి యువతరాన్ని ఈ నవల విశేషంగా ఆకర్షించింది.. అలరించింది. దీనిపై వారు గంటలతరబడి చర్చోపచర్చలు సాగించేవారు. కథా వస్తువులో నవ్యత్వం, శైలిలో కొత్తపోకడలు నవలకు వైవిధ్యంతోపాటు సజీవత్వాన్ని తెచ్చిపెట్టాయి. రచయితగా తన కెరీర్‌లో ఎంతో గొప్ప పేరు తెచ్చిన 'వెన్నెల్లో ఆడపిల్ల' కథవెనుక కథను యండమూరి ఇలా వివరిస్తున్నారు..

సుమారు పాతికేళ్లక్రితం అనుకుంటా.. ఆంధ్రభూమి వీక్లీలో లేఖల రూపంలో ఓ సీరియల్ వస్తుండేది. అందులో నాయిక, నాయకుడు పరస్పరం ఉత్తరాలు రాసుకుంటూ ఉండేవారు. స్టాంపుల కలెక్షన్ గురించి, టూరిజం గురించి వాటిలో విస్తృతంగా చర్చించేవారు. ఆ పత్రిక సంపాదకులు సికరాజుతో కూర్చున్నప్పుడు ఓసారి మాటల్లో దీని ప్రస్తావన వచ్చింది. లేఖారూపంలో సీరియల్ ఇవ్వదలుచుకుంటే ఇంత కంటే రొమాంటిక్‌గా, కవితాత్మకంగా ఇంకా బాగా రాయొచ్చుగదా అని సూచించాను.

## సలహాచెబితే నన్నేరాయమన్నారు

వెంటనే ఆయన "సరే.. ఆ పనేదో మీరే



యండమూరి వీరేంద్రనాథ్

చేయండి" అన్నారు. అలా శ్రీకారం చుట్టుకుంది వెన్నెల్లో ఆడపిల్ల.. మొదట మూడు వారాల సీరియల్‌గా రాయాలని అనుకున్నా. కానీ మొదటివారం పాఠకస్పందన చూశాక ఏడు వారాలకు పెంచాలని సంపాదకుడు, నేను నిర్ణయించుకున్నాం. చివరికిపదిహేడు వారాల సీరియల్ అయింది.

## కథానాయిక పేరుతో తమాషా

నవలలో కథానాయిక పేరు సస్పెన్స్. ఇంగ్లీష్ అక్షరం 'ఆర్'తో ప్రారంభం అవు

తుందని ఆమెపాత్ర హీరోకు సూచిస్తుంది. సరే 'ఆర్' ఆంగ్ల అక్షరంతో ప్రారంభమయ్యే ఆ అమ్మాయి పేరేంటో ఊహించి పోస్టుకార్డుపై రాసి మాకు పంపండి అని పాఠకులకు ఓ చిన్నపోటీ పెట్టాం. మీరు నమ్ముతారో నమ్మరోగానీ పదివేలకు పైగా కార్డులు వచ్చి పడ్డాయి. నిజానికి అప్పటివరకూ హీరోయిన్‌కు ఏం పేరుపెట్టాలో నేను ఆలోచించనేలేదు. పాఠకులు పంపిన వాటిలో ఏది కొత్తగా.. అందంగాఉంటే ఆ పేరు పెడదామన్నది నా ఆలోచన. పదివేల పేర్లలో చివరికి 'రమ్యస్మృతి' అనే పేరు మాకందరికీ నచ్చింది. అయితే అందులో స్మృతిఉంది కనుక నవలను విషాదాంతం చేయాలని అప్పటికప్పుడే నిర్ణయించుకున్నాను.



## చివరి ఉత్తరం కోసం 20 రోజులు

విషాదాంతం చేయాలనుకోవడం వల్ల చిట్టచివరి ఉత్తరం రాయడానికి నాకు ఇరవై రోజులు పట్టింది. నాలుగు పేజీల రచనకు అంత సమయం తీసుకుందంటే ప్రతిపదాన్నీ ఎంతలా ఆలోచించి రాశానో మీరు అర్థం చేసుకోవచ్చు అంత కసరత్తు చేశాంగనుకే అంతటి సక్సెస్‌ను చవిచూశాం అన్పిస్తుంది.

## ఆ అమ్మాయి ఉత్తరాలే స్ఫూర్తి

సాహితీ రంగంలో రచయితగా నేను కాలూనుకున్నాక కృష్ణాజిల్లా నూజివీడు నుంచి ఒకమ్మాయ్ నా అభిమానినంటూ ఉత్తరాలు రాస్తుండేది. ఆ ఉత్తరాలన్నీ ఎంతో చక్కగా కవితాత్మకంగా ఉండేవి. అందమైన పదాలను ఏర్చి కూర్చి రాసే ఆమె నేర్పుచూసి ముచ్చట పడేవాణ్ని. ఓ రకంగా చెప్పాలంటే వెన్నెల్లో ఆడపిల్ల నవల్లోని ఉత్తరాలకు ఆ అమ్మాయి లేఖలే నాకు గొప్పస్ఫూర్తి..

## పొరపాటు సరిదిద్దుకున్నాను

ఈ నవల చదరంగం ఆట నేపథ్యంతో సాగుతుంది. అయితే ఇందులోఓచోట ఏషియన్‌గేమ్స్‌లో రష్యన్ క్రీడాకారుడితో నవలా నాయకుడు తలపడ్డట్టుగా రాశాను. అది అచ్చయిపోయాక గుర్తొచ్చింది. ఏషియన్‌గేమ్స్ అని రాశాం.. ఈ పరిధిలోకి రష్యా రాదుకదా అని. అందుకే తరవాత భాగాల్లో దాన్ని ఏషియా-రష్యన్ అనో లేక దానికి సమానార్థకంగా వచ్చేపేరుతోనో పొరపాటు సరిదిద్దుకున్నాను.

ఈ నవలలోని జేమ్స్‌పాత్ర నా భావాలకు దగ్గరగా ఉన్న పాత్ర అని చెప్పవచ్చు.

## రికార్డు బ్రేక్

సీరియల్ పూర్తయ్యాక నవలగా ప్రింట్ చేసి మార్కెట్‌లోకి విడుదల చేశాం. ఉదయం ఎనిమిదింటికి మార్కెట్‌లోకి వచ్చిన నవల కాపీలు సాయంత్రంఏడున్నరకల్లా అయిపోయాయి. నాకు తెలిసి

ఇది రికార్డే!! అలాగే ఈ నవల ఇప్పటికి ముప్ఫై ముద్రణలకు వెళ్లింది.



## టీవీసీరియల్‌కు నందిఅవార్డులు

వెన్నెల్లో ఆడపిల్లను అనంతర కాలంలో నేనే టీవీ సీరియల్‌గా తీశాను. ఆ రోజుల్లో టీవీలో కూడా ఎందరినో అలరించింది. మంచి రేటింగ్ వచ్చింది. అంతేకాదు.. ఉత్తమ దర్శకత్వం, తృతీయ ఉత్తమ సీరియల్‌గా నంది అవార్డులు తెచ్చిపెట్టింది.

## సినిమా తీయొద్దన్నా

కొన్నెళ్ల తర్వాత ప్రముఖ నిర్మాత కె. ఎస్. రామారావు 'వెన్నెల్లో ఆడపిల్ల నవల'ను సినిమాగా తీస్తానంటూ వచ్చారు. ఇలాంటి నవలను సినిమాగా తీయడం కష్టం.. వద్దు అని హెచ్చరించిన వాళ్లలో నేనూ ఒకడిని. కానీ ఆయన తీశారు.. పోయింది. నిజానికి కథలో హీరోయిన్ ఎవరన్నదే సస్పెన్స్.. అదే కథకు ప్రాణం.. జీవధాతువు. ఆ విషయాన్ని పక్కకు పెట్టి కథానాయికను మొదటే చూపించేయడంవల్ల కూడా సినిమా దెబ్బతింది.

## తిలక్ నా అభిమానకవి..

వెన్నెల్లో ఆడపిల్ల రాయడం నా జీవితంలో ఓ మధురమైన అనుభూతి. ప్రముఖ కవి బాలగంగాధర తిలక్ నా అభిమాన కవి కావడంతో నవలను ఆయనకే అంకితమిచ్చాను. నవలకు ఆ పేరుపెట్టడానికి కూడా ఆయనే ప్రేరణ.. 'అమృతం కురిసిన రాత్రి'లో.. నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడపిల్లలు అని ఆయన రాసిన విషయం తెలిసిందేకదా? అందుకే అదే పేరు పెట్టాను. కన్నడంలోనూ సక్సెస్.

వెన్నెల్లో ఆడపిల్ల నవల 'బెళదింగళ బాలె' పేరుతో కన్నడంలోకి అనువాదమైంది. అక్కడి పాఠకులనూ విశేషంగా ఆకర్షించింది. ఆ భాషలోనే సినిమాగా కూడా దీన్ని తీశారు. బ్రహ్మాండంగా విజయవంతమైంది.

సేకరణ: చంద్రప్రతాప్

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనా శక్తిని రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తమ ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**నవలను గురించే కాక ఇతర శీర్షికలపై కూడా పాఠకుల అమూల్య అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.**

**కూపన్**

జూన్ చతుర నవల ***హీరో***

సమీక్షకుని పేరు: ____________________

చిరునామా: ____________________

____________________

____________________

# చతుర

## నవలా పరిచయం

తల్లి, తండ్రి, చెల్లి, బంధువులు, స్నేహితులు, ఆప్యాయతలు, అనుబంధాలు, శుభకార్యాలు, ఆనందాలే లోకంగా గడిపిన అతనికి స్త్రీజాతిపై అపారమైన సానుభూతి, గౌరవం ఉన్నాయి. మహిళలు బాధపడుతుంటే చూడలేని ఆ సున్నిత మనస్కుడు ఓ స్నేహితురాలి కోసం, ఓ కుటుంబం కోసం ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొన్నాడు. ఎంతో సమయం, డబ్బు వెచ్చించి, ఆడపిల్లల జీవితాలతో ఆడుకునే ఓ భయంకరమైన ముఠాను పోలీసులకు పట్టిచ్చాడు.

"ఓ కుటుంబానికి చెడు జరగకూడదు" అనే ఒకేఒక్క తపనతో పోరాడి విజయం సాధించి "హీరో"గా మన్ననలందుకున్న వైనాన్ని అద్భుతమైన కథాకథనంతో వెలువరించిన

సి.ఎన్.చంద్రశేఖర్ నవల

# హీరో

ఈ నెల చతుర సమర్పణ

## రచయిత పరిచయం



బి.యస్‌సి. చదివిన సి.ఎన్.చంద్రశేఖర్ చిత్తూరు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గ్రీమ్స్‌పేట బ్రాంచిలో సీనియర్ అసిస్టెంట్‌గా ఉద్యోగం చేస్తున్నారు.

వివిధ పత్రికలలో 80కథలు, 10 కవితలు, ఆంధ్రభూమి మాస పత్రికలో మినీ నవల ప్రచురితమయ్యాయి.

నీ కోసమే, కనులు మాటలాడుననీ' కథాసంపుటాలు, స్రవంతి నవల ప్రచురించారు.

**చిరునామా: సి.ఎన్. చంద్రశేఖర్**

నెం. 22, గాయత్రీనగర్ కాలనీ, గ్రీమ్స్‌పేట,చిత్తూరు-517 002.

"మాధవి నర్సింగ్ హోం" ముందు బైక్ ఆపాడు శశాంక్. బైక్ లాక్‌చేసి బ్యాగు తీసుకొని లోపలికి అడుగుపెట్టాడు.

వరండాలో ఉన్న నర్స్ అతన్ని చూసి పలకరింపుగా నవ్వింది.

"హలో గుడ్‌మార్నింగ్. మేడమ్ బిజీగా ఉన్నారా" అని అడిగాడు ఆమెని.

ఆరోజు ఆదివారం. మధ్యాహ్నం పన్నెండు దాటాక పేషెంట్స్ అంతగా ఉండరు. అందుకే ఆ సమయంలోనే డాక్టర్ మాధవిని కలవడానికి వస్తాడు శశాంక్. అప్పుడైతే ఆమెతో కాసేపు తీరికగా మాట్లాడవచ్చని. వాళ్ళిద్దరి మధ్యా ఓ డాక్టరు, ఓ మెడికల్ రిప్రెజెంటేటివ్‌ల పరిచయమే కాదు, స్నేహబంధం కూడా ఉంది.

'ఒకే ఒక్క పేషంట్ ఉన్నారు. వచ్చేస్తారు. కూర్చోండి" అంది నర్స్.

రిలాక్స్‌డ్‌గా కుర్చీలో కూర్చుంటూ వరండా అంతా కలియచూశాడు. 'తను కిందటిసారి వచ్చి వెళ్ళిన తర్వాత క్లినిక్‌లో చాలా మార్పులు చేశారు' అనుకున్నాడు. వరండా గ్రిల్‌కు పాకించిన మనీ ప్లాంటు ఉన్న కుండీ చక్కగా పెయింట్ చేయబడి కొత్తగా కనిపిస్తోంది. ఓవైపు గోడకు జలపాతం వాల్ పేపర్ అతికించబడి మనం నిజంగా జలపాతం ఎదురుగా కూర్చున్నామా అన్నంత అనుభూతిని కలగజేస్తోంది.

ఇంతలో లోపలున్న పేషంట్ బయటకు రావడం కనిపించి లేచి నిలబడ్డాడు. నర్స్ లోనికెళ్ళి, మళ్ళీ తిరిగి వచ్చి "వెళ్లండి" అంది.

"గుడ్ మార్నింగ్ డాక్టర్" అంటూ లోపలికి అడుగుపెట్టాడు. ఎప్పటిలాగే అందమైన చిరునవ్వుతో అతనిని రిసీవ్ చేసుకొంది డాక్టర్ మాధవి.

"ఏమిటి క్లినిక్ రూపురేఖలే మార్చేశారు? " డాక్టరు డిగ్రీతోపాటు ఇంటీరియర్ డెకొరేషన్ కోర్సులు కూడా చేశారా? ' అని అడిగాడు గదిని నిశితంగా పరిశీలిస్తూ.

"అబ్బే. అలాంటిదేం లేదు. సహజంగానే ఇంటీరియర్ డెకొరేషన్ అంటే నాకెంతో ఆసక్తి. ఇప్పుడు ఆ సబ్జెక్టుపై చాలా పుస్తకాలొచ్చాయి కదా. ఖాళీ సమయంలో వాటిని తిరగేస్తూ, ఇలా ఎక్స్‌పెరిమెంట్స్ చేస్తుంటాను" అంది నవ్వుతూ.

"మంచి అభిరుచి. మీ ప్రయోగాలు మంచి ఫలితాలనే ఇచ్చాయి"

"ఈ నెల లేటయినట్లుంది మీ విజిట్" మాధవి అడిగింది.

"అవును. మా అమ్మకు కాస్త అనారోగ్యంగా ఉండింది. వారం రోజులు సెలవు పెట్టాను"

"ఇప్పుడెలా ఉన్నారు ఆవిడ? "

"షి ఈజ్ ఆల్‌రైట్ నౌ" అంటూ డీటైలింగ్ పాడ్ తీసుకొని తన కంపెనీ మందులను గురించి వివరించబోయాడు.

"ముందు ఆ పాడ్ మూసేయండి. మీ కంపెనీ మందులు నాకు తెలియనివి ఏమున్నాయి? " అంది మాధవి చిరుకోపం నటిస్తూ.

"అయినా చెప్పడం మా డ్యూటీ. ఇన్ని కంపెనీలు, ఇన్ని మందులు ఉన్నప్పుడు ఒక్కోసారి కొన్ని మందుల పేర్లు మరచిపోవడం జరుగుతూంటుంది. అలా మరచిపోకుండా ఉండటానికే ఈ డీటైలింగ్"

"అవసరం లేదు. మిగతా కంపెనీల సంగతేమోగాని శశాంక్ పనిచేసే కంపెనీ మందులన్నీ నాకు కంఠతా వచ్చు. చెప్పమంటారా? " గొంతు సరిచేసుకుంటున్నట్లు చేతివేళ్ళని గొంతు దగ్గర పెట్టుకొని కళ్ళు మూసుకుంది చెప్పడానికి సిద్ధమౌతూ.

"అఖ్ఖర్లేదు" అన్నాడు నవ్వుతూ. "నాపై మీ ప్రత్యేక శ్రద్ధకు థాంక్స్" అంటూ పాడ్ మూసి బ్యాగ్‌లో పెట్టాడు.

"మందులన్నీ విరివిగా రాస్తున్నాను. మీరు మెడికల్ స్టోర్స్‌లో విచారించుకో

వచ్చు" అంది మాధవి.

"మీ మాట చాలు నాకు. అది నిజమా కాదా అని విచారిస్తే అంతకంటే పాపం మరొకటి ఉండదు" అన్నాడు.

"మీరు చాలా బాగా మాట్లాడతారు. ఇలా మాట్లాడటం కూడా మీ కంపెనీవాళ్ళు ట్రైనింగ్‌లో నేర్పుతారా? "

"అందరితో అలా మాట్లాడలేం. భోజరాజును చూస్తే ఎవర్నికైనా కవిత్వం వచ్చేదట"

"చాలు చాలు. నన్ను మునగచెట్టు ఎక్కించకండి" అంది నవ్వాపుకొంటూ.

"మునగ చెట్టేం ఖర్మ? ఏకంగా టేకుచెట్టే ఎక్కిస్తాను" అన్నాడు తనూ నవ్వుతూ.

"కాఫీ తీసుకుంటారా? " బయటకు వెళ్ళి పేషెంట్స్ ఎవరూ లేకపోవడం చూసి, తిరిగి వచ్చి కుర్చీలో కూర్చుంటూ అడిగింది.

"కాఫీ కంటే తీయనైనది కావాలి"

"ఏమిటది? " అనుమానంగా చూస్తూ అడిగింది.

"ఐస్‌క్రీమ్. బయట ఎండకు చల్లగా ఏదైనా తీసుకోవాలని ఉంది"

"నో ప్రాబ్లమ్" అంటూ నవ్వి, బెల్ కొట్టి నర్స్‌ని పిలిచి,

"ఏ ఐస్‌క్రీమ్ కావాలి మీకు? " అని అడిగింది శశాంక్‌ను.

"ఏదైనా ఫరవాలేదు. చల్లగా మాత్రం ఉండాలి"

అతని జోక్‌కు మాధవితోపాటు నర్స్ కూడా నవ్వింది.

ఐస్‌క్రీం తినడం ముగించాక "ఇక నేను బయలుదేరుతాను. మా కంపెనీకి మీ సపోర్ట్ ఇలాగే కొనసాగించండి" అన్నాడు.

"తప్పకుండా. మీ కంపెనీ అంటే నాకు చాలా ఇష్టం"

తను పనిచేసే కంపెనీని ఉద్దేశించి ఆ మాట అన్నదా లేక తన కంపెనీ ఇష్టమని అన్నదా అతనికి అర్థం కాలేదు.

శశాంక్ లేవడం చూసి "మళ్ళీ మీ పునర్దర్శనం ఎప్పుడు? " అని అడిగింది.

"ఇంకో నెల రోజుల తర్వాత"

"మంచి డాక్టర్లను నెలకు రెండుసార్లు కలవమని మీ కంపెనీ మీకు ఆదేశాలిస్తే బాగుంటుంది..."

"నేను కలసినా వాళ్ళు వద్దనరు. మీరు వద్దు అనకుంటే"

"నేనెందుకు వద్దంటాను? చెప్పాగా మీ కంపెనీ అంటే ఇష్టపడతానని"

ఈసారి ఆమె అన్న 'కంపెనీ' పదానికి అర్థం అర్థమైంది అతనికి.

"థాంక్యూ. వస్తాను" అంటూ బయటకు నడిచాడు.

★ ★ ★

శశాంక్ 'మాధవి నర్సింగ్ హోం' నుంచి బయటకు వచ్చాక దగ్గరలోని మెడికల్ షాపులకెళ్ళి తన కంపెనీ మందుల మూవ్‌మెంట్ గురించి తెలుసుకున్నాడు. తర్వాత వాళ్ళకు కావలసిన మందులకు ఆర్డర్లు తీసుకొన్నాడు.

తర్వాత 'కోమల విలాస్' హోటలుకెళ్ళాడు. మేనేజర్ శశాంక్‌ను చూసి పలకరింపుగా నవ్వాడు. ఆదివారం కనుక హోటల్‌లో అంతగా రష్ లేదు. చాలా మంది మెడికల్ రెప్స్ కోమల విలాస్‌లోనే భోంచేస్తారు. హోటల్‌లోనే బస చేస్తారు. రుచిగా, శుచిగా వంటలు ఉండటమే కాక అక్కడ పనిచేసేవాళ్ళు కస్టమర్లతో ఎంతో స్నేహంగా ఉంటూ అనుబంధం ఏర్పరచుకుంటారు. అందుకే ఆ హోటల్‌లో ఒకసారి భోంచేస్తే మళ్ళీ మళ్ళీ ఆ హోటల్‌కే వస్తారు కస్టమర్లు.

భోజనమయ్యాక తన గదికి వెళ్ళాడు శశాంక్. మేడపైన ఉన్న గది అది. గది అనడం కంటే దాన్ని ఓ చిన్న ఇల్లు అనవచ్చు. ఒక పెద్ద గది, గదిని ఆనుకొని ఒక వైపు చిన్న కిచెన్, మరోవైపు టాయిలెట్. ముందువైపు ఓపెన్ టెర్రస్. గ్రౌండ్‌ఫ్లోర్‌లో ఇంటి యజమాని కుటుంబం ఉంటోంది.

గది తాళం తీసుకొని లోపలికి అడుగు

పెట్టాడు. ఇంటి కాంపౌండులోని కొబ్బరి చెట్లు బాగా ఎత్తుగా పెరిగి ఉండటంతో చల్లగా గాలి వీస్తోంది. బయట ఎండ బాగా ఉన్నా ఇంట్లో ఆ వేడి తెలియడంలేదు. దుస్తులు మార్చుకొని, ముఖం కడుక్కొని మంచంపై వాలాడు. బాగా తిరిగిన అలసట వల్ల అతనికి క్షణాల్లో గాఢంగా నిద్రపట్టేసింది.

నిద్ర లేచేసరికి సాయంత్రం ఆరున్నర అయింది. గబగబా ముఖం కడుక్కొని, రెడీ అయి కిందికొచ్చాడు. ఇంటి యజమాని భార్య ప్రమీలమ్మ బయటే నిలబడి ఉంది.

"ఊరికి వెళ్ళలేదా శశాంక్" అని అడిగింది శశాంక్‌ను చూచి.

"లేదు ఆంటీ. మొన్నేగా వెళ్ళి వచ్చాను"

"అమ్మ ఆరోగ్యం ఎలా ఉందిట ఇప్పుడు"

"బాగుందట. నిన్నే ఫోన్ చేశాను. వస్తాను" అంటూ బయటకు నడిచాడు. ప్రమీలమ్మ గవర్నమెంటు స్కూల్లో టీచరుగా పనిచేస్తూంది. భర్త ముకుందరావు గవర్నమెంట్ డిపార్ట్‌మెంట్లో పనిచేస్తాడు. వాళ్లకు ఇద్దరు అమ్మాయిలు. పెద్దమ్మాయి సాహితి చెన్నైలో ఎం.ఎస్‌సి. చేస్తూంది. రెండో అమ్మాయి కీర్తన ఇంటర్ రెండో సంవత్సరం నెల్లూరులోనే చదువుతూంది.

ట్రంకు రోడ్డు చేరుకొని ఓ హోటల్‌లో కాఫీ తాగాడు. కొంతసేపు వీధుల్లో తిరుగుతూ ఉండిపోయాడు. ఆదివారం సాయంత్రం అంటేనే అతనికి విసుగు. ఎందుకంటే ఆదివారం సాయంత్రాలు చాలా మంది డాక్టర్లు క్లినిక్‌లు తెరవరు. ఊరికెళితే ఫర్వాలేదుగాని ఊర్లోనే ఉంటే యిలా పనిలేక తిరగాల్సి ఉంటుంది' అనుకొన్నాడు.

ఇంతలో అతనికి రామకృష్ణ గుర్తొచ్చాడు. 'స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా'లో పనిచేసే రామకృష్ణ శశాంక్‌కు ఆప్తమిత్రుడు. గత వారం ట్రైనింగ్ కోసం హైదరాబాద్ వెళ్లాడు. 'ఆదివారం ఉదయానికల్లా వచ్చేస్తా నన్నాడు. వచ్చాడో లేదో' అనుకుంటూ సెల్ తీసి అతని నెంబర్ డయల్ చేశాడు శశాంక్. రామకృష్ణ గొంతు వినగానే

"రాంకీ. ఎప్పుడొచ్చావు? " అన్నాడు.

"ఉదయమే వచ్చాను".

"ఏం చేస్తున్నావు యిప్పుడు? "

"టీవీలో సినిమా చూస్తున్నాను"

"అంత చిన్న డబ్బాలో ఏం చూస్తావు గాని సెకండ్ షోకి వస్తావా? 'అర్చన'లో మంచి ఇంగ్లీషు సినిమా ఆడుతోంది".

"మంచి సినిమా అంటే? "

"మనలాంటి పెళ్ళికాని కుర్రాళ్లకి మంచి సినిమా"

"అయితే వస్తాను"

"నీవు డైరెక్ట్‌గా థియేటర్ దగ్గరికి రా. నేను టికెట్లు కొని నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను".



### అరవైకోట్ల సమస్యలు

భారత ప్రధాని అయ్యాక నెహ్రూ ఓసారి లండన్ వెళ్లారు. అప్పటికే మనదేశ జనాభా అరవైకోట్లకు చేరింది. ఎన్నో సమస్యలు దేశాన్ని పీడిస్తున్నాయి. అంతలో ఓ పత్రికావిలేకరి భారతప్రధానిగా మీకెన్ని ప్రధాన సమస్యలున్నాయి?' అని ప్రశ్నించాడు సీరియస్‌గా.

'అరవైకోట్ల సమస్యలు' అన్నారు నెహ్రూ తన హాస్యధోరణిలో.

"అలాగే"

శశాంక్ కోమల విలాస్‌కెళ్లి భోజనం చేసి థియేటర్ వరకూ నడుచుకొంటూ వెళ్లాడు. ఇంకా మొదటి ఆట వదల్లేదు. థియేటర్ ఎదురుగా ఉన్న ఓ చిన్న గోడపై కూర్చుని రామకృష్ణ కోసం ఎదురుచూడసాగాడు. అతనికి ఎందుకో మాధవి గుర్తొచ్చింది. ఆమె అందమైన నవ్వు గుర్తుకొచ్చింది. 'ఆమెను చేసుకోబోయే వాడెవడోగాని అదృష్టవంతుడు. బహుశ అతనూ డాక్టరే అయి ఉంటాడు' అనుకొన్నాడు.

ఇంతలో ఫస్ట్ షో వదిలారు. థియేటరు నుంచి బయటకు వస్తున్న అమ్మాయిలను చూడసాగాడు. అతని దృష్టి తన ప్రక్కగా నడచిపోతున్న మాధవిపై పడింది. గబుక్కున గోడ మీద నుంచి దిగి నిలబడ్డాడు. మాధవి కూడా శశాంక్‌ను చూసింది.

"హలో శశాంక్" అంటూ పలకరించింది అతన్ని.

"హలో. మీరు యింగ్లీషు సినిమాలు కూడా చూస్తారా?" ఆశ్చర్యంగా ఆమెని చూస్తూ అడిగాడు.

"చూస్తాను". ఆ ప్రశ్న ఇప్పుడెందుకన్నట్లు చూసింది.

"సినిమా ఎలా ఉంది?"

"చాలా బాగుంది".

"బాగుందా?" మళ్ళీ అతని ముఖంలో ఆశ్చర్యం.

"అవును. బాగుంది. ఏమిటి ఈ రోజు మీరు వింతగా మాట్లాడుతున్నారు?"

"ఆ ఇంగ్లీషు సినిమా బాగుందని మీరంటే ఆశ్చర్యమేసింది" ముసిముసిగా నవ్వుతూ అన్నాడు శశాంక్.

"అది ఇంగ్లీష్ సినిమా కాదు. వెంకటేష్ సినిమా"

శశాంక్ చటుక్కున తలెత్తి థియేటర్ వైపు చూశాడు. "అవును. తెలుగు సినిమా ఆడుతోంది. తనో ఫూల్. సినిమాకొస్తే వాల్‌పోస్టరు చూడాలని కూడా తనకు తోచలేదు. పైగా ఇంతమంది ఆడవాళ్లు థియేటరు నుంచి బయటకు రావడం చూసినప్పుడైనా తనకు అనుమానం వచ్చి ఉండాలి. ఇప్పుడెలా? రాంకీ ఇంటి నుంచి బయలుదేరి ఉంటాడు. విషయం వింటే తనను తిట్టిన తిట్టు తిట్టకుండా తిడతాడు" అనుకొన్నాడు మనసులో.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" మాధవి అడిగింది.

"అవును. తెలుగు సినిమా కదూ. నేను ఏదో లోకంలో ఉన్నాను. సినిమాకు ఒక్కరే వచ్చారా?"

"ఫ్రెండ్స్‌తో వచ్చాను. ఆటో కోసం ఇటొస్తే మీరు కనిపించారు. నేను వెళ్తాను. వాళ్లు నాకోసం ఎదురు చూస్తున్నారు".

"అలాగే. గుడ్ నైట్"

మాధవి కదలగానే రామకృష్ణకు విషయం చెప్పడానికి సెల్ ఆన్ చేశాడు.

"హలో శశాంక్‌గారూ"

మాధవి వెనక్కు తిరిగి అతన్ని పిలిచింది. ఏమిటన్నట్టు చూస్తూ ఆమెను సమీపించాడు.

"మీరు చూడాలనుకొన్న సినిమా శ్రీనివాసాకు మార్చారు".

"ఆ విషయం మీకెలా తెలుసు?" మళ్ళీ ఆశ్చర్యంగా అడిగాడు.

"అబ్బ. అన్ని సార్లు ఆశ్చర్యపోకండి. సినిమాకు వెళ్లే ముందు ఏ సినిమా ఎందులో ఆడుతూందో పేపర్లో చూస్తాను కనుక తెలుసు" చిరుకోపంతో అంది.

"అయినా నా ఫ్రెండు ఈ పాటికి బయలుదేరి ఉంటాడు. మీరూ ఈ సినిమా బాగుందన్నారు కనుక ఈ సినిమాకే వెళ్తాం" అన్నాడు శశాంక్.

"ఓకే. హేవ్ నైస్ టైమ్"

మాధవి వెళ్లిపోగానే రామకృష్ణ సెల్‌కు ఫోన్ చేసి శ్రీనివాసా థియేటర్ వద్దకు వచ్చెయ్యమని చెప్పి అక్కడే నిలబడి ఉన్న

ఖాళీ ఆటోవైపు నడిచాడు శశాంక్.

★ ★ ★

ఆ రోజు బ్యాగ్ తీసుకొని డ్యూటీకి బయలుదేరాడు శశాంక్. మేడ మెట్లు దిగి క్రిందికి రాగానే ప్రమీలమ్మ కనబడింది. "శశాంక్. ఒకసారి లోపలికి రా" అని పిలిచింది. ఆవిడ వెనకే ఇంట్లోకి వెళ్లాడు.

హాల్లోకి రాగానే ఆవిడ సోఫా చూపించి "కూర్చో ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికెళ్ళింది. శశాంక్ సోఫాలో కూర్చుని గోడకి తగిలించి ఉన్న ముకుందరావు, ప్రమీలమ్మల ఫోటోను చూడసాగాడు. వాళ్ల పెళ్ళైన క్రొత్తలో తీసిన ఫోటో కాబోలు. ఆ ఫోటోలో ప్రమీలమ్మ చాలా అందంగా ఉంది. వయసు ప్రభావం వల్ల అప్పటికీ, ఇప్పటికీఆమెలో ఎంతో మార్పు ఉంది. ముకుందరావులో పెద్దగా మార్పు లేదనిపించింది అతనికి.

రెండు నిమిషాల తరువాత కాఫీ గ్లాసుతో వచ్చింది ఆవిడ. గ్లాసు శశాంక్ చేతికిచ్చి అతని ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

కాఫీ తాగుతూ "ఏమిటి విశేషాలు? " అని అడిగాడు.

"ఈ రోజు మా పెద్దమ్మాయి చదువు ముగించుకొని వస్తోంది. మధ్యాహ్నం భోజనానికి నీవు ఇక్కడికే వచ్చెయ్"

"నేనెందుకండీ పానకంలో పుడకలా? చాలా రోజుల తర్వాత వస్తున్నట్టున్నారు ఆవిడ. ఎన్నో విషయాలు మీతో మాట్లాడాలని ఉంటుంది. మీ ఇంట్లో భోజనం చేయడం నాకేం కొత్త కాదు కదా. ఇంకో రోజు భోం చేస్తాను లెండి".

"ఫర్వాలేదు శశాంక్. అమ్మాయి ఇక ఇక్కడే ఉంటుందిగా. మా మాటలకు టైం ప్రాబ్లమ్ లేదు. ఈ రోజు అమ్మాయికి ఇష్టమైన ఐటమ్స్ చాలా చేశాను. ఇంట్లో ఇన్ని ఉండగా నీవు హోటల్ లో తినడం నాకు ఇష్టం లేదు. కనీసం నా సంతోషం కోసమైనా భోజనానికి రా" అంది అర్థింపుగా.

"సంతోషం నాదండి. అమ్మానాన్నలు దూరంగా ఉన్నా ఆ లోటు తెలియనివ్వకుండా నన్ను మీరు, అంకుల్ చూసుకొంటున్నారు. మీ మాటను కాదనే ధైర్యం నాకు లేదు. మధ్యాహ్నం భోజనానికి తప్పకుండా వస్తాను" అని చెప్పి బయలుదేరాడు.

'ప్రమీలమ్మగారి పెద్దమ్మాయిని ఇంతవరకూ చూళ్లేదు. తను ఆ ఇంట్లో చేరి రెండు నెలలే అవుతోంది. ఈ రెండు నెలల్లో ఆ అమ్మాయి నెల్లూరు రాలేదు' అనుకొంటూ బైక్ స్టార్ట్ చేశాడు శశాంక్.

★ ★ ★

మధ్యాహ్నం ఒంటి గంటకు టీవీ చూస్తూ మంచంపై పడుకొని ఉన్న శశాంక్ తలుపు దగ్గర చప్పుడైతే వెనక్కి తిరిగి చూశాడు. ద్వారం దగ్గర ఓ అమ్మాయి నిలబడి ఉంది. ఆమె ప్రమీలమ్మగారి పెద్దమ్మాయి అయి ఉంటుందని ఊహించాడు.

చూడగానే కట్టిపడేసే అందం ఆమెది. పాలు, పసుపు రంగరించిన మేనిఛాయ, పొడవాటి కురులు క్లిప్పు పెట్టి వదిలేయడంతో వీపంతా పరచుకొని చూడటానికి ఎంతో ఆహ్లాదంగా ఉంది. చురుకైన కళ్ళు, కోటేరు ముక్కు, చిన్ని గడ్డం, దొండపండు లాంటి పెదాలు, చూస్తూంటే మళ్ళీ మళ్ళీ చూడాలనిపించే ఆకర్షణీయమైన రూపం ఆమెది.

"రండి. కూర్చోండి" అన్నాడు లేచి నిలబడి. టీవీలో 'ఎమ్‌టీవీ' ఛానల్లో ఏదో పాట వస్తూంది.

ఆ అమ్మాయి టీవీ వైపు చూసి అసహ్యంగా మొహం పెట్టడం గమనించి రిమోట్‌తో టీవీ ఆఫ్ చేశాడు శశాంక్.

"అమ్మ పిలుస్తూంది మిమ్మల్ని" అతని

భయం కారణంగా సంప్రదింపులకు దిగకూడదు. అలాగే సంప్రదింపులకు భయపడవలసిన అవసరమూ లేదు. – జె.ఎఫ్.కెన్నెడీ

వైపు చూడకుండా అని వెళ్లిపోయింది. ఆమె పిలిచిన పద్ధతికి అతని మనసు ఎంతో బాధపడింది. తను అటువంటి పాటలు టీవీలో చూస్తుండటం ఆమెకు కోపాన్ని తెప్పించినట్లుంది. పొద్దుపోక ఏదో ఒక ఛానల్ పెట్టుకొని చూస్తూ కూర్చున్నాడు. ఆ అమ్మాయి వచ్చి పిలుస్తుందని తను ఊహించలేదు. మామూలుగా ప్రమీలమ్మ గారే మెట్ల దగ్గర నుంచి తనను పిలుస్తారు' అనుకొన్నాడు. అంత అందమైన అమ్మాయితో మొదటి పరిచయం అలా జరగడం అతన్ని నిరుత్సాహపరిచింది.

శశాంక్ క్రిందికి దిగి ప్రమీలమ్మ ఇంట్లో అడుగుపెట్టాడు. అప్పటికి అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుని ఉన్నారు. శశాంక్‌ను చూడగానే "రా శశాంక్. రా కూర్చో" అంటూ తన ఎదురుగా ఉన్న కుర్చీని చూపాడు ముకుందరావు. శశాంక్ కూర్చున్నాడు. అతని పక్కన కీర్తన, కీర్తన ఎదురుగా సాహితి కూర్చొని ఉన్నారు.

"మా పెద్దమ్మాయి సాహితి" కూతుర్ని శశాంక్‌కు పరిచయం చేసింది ప్రమీలమ్మ.

"నమస్తే" అన్నాడు శశాంక్ రెండు చేతులూ జోడించి.

"నమస్తే" అంది సాహితి నిరాసక్తంగా. ఆమె మొహంలో అతనిపై అయిష్టత స్పష్టంగా కనిపించింది. తను ఈరోజు భోజనానికి రాకుండా ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకొని ఉండాల్సింది. ఇంటికి భోజనానికి వచ్చిన మనిషితో ప్రసన్నంగా మాట్లాడాలని బహుశ ఆమె చదివిన చదువులో ఎక్కడా చెప్పలేదేమో అనుకొన్నాడు.

"ఎం.ఎస్.సి. లో ఏ సబ్జెక్ట్ మీది" ముందే తెలిసినా కావాలనే అడిగాడు శశాంక్

"మైక్రోబయాలజీ" చెప్పింది సాహితి.

"మంచి సబ్జెక్ట్"

ప్రమీలమ్మ అన్నీ వడ్డించి "నెమ్మదిగా భోజనం చేయి శశాంక్. మొహమాట పడ వద్దు" అంది అభిమానంగా.

"అమ్మ దగ్గర, భోజనాల దగ్గర మొహమాటాలేముంటాయి అమ్మా" అన్నాడు. ఆ మాటలతో ప్రమీలమ్మ మొహం ఆనందంతో విప్పారింది.

"ఏం కీర్తనా? ఏమిటి ఈరోజు సైలంట్‌గా ఉన్నావు. ఎలా ఉంది నీ చదువు?" అంటూ కీర్తనను పలుకరించాడు.

"బాగానే చదువుతున్నాను. అయితే ఎంసెట్‌లో ర్యాంకు వస్తుందో రాదో అన్న భయం వల్ల అప్పుడప్పుడు చదివింది కూడా మర్చిపోతున్నాను".

"ఎంసెట్‌లో ర్యాంకు రాకపోతేనేం? చదవడానికి వేరే చదువులే లేవా? నేనూ రెండు సార్లు ఎంసెట్ పరీక్ష రాశాను. ర్యాంకు రాలేదు. నేను ఉద్యోగం చేయడం లేదా? ఆనందంగా బ్రతకడం లేదా? ఎందుకు అనవసరంగా టెన్షన్లు తెచ్చుకొని ఆరోగ్యం పాడుచేసుకొంటారు? మన ప్రయత్నం మనం చెయ్యాలి. ఆ పైన ఫలితం ఎలా వచ్చినా ధైర్యంగా రిసీవ్ చేసుకోవాలి. ఏది జరిగినా మన మంచి కోసమే అని, భగవంతుడు ఇంకేదో మంచిని మన కోసం సిద్ధంగా ఉంచాడని నమ్మితే ఏ టెన్షన్లూ ఉండవు".

ప్రమీలమ్మ శశాంక్‌వైపు మెచ్చుకోలుగా చూసింది.

"సరిగ్గా నా మనసులో ఉన్న ఆలోచనను చక్కని భాషలో చెప్పావు. నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. ఈ ఎంసెట్‌లంటూ ఎంత మంది పిల్లలు తమ బాల్యాన్ని, ఆనందాన్ని త్యాగం చేస్తున్నారో తలచుకొంటే ఎంతో బాధేస్తుంది. పిల్లలు హాయిగా ఆడుతూ, పాడుతూ చదువుకొనే రోజులెప్పుడొస్తాయో?" అన్నాడు ముకుందరావు.

భోజనాలయ్యాక వాళ్లందరి దగ్గరా సెలవు తీసుకొని మేడపైకి వచ్చాడు. అప్పుడు అతనికి గుర్తొచ్చింది. తన సెల్ ఫోన్ డైనింగ్ టేబుల్ మీద పెట్టి మరచిపోయి వచ్చానని, మళ్లీ క్రిందకు వెళ్లాడు.

వాకిటి దగ్గరే సాహితి మాటలు వినిపించి ఆగాడు.

"నాకెందుకో అతను నచ్చలేదమ్మా. నేను ఇంట్లో ఉండగా అతన్ని మన ఇంటికి పిలవకు".

"మెల్లగా మాట్లాడు. అతను వింటే బాగుండదు. అయినా అతను ఎంతో మంచివాడు. మాకు ఎంతో సహాయంగా ఉంటాడు" ప్రమీలమ్మ అంటోంది.

శశాంక్ వెంటనే మేడపైకి వచ్చేశాడు. సాహితి మాటలు అతన్నెంతో బాధించాయి. ఒక సంఘటన, ఒక చర్య చూసి మనుషులపై అభిప్రాయాల్ని ఏర్పరచుకోవడం మంచి పద్ధతి కాదనిపించింది అతనికి.

కొంతసేపైన తర్వాత కీర్తన అతని సెల్ ఫోన్ తెచ్చి ఇచ్చింది.



శశాంక్ మరుసటిరోజు ఉదయం కొంత మంది డాక్టర్లను కలిశాడు. పన్నెండు గంటలప్పుడు అతనికి ఎందుకో మాధవిని చూడాలనిపించింది. ఆమె క్లినిక్ ముందు బైక్ ఆపి లోపలికి వెళ్లాడు. పది నిమిషాల్లో అతనికి లోపలికి రమ్మని పిలుపు వచ్చింది.

"గుడ్ మార్నింగ్" అంటూ విష్ చేశాడు.

"వెరీ గుడ్ మార్నింగ్. మీ కంపెనీ వాళ్లకు నా కోరిక తెలిసిందా ఏమిటి? అంత తొందరగా విజిట్ చేస్తున్నారు" అంది మాధవి నవ్వుతూ.

"మా కంపెనీ ఇంట్రడ్యూస్ చేసిన క్రొత్త ప్రోడక్ట్ శాంపుల్స్ నిన్నే వచ్చాయి. మీకు ఇచ్చిపోదామని వచ్చాను" అంటూ బ్యాగు తెరచి శాంపుల్స్ ఆమె టేబుల్ పై పెట్టాడు.

"లిటరేచర్ కూడా ఇవ్వండి. తర్వాత తీరికగా చదువుతాను"

లిటరేటర్ కూడా ఇచ్చాక "ఇంకేం విశేషాలు" అని అడిగాడు శశాంక్.

"మొన్న సినిమాలో వెంకటేష్‌ను చూస్తుంటే మీరే గుర్తొచ్చారు. మీ గురించే ఆలోచిస్తూ వస్తుంటే థియేటర్ బయట మీరు కనిపిస్తే ఆశ్చర్యపోయాను".

"నేనెందుకు గుర్తొచ్చాను?" ఆశ్చర్యం, ఆనందం మిళితమైన స్వరంతో అన్నాడు.

"మీరు వెంకటేష్‌లా ఉంటారు కనుక"

ఆ కాంప్లిమెంట్ అతనికెంతో నచ్చింది.

"ఇంతకూ సినిమా ఎలా ఉంది?" మాధవి అడిగింది.

"ఫర్వాలేదు. నాకు ఇద్దరు భార్యల సినిమాలు అంతగా నచ్చవు" అన్నాడు తను టీవీలో చూసిన సినిమా క్లిప్పింగులను గుర్తుచేసుకొంటూ...

"ఏ సినిమా గురించి మీరు చెబుతున్నది".

"మనం చూసిన వెంకటేష్ సినిమా గురించి"

"ఆ సినిమాలో ఇద్దరు భార్యలు కాదు కదా ఇద్దరు ప్రియురాళ్ళు కూడా లేరే"



**రచన చేయాలంటే జైలుకు వెళ్లాల్సిందే**

నెహ్రూ జైలులో ఉండగా ఎన్నో రచనలు చేశారన్న విషయం అందరికీ తెలిసిందే. ఆయన ప్రధాని పీఠం ఎక్కాక ఓ విలేకరి, 'ఈ మధ్య మీరు కొత్తగా చేసిన రచనలేమిటి?' అని అడిగారు.

దానికాయన నవ్వుతూ, 'రచనలు చేయడానికి నేను జైలుకెళ్లేగదా.. అందుకే ఏమీ చేయలేదు' అని చమత్కరించారు.

అంది మాధవి పగలబడి నవ్వుతూ.

"అలాగా. నేను మధ్యలో కొంతసేపు నిద్ర పోయాను లెండి" అంటూ బ్యాగ్ సర్దుకోసాగాడు. అతను ఇంగ్లీష్ సినిమాకు వెళ్లానని చెప్పకుండా తన అబద్ధాన్ని కవర్ చేసుకోవాలని ప్రయత్నించడం ఆమెకు నవ్వు తెప్పించింది.

"పునర్దర్శనం ఎప్పుడు? " అని అడిగింది శశాంక్ లేచి నిలబడ్డాక.

"మీరు ఆ సినిమా గురించి పూర్తిగా మరచిపోయ్యాక" అంటూ బయటకు నడిచాడు. అతనూ నవ్వు ఆపుకోవడం ఆమె గుర్తించింది. శశాంక్ వెళ్లిపోయిన పది నిమిషాల వరకూ మాధవి నవ్వుతూనే ఉంది.

★ ★ ★



ఆరోజు గురువారం. వారమంతా బిజీగా తిరిగినా గురువారం మాత్రం రాత్రి ఎనిమిది లోగా తన పనులన్నీ ముగించుకొని షిరిడీ సాయిబాబా గుడికి వెళతాడు శశాంక్. ఆరోజు గుడికెళ్లి బాబాను దర్శించుకొన్నాడు. బాబా కళ్ళలో కనిపించే ప్రేమ, కరుణ చూస్తూ ఎంతో మానసిక ప్రశాంతతను పొందుతాడు శశాంక్. ఇంకా అలాగే నిలబడి మరికొంతసేపు బాబాను చూస్తూ నిలబడాలని కోరిక ఉన్నా అందరికీ ఆ అవకాశం ఇవ్వాలని తలచి వెలుపలికి వచ్చాడు. ఆలయ ప్రాంగణంలోనే ఓ చోట కూర్చుని బాబా రూపాన్ని అయిదు నిమిషాలపాటు స్మరించి కళ్లు తెరచి చూశాడు. అతని దృష్టి అప్పుడే గుడిలోకి అడుగుపెడుతున్న సాహితిపై పడింది. లేత గులాబి రంగు షిఫాన్ చీర, అదే రంగు బ్లౌజు ధరించి వదులుగా అల్లిన జడలో ఒకవైపు చెవి దగ్గర అందమైన గులాబీ పువ్వుతో అందమైన 'గులాబి బాల' లాగుంది. అలా చూస్తూ చూపులు మరల్చుకోలేకపోయాడు. అంతవరకూ ప్రశాంతతతో ఉన్న అతని మనసులో అలజడి ప్రారంభమైంది. సాహితి లోపలికి వచ్చి శశాంక్‌ను చూసింది. మరుక్షణమే చూపు తిప్పుకొని అతనికి కొద్ది దూరంలో కూర్చుంది.

ఆమె అలా ప్రవర్తించడం శశాంక్ మనసును ఎంతో బాధపెట్టింది. 'తను ముఖపరిచయం ఉన్నవాళ్లను కూడా నవ్వుతూ పలకరిస్తాడు. తన ఇంట్లో అద్దెకున్న వ్యక్తిని చూసి పలకరింపుగా నవ్వితే ఆమెకు పోయేదేముంది? ఒకవేళ తన మీద కోపమే అనుకొంటే అంత కోపం వచ్చేంత తప్పు తానేమి చేశాడు' అనుకొన్నాడు. అతనికి ఆమెపై విసుగుతో కూడిన కోపం వచ్చింది. లేచి నిలబడి బాబా విగ్రహం ఉన్నవైపు నమస్కారం చేసి బయటకు నడిచాడు.

ఆలయం వెలుపల పూలు, టెంకాయ కొంటున్న ప్రమీలమ్మ, కీర్తన కనిపించారు.

"అరె శశాంక్. లోపల సాహితి ఉంది. చూడలేదా? " అంది ప్రమీలమ్మ శశాంక్‌ను చూసి.

"నేను చూశాను. తనే నన్ను చూడలేదు"

"ఇంటికేనా? "

ఒక్క క్షణం ఆలోచించి "అవును" నిజానికి అతను హోటల్‌కు వెళ్లాలి. కాని ఇంటికని చెబితే తాము వచ్చేవరకూ ఉండమంటుంది ఆవిడ. అందువల్ల సాహితితో కొంతసేపు కలిసి ఉండే అవకాశం వస్తుందని

అలా చెప్పాడు.

"అయిదు నిమిషాలు ఆగవూ? మేమూ వచ్చేస్తాము".

"అలాగే అంటూ మళ్లీ గుడిలోకి వచ్చి కూర్చున్నాడు. 'ఊర్లో రోడ్ సైడ్ రోమియోల బెడద ఎక్కువగా ఉందని విన్నాడు తను. తను కూతుళ్లతో వచ్చింది కాబట్టి ప్రమీలమ్మ తనను తోడుగా రమ్మంటుంది". అనుకొన్నాడు. వాళ్ళు ముగ్గురూ గుడి చుట్టూ ప్రదక్షిణలు చేస్తుంటే అతను మాత్రం సాహితినే చూస్తుండిపోయాడు. అందమైన మొహానికి చిరునవ్వే ఓ ఆభరణం. ఈ అమ్మాయి ఆ ఆభరణాన్ని ఎందుకు వద్దనుకొంటూందో' అనుకొన్నాడు.

అయిదు నిమిషాల తరువాత ప్రమీలమ్మ, కీర్తన వచ్చి అతని ఎదురుగా కూర్చున్నారు.

"మీ పెద్దమ్మాయి ఏది? "

"గుడి లోపలే ఉంది"

"ఏం కోరుకున్నారు దేవుణ్ణి? " నవ్వుతూ అడిగాడు.

"సాహితి పెళ్ళి త్వరగా జరిగేలా చూడమని"

"ఎందుకు అంత తొందరపడుతున్నారు? తనకేం వయసు మించిపోలేదుగా? "

"వయసు మించిపొయ్యేలోగా చేసెయ్యాలనే నా ఆరాటం. వయసు పెరిగేకొద్దీ మన ఛాయిస్ తగ్గిపోతూ ఉంటుంది. తర్వాత ఎవడో ఒకడులే అని సరిపెట్టుకోవాల్సి వస్తుంది"

"మీ అమ్మాయికేమండి? అందముంది. చదువుంది. ఎవరైనా కళ్ళకద్దుకొని చేసుకొంటారు. మీరు సంబంధాలు చూడటం మొదలుపెట్టండి. మొదటి సంబంధమే ఖాయం కాకపోతే నన్నడగండి"

"నీ నోటి చలువవల్ల అదే జరిగితే నాకు అంతకన్నా ఏం కావాలి? " ఆమె గొంతు బొంగురుపోవడం శశాంక్‌ను ఆశ్చర్యపరచింది.

"అమ్మా. ఏడుస్తున్నారా? " ఆదుర్దాగా అడిగాడు.

"లేదు లేదు. నీ అభిమానానికి కంట్లో నీరు తిరిగింది"

"లేదమ్మా. మీరేదో బాధపడుతున్నట్లున్నారు. నాతో చెప్పకూడదా? "

"వద్దు శశాంక్. అవన్నీ తీరే బాధలు కావు. చెప్పి మరొకరికి ఆ బాధను పంచి ఇవ్వడం తప్పితే ఇంకేం లాభం ఉండదు"

ఇక తను బలవంతం చేసినా ఆమె చెప్పదని అతనికి అర్థమైంది. అందుకే మాట మారుస్తూ "మీ అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారా? " అని అడిగాడు.

"బెంగుళూరులో మా అన్నయ్య ఉన్నాడు. ఆ పని వాడికి అప్పజెప్పాను" అంది ప్రమీలమ్మ.

"సంబంధం ఆయన్ను చూడమనండి. పెళ్ళి నేను దగ్గరుండి జరిపిస్తాను" అన్నాడు శశాంక్.

"సంతోషం నాయనా. ఆ మాట చాలు నాకు. ఇక బయలుదేరుదాం. మళ్ళీ నీకు ఆలస్యం అవుతుంది. కీర్తనా. అక్కయ్యను పిలు" అంటూ లేచింది ప్రమీలమ్మ.

శశాంక్ ప్రమీలమ్మతో, సాహితీ కీర్తనతో మాట్లాడుకుంటూ ఇల్లు చేరారు. సాహితి తనతో ఒక్కమాటైనా మాట్లాడకపోవడం అతన్ని బాధించింది.

★ ★ ★

గదిలోకి పోబోతూ లోపల మాధవితో బాటు మరో యువతి ఉండటంతో వెనక్కు వచ్చేశాడు శశాంక్.

"ఫర్వాలేదు. రండి శశాంక్" అని మాధవి పిలవడంతో లోపలికి అడుగుపెట్టాడు. మాధవి ఎదురుగా ఉన్న ఆ అమ్మాయికి మాధవి ఈడే ఉంటుంది. అందంలో మాధవితో పోటీపడుతూ ఉంది.

శశాంక్‌ను ఆ అమ్మాయికి పరిచయం చేసి, "శశాంక్. ఈమె నా స్నేహితురాలు స్వప్న. తిరుపతిలో ఇంటర్ వరకూ ఇద్దరం

కలిసే చదివాము" అంది మాధవి.

"నమస్తే" అంది స్వప్న.

"నమస్తే. మీరూ డాక్టరా? " అడిగాడు శశాంక్.

"కాదు. లెక్చరర్ని"

"తను ఉండేది, పనిచేసేది చెన్నైలో" మాధవి అంది.

"అయితే మీరు 'చెన్నై చంద్రమా' అన్న మాట" అన్నాడు స్వప్నతో. ఇద్దరూ నవ్వారు.

"స్వప్నా. శశాంక్ భలే జోకులు చెప్తారు" అంది మాధవి ఉన్నట్టుండి.

"అలాగా. ఏదీ ఓ మంచి జోక్ చెప్పండి. హాయిగా నవ్వుకొని చాలారోజులైంది" అంది స్వప్న.

"భలేవారే. సడన్‌గా జోక్స్ చెప్పమంటే ఏం చెప్పను? " అన్నాడు శశాంక్.

"మీకు ఎదురైన తమాషా అనుభవాలు చెప్తూంటారు కదా. అలాంటిది ఒకటి చెప్పండి" అంది మాధవి.

"సరే నేను ఈ కంపెనీలో చేరకముందు ఓ చిన్నకంపెనీలో మెడికల్ రెప్‌గా పనిచేస్తూండేవాడిని. ఒకసారి ఓ పెద్ద కంపెనీలో ఇంటర్వ్యూ వచ్చింది. ఇంటర్వ్యూ చెన్నైలో. దాదాపు పాతికమంది అభ్యర్థులు వచ్చారు. ఆ కంపెనీలో పనిచేసే ఓ ఉద్యోగి మా దగ్గరకు వచ్చి "డైరెక్టర్లు ఫస్ట్ ఫ్లోర్‌లో ఉన్నారని, మా ఎదురుగా ఉన్న టెలిఫోన్ రింగయినప్పుడల్లా మేము కూర్చున్న వరుస ప్రకారం ఒక్కో అభ్యర్థి మేడపైన ఉన్న డైరెక్టర్స్ రూమ్‌లోకి రావాలని చెప్పి వెళ్ళిపోయాడు. కొంతసేపటికి నా వంతు వచ్చింది. టెలిఫోన్ మోగగానే ఫస్ట్‌ఫ్లోర్‌కు వెళ్ళి 'డైరెక్టర్స్' అన్న బోర్డున్న గది ముందు నిలబడ్డాను. బయట అటెండర్లు ఎవరూ లేరు. లోనికి వెళ్ళవచ్చో, వెళ్ళకూడదో అన్న సందేహం. ఒకసారి తలుపు తట్టాను. జవాబు రాలేదు. ఓ రెండు నిమిషాలు సందిగ్ధంలో ఉండి, తరువాత తలుపు తెరచి చూసి ఆశ్చర్యపోయాను"

మాధవి, స్వప్న ఇద్దరూ ఉత్కంఠతో వింటున్నారు.

"అది ఒక టాయిలెట్. డైరెక్టర్లు వాడే టాయిలెట్ అన్నమాట"

ఒక్కసారిగా గది మాధవి, స్వప్నల నవ్వులతో నిండిపోయింది. చెప్పాక శశాంక్ కూడా ఆ సన్నివేశాన్ని తలచుకొని నవ్వసాగాడు.

"ఆ తర్వాత పరుగెత్తుకెళ్ళి ఎలాగో ఇంటర్వ్యూ జరుగుతున్న ఛాంబర్‌లోకి వెళ్ళాననుకోండి. అక్షింతలు కూడా తిన్నాను. 'డైరెక్టర్స్' అని రాసి ఉన్న ఆ బోర్డు నన్ను మిస్‌లీడ్ చేసింది" అన్నాడు.

తర్వాత మాధవికి మందుల శాంపుల్స్ యిచ్చి, స్వప్నకు ఓ టెలిఫోన్ డైరెక్టరీ ఇచ్చాడు.

"మీ కంపెనీ కాంప్లిమెంటా" అంది స్వప్న.

"అవును. మాధవిగారికి ఇదివరకే యిచ్చాను"

"థాంక్యూ. మీరు ఈసారి చెన్నై వచ్చినప్పుడు మా ఇంటికి తప్పకుండా రావాలి" అంది స్వప్న.

"తప్పకుండా వస్తాను" అంటూ లేచి "బై స్వప్నగారూ. బై డాక్టర్" అంటూ వాళ్ళిద్దరి నుంచి శెలవు తీసుకొన్నాడు శశాంక్.



రాత్రి తొమ్మిదిగంటలకు తన టి.ఎ. బిల్లు తయారుచేస్తూ కూర్చొని ఉన్నాడు శశాంక్. ప్రతినెలా అతను తిరిగిన ఊర్లు, తిరగడానికి అయిన బస్సు, రైలు ఛార్జీలు, అలవెన్సులు అన్నీ స్టేట్‌మెంట్‌లో రాసి ప్రతినెలా మొదటివారంలో కంపెనీకి

భగవంతుడు బంధువులను ఇస్తాడు. కానీ మిత్రులను ఎన్నుకునే అవకాశం ఇచ్చిన భగవంతుడికి ధన్యవాదాలు. – బెర్నార్డ్‌షా

పంపితే ఆ బిల్లు పాస్ చేసి అతనికి డ్రాఫ్టు పంపిస్తుంది అతని కంపెనీ. జీతం మాత్రం ప్రతినెలా మొదటివారంలో డ్రాఫ్టు రూపంలో అతని చేతికొస్తుంది.

ఇంతలో సెల్ మ్రోగితే ఆన్‌చేసి "హలో" అన్నాడు.

"హలో శశాంక్‌గారూ. నేను ప్రమీల అన్నయ్య మాధవరావుని. బెంగుళూరు నుంచి మాట్లాడుతున్నాను. ప్రమీల ఇంట్లో ఫోన్ పనిచేయనట్లుంది. ఒకసారి సెల్ ఆమెకిస్తారా"

"లైన్లో ఉండండి" అంటూ గబగబా మేడ దిగి క్రిందకు వచ్చాడు. హాల్లో మంచంపై ముకుందరావు పడుకొని నిద్రపోతున్నాడు. ఇంట్లో ఇంకెవరూ కనిపించలేదు. "కీర్తనా" అని పిలుస్తూ వంటగది వరకు వెళ్ళి వచ్చాడు. తర్వాత వంటగదికి, హాలుకు మధ్యనున్న గది తలుపు దగ్గరగా వేసి ఉండటంతో తలుపు త్రోసి లోపలి దృశ్యం చూచి నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

గదిలో సాహితి బట్టలు మార్చుకొంటూంది. ఆమె ఒంటిపై లంగా, రవిక మాత్రం ఉన్నాయి.

నేలపై ఉన్న నైటీని అందుకోబోతూ తలెత్తి ద్వారం వైపు చూసింది. వెంటనే ఆమె కళ్ళు తీక్షణమయ్యాయి. ఆ చూపుల నుంచి అగ్ని ప్రసరించి తనను దగ్ధం చేస్తుందేమోనన్న అనుమానం వచ్చింది అతనికి.

"సారీ" అంటూ తలుపు దగ్గరగా లాగి హాలు మధ్యలోకి వచ్చాడు. అతనికి అలా తలుపు తెరిచినందుకు గిల్టీగా అనిపించసాగింది. "తనకు తెలియకుండానే కొన్ని పొరబాట్లు చేసి ఆమె కోపానికి కారణమవుతున్నాడు. ఇక జన్మలో ఆమె తనతో మాట్లాడదు' అనుకొంటూ ముకుందరావును లేపబోయాడు. ఘాటుగా ముక్కుకు తగిలింది ఆల్కహాల్ వాసన. 'ఇక అతన్ని లేపినా లాభం ఉండదు' అనుకొని మాధవరావుతో "ఇంట్లో అందరూ బయటికెళ్ళినట్లున్నారు. వాళ్ళు వచ్చాక నేను మీకు ఫోన్ చేస్తాను" అన్నాడు.

"మీకెందుకు శ్రమ. అరగంట తర్వాత నేనే చేస్తాను" అంటూ ఆయన ఫోన్ పెట్టేశాడు.

శశాంక్ సెల్ ఆఫ్ చేసి బయట అరుగుపై కూర్చున్నాడు. అతనిని ఆ రోజు ప్రమీలమ్మ గదిలో కన్నీరు పెట్టుకోవడానికి కారణమేమిటో ఇప్పుడర్థమయింది. ముకుందరావుకు తాగడం అలవాటు ఉంది. అదీ అప్పుడప్పుడూ తాగే అలవాటు కాదు. వయసొచ్చిన ఆడపిల్లలున్న ఇంటిలో తొమ్మిది గంటలకే తాగి వచ్చి నట్టింట్లో పడుకొని



## సరుకూ కావాలి

పార్టీవాదుల్లో కొందరు సొంత నిర్ణయాలు తీసుకోవడం, మూర్ఖంగా వ్యవహరించడం నెహ్రూకు తరచూ చిరాకు పుట్టించేది. దీన్నిదృష్టిలో పెట్టుకుని ఒకానొక మీటింగ్‌లో, 'ప్రతి కాంగ్రెస్ కార్యకర్త విధిగా ఖాదీటోపీకి గౌరవం ఇవ్వాలి.. అంతేకాదు దాని కిందుండే తలలో తప్పకుండా ఎంతో కొంత సరుకుండేలా చూసుకోవాలి' అని సూచించారు.

అంతా ఒక్కసారిగా నవ్వారు. అయితే ఆ చురక తగిలిన కొందరు మాత్రం తేలుకుట్టిన దొంగల్లా మౌనంగా ఉండిపోయారు.

ఉన్నాడంటే అతను ఖచ్చితంగా తాగుబోతై ఉండాలి. అతని మనసు బాధతో నిండిపోయింది. ప్రమీలమ్మపై జాలి కూడా కలిగింది.

ఇంతలో ప్రమీలమ్మ, కీర్తన వీధిలో నుండి వస్తూ కనిపించారు.

"ఏమైంది శశాంక్?" ప్రమీలమ్మ ఆదుర్దాగా అడిగింది శశాంక్ ఇంటి బయటే కూర్చుని ఉండటం చూసి.

"ఏం లేదు. ఇందాకే మీ అన్నయ్యగారు బెంగుళూరు నుంచి ఫోన్ చేశారు. మీరు ఇంట్లో లేరని చెప్పాను. ఇప్పుడు మాట్లాడండి" అంటూ సెల్ చేతిలోకి తీసుకొన్నాడు.

"ఇంట్లో సాహితి ఉందిగా. అది మాట్లాడ లేదా?"

శశాంక్ సమాధానం చెప్పకుండా సెల్‌లో సేవ్ చేసిన మాధవరావు నెంబరు డయల్ చేసి, అటుప్రక్క రింగవుతుండటం విని సెల్ ప్రమీలమ్మ చేతికిచ్చి, కీర్తనతో మాట్లాడుతూ కూర్చున్నాడు.

ఆవిడ మాట్లాడటం అయ్యాక సెల్ శశాంక్‌కు ఇస్తూ "థాంక్యూ శశాంక్. నీకో గుడ్ న్యూస్. అన్నయ్య సాహితికి ఓ మంచి సంబంధం చూశాడట. అబ్బాయి బెంగుళూరులో మంచి ఉద్యోగంలో ఉన్నాడట. మంచి రోజు చూసి సాహితిని బెంగుళూరు పిలుచుకొనివస్తే అక్కడే పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తానన్నాడు" అంది సంతోషంగా.

ఆ వార్త అతనికి సంతోషాన్నివ్వలేదు. 'సాహితిలాంటి అందగత్తె మరొకరి సొంతం కావడం తను ఊహించలేదు. తమ మధ్య అపార్థాలు చోటు చేసుకున్నా త్వరలోనే సాహితి మనసు గెలుచుకోగలనని తనకు నమ్మకం ఉంది' అనుకొన్నాడు.

పైకి మాత్రం ప్రమీలమ్మతో "వెరీగుడ్. నేను చెప్పాగా మంచి సంబంధమే కుదురుతుందని" అన్నాడు.

"ఫోన్‌కు ఎంతయిందో చెప్పు. మా పనులకోసం నిన్ను టాక్స్ చేయడం న్యాయం కాదు" అంది ప్రమీలమ్మ.

"ఫర్వాలేదు. అలాంటివి పట్టించుకోకండి. ఇంతకు ఎక్కడికెళ్ళారు మీరు?"

"సినిమాకు"

వాళ్ళు లోపలికి వెళ్ళాక అక్కడే కాసేపు కూర్చున్నాడు శశాంక్. 'సాహితి తను ఆమెను అలా చూసినట్లు తల్లికి చెబుతుందా? ప్రమీలమ్మ ఏమనుకోదు గదా. ఒకవేళ ఆవిడ తననే అడిగితే తన తప్పేం లేదని, బెంగుళూరు నుంచి ఫోన్ అనగానే ఆత్రుతగా వాళ్ళకోసం వెతుకుతూ తలుపు తెరిచానని చెబుతాడు. అసలు ఆవిడ అడిగితే ఫరవాలేదు. అడగకుండా మనసులోనే బాధపడితే? అయినా ఆవిడకు తన గురించీ తెలుసు, ఫోన్ వచ్చిన విషయం తెలుసు కాబట్టి సాహితి తన మీద కంప్లైంట్ చేసినా ఆవిడ తననే సమర్థిస్తుంది' అనుకొన్నాడు.

తలుపు తీసినప్పుడు కనిపించిన దృశ్యం అతని కళ్ళలో పదే పదే మెదలుతూంది. మదిలో ఏదో తీయని భావన. 'ఎందుకు ఆ దృశ్యం తలచుకొంటూంటే ఇంత మధురంగా ఉంది. వయసు మహిమా? మరి కొన్ని రోజుల్లో ఆ అందం మరొకరి సొంతం కాబోతుంది. ప్రయత్నిస్తే తాను ఆ అందానికి సొంతదారుడు కాగలడు. ఎటూ ప్రమీలమ్మ, ముకుందరావులకు తనంటే సదభిప్రాయమే ఉంది. సాహితితోనే సమస్య. తమ మొదటి పరిచయమే మధురంగా జరగలేదు. ఆ తర్వాత అన్నీ అపార్థాలే' అనుకొన్నాడు.

ఆ రాత్రి అతనికి చాలా ఆలస్యంగా నిద్ర పట్టింది. అయితే ఆ ఆలస్యం అతని మనసుకు ఆనందాన్ని ఇచ్చింది.

★ ★ ★

ఉదయం ఆరుగంటలకు రైల్వే స్టేషన్ చేరుకొన్నాడు శశాంక్. చెన్నై వెళ్లే రైలు

ఫ్లాట్‌ఫారం మీద సిద్ధంగా ఉంది. కాస్త ఖాళీగా ఉన్న కంపార్ట్‌మెంట్ చూసి తన బ్యాగ్ సీటుపై పెట్టి మళ్ళీ బయటకు వచ్చి నిల్చున్నాడు.

ఇంతలో అతనికి మాధవి స్టేషన్‌లోకి ప్రవేశిస్తూ కనిపించింది. ఆమె కూడా తను వెళ్ళే ట్రైను వైపు వస్తూండటం చూసి, ఎదురుగా వెళ్ళి "హలో" అన్నాడు.

"హలో శశాంక్. వాట్ ఎ సర్‌ప్రైజ్. మీరు చెన్నైకా?" అని అడిగింది.

"అవును. రండి యిక్కడ ఖాళీగా ఉంది" అంటూ కంపార్ట్‌మెంట్‌లోనికి అడుగులు వేశాడు.

"ఇది రిజర్వేషన్ కంపార్ట్‌మెంట్ లాగుందే' అంది మాధవి అతన్ని అనుసరిస్తూ.

"అవును. రిజర్వేషన్ ఛార్జెస్ కట్టేద్దాం లెండి"

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. అతని బ్యాగ్ చూసి "సేల్స్ మీటింగ్‌కు వెళ్తున్నారా?" అని అడిగింది.

"అవును. మీరు?"

"స్నేహితురాలి పెళ్ళి"

"స్వప్నగారికా పెళ్ళి?

"కాదు. ఇంకో ఫ్రెండుకు. అనిత ఆవిడ పేరు. తనూ డాక్టరే"

"స్వప్నగారు కూడా పెళ్ళికి వస్తారా?"

"స్వప్నకూ, అనితకూ పరిచయం లేదు. నేను చెన్నై వెళ్ళగానే స్వప్నకు ఫోన్ చేస్తాను. తను నన్ను కలుసుకోవడానికి పెళ్ళికి వస్తుంది"

"ఎక్కడ పెళ్ళి?"

"మైలాపూర్‌లో"

"మ్యారేజ్ హాల్ పేరు?" ఆసక్తిగా అడిగాడు.

మాధవి తన హేండ్ బ్యాగ్ తెరచి అందులోని శుభలేఖ తీసి అతనికిచ్చింది. శశాంక్ చదివి "అరె. ఇది మా అక్కయ్య ఇంటి పక్కనే ఉంది' అన్నాడు.

"అలాగా? అయితే నాకొక సహాయం చేయగలరా? నాకు చెన్నై క్రొత్త. మీ మీటింగ్‌కు ఆలస్యం కాకుంటే నాతో మ్యారేజ్ హాల్ వరకు రాగలరా?"

"వైనాట్? ఇటీజ్ మై ప్లెజర్. అయితే ఓ పనిచేద్దాం. ముందు మా అక్కయ్య ఇంటికెళదాం. అక్కడ మొహాలు కడుక్కొని కాస్త ఫ్రెషప్ అవుదాం. అక్కడ్నుంచి మీరు పెళ్ళికి, నేను మీటింగ్‌కు బయలుదేరుదాం"

"దట్ సౌండ్స్ ఫైన్. మీ అక్కయ్య ఏమనుకోరుగా?"

"ఏమనుకోదు. నేనంటే ఆమెకి చాలా ఇష్టం."

చెన్నై చేరాక ఆటోలో మైలాపూర్ చేరారు. శశాంక్‌ను చూసి ఎంతో ఆనందించింది అతని అక్కయ్య నీరజ. మాధవితో కూడా ఎంతో కలుపుగోలుతనంతో మాట్లాడింది. నీరజ శశాంక్‌తో మాట్లాడుతూంటే శశాంక్ తనతో 'తన అక్కయ్యకు తనపై ఉన్న ప్రేమ' గురించి చెప్పింది నిజమేననిపించింది మాధవికి. మాధవి మొహం కడుక్కోవడానికి బాత్‌రూమ్‌కెళ్ళిన సమయంలో నీరజ శశాంక్‌తో "ఎవర్రా ఆ అమ్మాయి? కుందనపు బొమ్మలా ఉంది. డాక్టర్ అంటున్నావు. ఆమెతో ప్రేమలో పడ్డావా ఏమిటి?" అంది.

"అలాంటిదేమీ లేదు. ఆవిడ నాకు మంచి స్నేహితురాలు. అంతే" అంటూ మాధవి తనతోపాటు రావడానికిగల కారణం వివరించాడు.

"అయినా ఆవిడ డాక్టర్. నేను మెడికల్ రెప్‌ని. మహా అయితే ఆవిడ క్లినిక్‌లో ఓ మెడికల్ షాప్ పెట్టుకోగలను. అంతకంటే ఇంకేమీ కాలేను ఆవిడకి" అన్నాడు శశాంక్ నవ్వుతూ.

"ఛ. అలా మాట్లాడకు. నీకేం తక్కువైంది? ఆమెకు డాక్టరో, కలెక్టరో భర్తగా రావచ్చేమోగాని శశాంక్‌లాంటివారు భర్తగా దొరకాలంటే ఎంత అదృష్టం చేసుకొని

ఉండాలి" అంది నీరజ.

"కాకి పిల్ల కాకికి ముద్దు"

"నిజంరా. పదిమందికి సహాయం చేయాలని ఉబలాటపడే నీ మనసు ఎంత గొప్పదో నాకు తెలుసు. ఆ మంచి మనసే నీకు శ్రీరామ రక్ష"

"ఇక వెళ్తాను. ఇంకొంచెం సేపు నిలబడి నీ మాటలు విన్నానంటే నేను లావు అయి, బట్టలు టైట్ అయి వికారంగా కనిపిస్తాను' ' అంటూ బాత్‌రూమ్ వైపు నడిచాడు.

ఆ తర్వాత నీరజ ఇచ్చిన కాఫీ తాగి ఇద్దరూ బయలుదేరారు. ఇద్దరినీ పక్కపక్కన చూస్తున్న నీరజకి ఎంతో ముచ్చటగా అన్పించింది. 'వీళ్ళిద్దరికీ జంట కుదిరితే ఎంత బాగుంటుందో' అనుకొంది.

మ్యారేజ్ హాల్ వరకు మాధవితో పాటు నడచుకొంటూ వెళ్ళి, అక్కడ్నుంచి ఆటోలో కాన్ఫరెన్స్ హాల్ చేరుకొన్నాడు శశాంక్.

★ ★ ★

సేల్స్ కాన్ఫరెన్స్ జరిగిన హోటలు నుంచి బయటకు వచ్చాడు శశాంక్. టైము ఆరు కావస్తోంది. కాన్ఫరెన్స్ అయిదుగంటలకే ముగిసినా తనకున్న కొన్ని అనుమానాలను తీర్చుకొని, బాస్‌ల సలహాలు తీసుకొని బయటపడేసరికి ఆలస్యమయింది. టార్గెట్‌ను మించి బిజినెస్‌ను చేసినందుకు శశాంక్‌ను అతని పై అధికారులు ఎంతో మెచ్చుకొన్నారు. అయితే అతని నెలసరి టార్గెట్‌ను మరింత పెంచారు.

అతనికి ఉద్యోగంలో చేరిన కొత్తలో తోటి సీనియర్ మెడికల్ రెప్స్ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. "నువ్వు టార్గెట్‌ను పూర్తిచెయ్యడానికి ఎంతైనా కష్టపడు. కాని టార్గెట్‌ను అధిగమించకు. అలా చేస్తే నీ టార్గెట్‌ను ఆ మేరకు పెంచుకుంటూ పోతారు"

వాళ్లు చెప్పింది నిజమేననిపించింది అతనికి. అయితే దాని గురించి పెద్దగా ఆలోచించడం లేదు అతను. తనకు అంత జీతమిస్తున్న తన కంపెనీ కోసం ఎంత కష్టమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాడు అతను.

అతనికి రాత్రికి రాత్రే నెల్లూరు వెళ్లాలని లేదు. బీచ్‌కు వెళ్లి కాసేపు సముద్రాన్ని చూస్తూ కూర్చోవాలనిపించింది. రాత్రి తన అక్కయ్య పిల్లలతో కాసేపు గడిపి మరుసటి రోజు ఉదయమే బయలుదేరి నెల్లూరు వెళ్లాలని అనుకొన్నాడు.

అటుగా వెళ్తున్న ఖాళీ ఆటోను ఆపి "మెరీనా బీచ్" అని చెప్పి ఆటో ఎక్కి కూర్చున్నాడు.

ఆరోజు ఆదివారం కావడంతో బీచ్‌లో జనం ఎక్కువగానే ఉన్నారు. శశాంక్ నీటికి దగ్గరగా ఇసుకలో కూర్చుని సముద్రపు అలల్ని చూడసాగాడు. సాయంకాలం కాబట్టి అలల ఉధృతి ఎక్కువగా ఉంది. అలా ఉవ్వెత్తున ఎగసిపడి అతివేగంగా వచ్చి తీరాన్ని తాకి, నెమ్మదిగా వెనక్కి వెళ్లిపోతున్న అలల్ని ఎంతసేపు చూస్తున్నా తనవితీరడంలేదు. సముద్రమంటే అతనికి చిన్నప్పటినుంచీ చాలా ఇష్టం. చెన్నై ఎప్పుడు వచ్చినా బీచ్‌కు రావడం, ఒడ్డున నిలబడి అలలు వేగంగా వచ్చి కాళ్లను, బట్టల్ని తడిపేస్తుంటే ఆనందించడం జరిగేది.

తర్వాత అతని దృష్టి అతనికి సమీపంలో కూర్చుని ఉన్న జంటలపై పడింది. 'తన పక్కనా ఓ నెచ్చెలి ఉండి ఉంటే తన మనసులోని భావాల్ని ఆమెతో పంచుకొనేవాడు. సముద్రమంటే తనకెంత ఇష్టమో ఆమెకు చెప్పేవాడు. తనకు తెలిసిన జోక్స్ ఆమెకు చెబుతుంటే, ఆమె ఆ జోక్స్‌కు నవ్వుతుంటే, ఆ నవ్వును చూస్తూ తను అన్నీ మరచిపోయేవాడు. ఈ లోకంలో ఆమెకు అతిముఖ్య

కర్తవ్యాన్ని భక్తితో పాటించడం త్యాగం అనిపించుకోదు. ఈ ప్రపంచంలో మీరు జీవిస్తున్నందుకు అదొక ఉదాహరణ. – కెన్నెడీ

మైన వ్యక్తి తను కావాలి. తన లోకం ఆమె కావాలి.

ఆలోచిస్తున్న అతనికి సాహితి కళ్ల ముందు మెదిలింది. 'ఆ నెచ్చెలి సాహితి అయితే ఆ అనుభవం మరింత మధురంగా ఉంటుంది. సాహితి కళ్లు ఎంతో అందంగా ఉంటాయి. కాని తనను చూస్తే మాత్రం ఆ కళ్లు తమ అందాన్ని కోల్పోతాయి. అది తన దురదృష్టం.

రెండు రోజుల క్రితం తను మేడ దిగి వస్తూంటే సాహితి ఇంటి బయటి అరుగు మీద కూర్చుని ఎదురింటి పాపతో మాట్లాడుతూంది. తను ఆమెను చూచి అక్కడే నిలబడిపోయాడు. కాని సాహితి తనను చూడలేదు. ఆ పాప ముద్దుముద్దుగా మాట్లాడుతూంటే సాహితి కూడా ఆ పాపని యిమిటేట్ చేస్తూ అదేవిధంగా మాట్లాడుతూంటే తనకి ఎంతో ముచ్చటేసింది. చేతిలో 'హేండీకామ్' ఉండి ఉంటే ఆ సుందరమైన దృశ్యాన్ని కెమేరాలో బంధించేవాడే. అయితే తన మనోఫలకం పైన మాత్రం శాశ్వతంగా బంధించాడా దృశ్యాన్ని' అనుకొన్నాడు.

అతని ఆలోచనలు సాహితి నుంచి మాధవి మీదకు మళ్లాయి. 'మాధవిది కూడా అద్భుతమైన అందం. మాధవి మాడ్రన్‌గా ఉంటుంది. ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. ఏదీ సీరియస్‌గా తీసుకోదు. బ్రాడ్‌గా ఆలోచిస్తుంది' అనుకొన్నాడు. 'మాధవి నెల్లూరుకు బయలుదేరి ఉంటుందా? లేదా స్వప్న బలవంతపెట్టి ఈ రోజుకు తన ఇంట్లోనే మాధవిని ఉంచేసుకుందా? ఆమె సెల్‌కు ఫోన్ చేస్తే తెలిసిపోతుంది' అనుకొని జేబులోంచి సెల్ తీసి మాధవి నెంబరు నొక్కాడు.

"హలో శశాంక్. ఎక్కడ్నుంచి? "

"మెరీనా బీచ్- చెన్నై. మీరు? "

"మా ఇంట్లోనుంచి"

"ఇల్లు చేరిపోయారా? ఈరోజుస్వప్నతో చెన్నైలోనేఉండిపోతారనుకొన్నాను"

"స్వప్న చెన్నైలో లేదు"

"ఎక్కడికి వెళ్లారు ఆవిడ? "

"స్వ... ర్గా... ని... కి"

★ ★ ★

మాధవి క్లినిక్‌లో అడుగుపెట్టాడు శశాంక్. లోపలికి రమ్మని పిలుపు రావడంతో కన్సల్టింగ్ రూములోకి అడుగుపెట్టాడు.

"గుడ్ మార్నింగ్" నవ్వుతూ పలుకరించింది మాధవి.

'గుడ్ మార్నింగ్ డాక్టర్" అంటూ కూర్చున్నాడు. మాధవి స్వప్న పోయిన బాధలో విచారంగా ఉంటుందని ఊహించాడు. అయితే ఆమె ఎప్పటిలా ఉత్సాహంగా ఉండటం అతనికి ఆనందం కలిగించింది. ఎంతైనా ఆమె డాక్టరు. ఇటువంటివి ఎన్నో చూసి ఉంటుంది కనుక ఆ బాధ నుంచి త్వరగా బయటపడగలదు' అనుకొన్నాడు. స్వప్న ప్రస్తావన ఆమె దగ్గర తేకూడదని నిశ్చయించుకొన్నాడు. ఆమెకు బాధ కలిగించడం ఇష్టం లేక. అయితే స్వప్న లాంటి చురుకైన అమ్మాయి ఆత్మహత్య ఎందుకు చేసుకుందో తెలుసుకోవాలని ఉంది అతనికి.

"ఏమిటి ఆలోచిస్తున్నారు స్వప్న గురించేనా? "

శశాంక్ ఆమెవైపు చూస్తూ "అవును. స్వప్న ఎందుకు ఆత్మహత్య చేసుకొన్నారో తెలుసుకోవాలని ఉంది" అన్నాడు.

ఆమె టేబుల్ డ్రా తెరిచి అందులోని డైరీ తీసి అతనికి ఇస్తూ "ఈ డైరీ చదవండి. మీ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది" అంది.

డైరీ తెరచి చూసి "ఆమె పర్సనల్ డైరీ చదవవచ్చంటారా? " అని అడిగాడు అనుమానంగా.

"తప్పనిసరిగా చదవాలి మీరు. చదివిన వెంటనే నన్ను కలవండి"

"అలాగే" అని డైరీని తన బ్యాగ్‌లో పెట్టు

కొన్నాడు శశాంక్. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"డైరీ చదివాక మిమ్మల్ని కలుస్తాను" అంటూ సెలవు తీసుకొన్నాడు శశాంక్.

★ ★ ★

ఆరోజు రాత్రి స్వప్న డైరీ తీసి చదవసాగాడు శశాంక్. మొదటి కొన్ని పేజీల్లో మదన్‌తో పరిచయం అయిన సందర్భం, అప్పట్నుంచే అతనంటే ఆమెకు ఇష్టం కలగడం, అతనితో స్నేహం, స్నేహం ప్రేమగా రూపాంతరం చెందడం గురించి రాసింది.

మధ్యమధ్యలో తన ఆలోచనల్ని కొటేషన్లతో రాసింది.

"ప్రేమ యింత మధురంగా ఉంటుందని ముందే తెలిసుంటే ఏనాడో ప్రేమలో పడే దాన్ని" "మదన్. నీ పేరులోని మొదటి మూడు అక్షరాలు అయిపోతున్నాను నేను. యస్.ఐ. ఆమ్ 'మ్యాడ్' ఆఫ్ యు"

ఈ రోజు నేను, మదన్ ఒకటయ్యాం. తప్పు చేశానన్న భయం, సుఖం పొందిన ఆనందం -మిక్స్‌డ్ ఫీలింగ్స్. ఈ ఆనందాన్ని మళ్ళీ మళ్ళీ పొందాలని మది కోరుతోంది. ఈరోజునుంచి మదన్‌ను మరింతగా ప్రేమిస్తున్నాను. హి ఈజ్ మై హీరో, హి యీజ్ మై బాస్, హి ఈజ్ ఎవ్విరి థింగ్ టు మి"

ఆ తర్వాత చాలా పేజీలు ఆమె మదన్‌తో పొందిన ఆనందం, ఆ అనుభవం గురించే రాసింది. జూన్ నెలలో శశాంక్ వెతుకుతున్న పేజీ కనిపించింది. ఆసక్తిగా చదవసాగాడు.

★ ★ ★

మదన్ కట్టిస్తున్న ఇంటికి నన్ను పిలుచుకొని వెళ్లి చూపించాడు. మంచి లొకాలిటీలో చక్కటి ప్లానింగ్‌తో కట్టిస్తున్న ఇల్లు అది. "నీకోసం ప్రేమతో నేను కట్టిస్తున్న తాజ్‌మహల్ యిది" అన్నాడు మదన్. "ఛ. ఇంత చక్కని ఇంటిని సమాధితో పోల్చకు. ప్రేమనగర్ అను. బాగుంటుంది" అన్నాను. ఇప్పటికే పది లక్షలు ఖర్చుఅయిందని అన్నాడు. ఇల్లు చూస్తూంటే అంత ఖర్చు అయివుంటుదనిపించింది. బ్యాంకులోను అయిదు లక్షలు తీసుకొన్నానని, మిగిలింది తన సేవింగ్స్ నుంచి ఖర్చు పెట్టానని చెప్పాడు. ఆ ఇంటిని చూస్తూంటే ఎంతో గర్వంగా అనిపించింది. ఈ ఇల్లు నా సొంతం అన్న భావన నన్ను ఎంతో ఆనందపరచింది.

★ ★ ★

మదన్ కాలేజీకి వచ్చి 'ఇంటికి మార్బల్ స్టోన్స్ తెప్పించాలని, అర్జెంటుగా లక్ష రూపాయలు అవసరమని, ఏంచేయాలో తోచటం లేదని' చెప్పి బాధపడ్డాడు. నా సేవింగ్స్ నుంచి ఇస్తానని చెప్తే ఎంతో సంతోషించాడు. బదులుగా రాత్రి నన్ను హోటల్ గదిలో సంతోషపరిచాడు.

ఈరోజు మదన్ రెండు లక్షలు అడిగాడు. మొదట లేదన్నాను. కాని అతని ముఖంలో విచారం చూడలేకపోయాను. 'అతను ఇల్లు కట్టడానికే అడుగుతున్నాడు కాని వ్యర్థంగా ఖర్చు పెట్టడానికి కాదు కదా' అనిపించింది. పైగా 'మదన్‌తో పెళ్ళయ్యాక ఎటూ ఆ ఇల్లు నా ఇల్లే కదా' అనుకొని రెండు లక్షలు అతనికిచ్చాను. నా దగ్గర ఉన్నదంతా అతనికిచ్చేశాననీ, మళ్ళీ అడగొద్దని చెప్పాను. ఇల్లు పూర్తయ్యాక నెలనెలా కొంత మొత్తం చొప్పున రెండు సంవత్సరాల్లో నా అప్పు తీర్చేస్తానన్నాడు. "ఆ లోపల మన పెళ్ళైపోతే? ' అని అడిగితే "పెళ్ళైనా నీ డబ్బు నీకిచ్చేస్తాను. పెళ్ళి ముందు నీవు సంపాదించిన డబ్బు మీద నాకు అధికారం లేదు" అన్నాడు.

ఈరోజు మదన్ కట్టిస్తున్న ఇంటికి వెళ్ళాము. చాలా వరకు పూర్తయింది యిల్లు. మార్బుల్ ఫ్లోరింగ్ వేశారు. ఎలక్ట్రికల్ వర్క్సు ప్లాస్టరింగు జరుగుతున్నాయి. "మొత్తం పదిహేను లక్షలకు చేరుతుంది ఖర్చు" అన్నాడు. "గృహప్రవేశం ఎప్పుడు? '

' అని అడిగాను. "ముందు మన పెళ్ళి జర గాలి. తర్వాత మనమిద్దరం కలసి గృహప్ర వేశం చెయ్యాలి" అన్నాడు. ఆ మాట విన డానికే ఎంతో హాయిగా ఉంది.

★ ★ ★

మదన్ కనిపించి వారం రోజులు దాటింది. అతని సెల్‌కు ఫోన్ చేస్తే సెల్ ఆఫ్ చేయబడి ఉన్నదని రిప్లై వస్తూంది. అతని ఇల్లెక్కడో తెలియదు. ఆఫీసు అడ్రసు కూడా తెలియదు. తను పనిచేస్తున్న కంపెనీ పేరు ఏదో చెప్పాడు. నోరు కూడా తిరగని పేరు అది. ఇక గుర్తెలా ఉంటుంది? మొదటిసారిగా మదన్‌పై అను మానం కలగసాగింది. రేపు ఆదివారం. ప్రతి ఆదివారం సాయంత్రం మదన్ కొత్త ఇంటి ధ్గగరకు వస్తాడు. రేపు సాయంత్రం అక్కడికి వెళ్ళి మదన్‌ని కలవాలి. వీలైనంత త్వరలో పెళ్ళికి ముహూర్తాలు చూడమని చెప్పాలి.

★ ★ ★

ఈరోజు సాయంత్రం మదన్ కట్టిస్తున్న ఇంటికి వెళ్లాను. లోపల ఎవరో భార్యాభ ర్తలు మాట్లాడుకొంటున్నారు. నన్ను చూసి ఎవరు కావాలని అడిగారు. మదన్ కావా లని చెప్పాను. "ఏ మదన్' అని అడిగారు. నా గుండె లయ తప్పింది. "ఈ ఇల్లు కడు తున్నారే. ఆయన" అన్నాడు ఏడుపు గొంతుతో "భలేవారే. ఈ ఇల్లు కట్టిస్తున్నది ఈయనే. మా వారి పేరు సతీష్. మీరు పొరబాటుగా ఈ యింటికి వచ్చినట్లున్నారు' ' అంది ఆవిడ.

"కాదు.. ఇదే ఇల్లు. ఇదే... ఇల్లు" నాలో నేను అనుకొంటూంటే వాళ్ళు తమ మాటల్లో పడిపోయారు. నాకు కళ్లు తిరుగు తున్నట్లు అన్పించింది. వంట్లో నిస్సత్తువ ఆవహించింది. కిందకు దిగుతూ అలాగే నీరసంగా మెట్లపై కూర్చుండిపోయాను.

ఇంతలో ఎదురుగా పనివాళ్ళు కనిపిం చారు. వెంటనే లేచి వాళ్ళ దగ్గరికి వెళ్ళి "నాతోపాటు మదన్ అని ఒకాయన వచ్చే వారు. ఆయనది కాదా ఈ ఇల్లు" అని అడి గాను.

"ఈ ఇల్లు సతీష్ సార్ దమ్మా" అన్నారు.

"మరి మదన్‌తో రెండుసార్లు ఇక్కడికి వచ్చాను. ఆయన మీకు ఎలా కట్టాలో సూచనలిచ్చాడు"

"ఇల్లు కట్టించేవాళ్ళ తాలూకు బంధు వులు, స్నేహితులు వచ్చి మాతో "అలా కట్టండి, ఇలా కట్టండి' అని చెబుతూ ఉంటారు. కాని మేము మాత్రం ఇంటి యజమాని ఎలా కట్టమంటే అలా కడ తాము. అలాగని ఆ మాట మాకు చెప్పిన వాళ్ళ మొహం మీదే చెప్పలేము కదా. అందుకే ఎవరొచ్చి చెప్పినా అలాగేనని తలూపుతుంటాము. వాళ్ళు ఎవరో, ఇంటి యజమానికి ఏమవుతారో మాకెందుకు చెప్పండి"

వాళ్ళు తమ పనిలో పడిపోయారు.

జరిగింది అర్థమైంది నాకు. నా తెలివి తక్కువ తనానికి నా మీద నాకే కోపం వచ్చింది. ఏడుపు కూడా వచ్చింది. భోరున ఏడ్చేశాను. అయినా మదన్ నన్ను మోసం చేశాడంటే నమ్మబుద్ధి కావడం లేదు. 'ఎక్కడో పొరబాటు జరిగి ఉంటుంది. మదన్ అటువంటి వాడు కాడు' అనుకొని నా మనసుకు ధైర్యం చెప్పుకొన్నాను.

తర్వాత చాలా పేజీలు ఖాళీగా కనిపిం చాయి. ఒకే ఒక పేజీలో ఆమె చేతివ్రాత కనిపించింది. ఆ తర్వాత పేజీలు కూడా ఖాళీగానే ఉన్నాయి. ఆమె చేతి వ్రాత ఉన్న పేజీలోని తేదీ, చూసి 'తను మాధవి చెన్నైకి కలసి వెళ్ళిన రోజుకు రెండు రోజులు ముందు రాసుకున్నది' అనుకు న్నాడు.

ఈరోజు మేము తరచుగా కలుసుకొనే మెరీనా బీచ్‌కు వెళ్ళాను, మదన్ కనబడుతా డేమో అన్న ఆశతో. మదన్ కనిపించాడు.



ఒంటరిగా కాదు. ఓ అందమైన అమ్మా యితో. ఆ అమ్మాయి మదన్ వెనుక మోటార్ బైక్‌పైన కూర్చుని అతన్ని గట్టిగా కౌగలించుకొని ఉంది. మదన్ బైక్ స్టార్ట్ చేశాడు. నేను 'మదన్' అంటూ పిలుస్తూ పరుగెత్తాను. ఒక్కక్షణం వెనక్కి తిరిగి నన్ను చూసి ముందుకు వెళ్లిపోయాడు.

అయిపోయింది. నా ఆశలన్నీ అడియాశ లని తేలిపోయింది. నా దగ్గరున్న డబ్బులు అయిపొయ్యాయని తెలుసుకొన్నాడు కనుక ఇక నాతో అతనికి పనిలేదు. అందుకే మరో అమ్మాయిని - కాదు - విక్టిమ్‌ని వెతుక్కు న్నాడు.

నేను రోజంతా కష్టపడుతూ, మా పెద్ద సంసారాన్ని పోషిస్తూ, నెలకు ఓఅయిదు వేలదాకా ఆదాచేసి బ్యాంకులో దాచేదాన్ని. ఎందుకంటే నా పెళ్ళి, నా చెల్లెళ్ల పెళ్ళిళ్ళు ఆ డబ్బులతోనే జరగాలి కాబట్టి. ఆ డబ్బు మొత్తం పోయింది. అయిదు సంవత్సరాలు నేను దుబారా చెయ్యకుండా, ఆశపడినవి కొనకుండా దాచుకొన్న డబ్బుల్ని అపాత్ర దానం చేశాను.

"మాధవీ! ఈ దెబ్బతట్టుకోలేక పోతు న్నాను. అందుకే ఈ ప్రపంచం నుంచి వెళ్ళి పోవాలని నిర్ణయించుకున్నాను. డబ్బు పోయిందన్న బాధ ఒకవైపు, ప్రేమించి మోసపోయానన్న బాధ మరోవైపు నన్ను మనశ్శాంతిగా ఉండనీయడంలేదు. ఈ స్వార్థపూరిత ప్రపంచంలో ఎవరు మంచి వారు, ఎవరు చెడ్డవారు అన్నది తెలియడం లేదు. పైకి అందరూ అందంగా, మంచిగా కనిపించేవారే. వారి మనసులోని అందం

ఈ జన్మలో చేసిన పనులే మరుజన్మలో పారబ్దం అవుతాయి. - బేకన్

చూసే తెలివితేటలు ఎంతమంది అమ్మాయిలకుంటాయి?

ఈ ప్రపంచం నుండి వెళ్ళిపోతున్నాను. అమ్మా. నన్ను... క్షమించు... నాకు ఏడుపొస్తోందమ్మా. హాయిగా నీ ఒడిలో పడుకుని అన్నీ మరచి నిద్రపోవాలనిపిస్తుంది. నీవు నాకిచ్చిన స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేశానన్న బాధ నన్ను కలచివేస్తోంది. అందుకే నీకు ఏ విషయం తెలియకూడదు. నీ కూతురు ఏ గుండెనొప్పో వచ్చి పోయిందనుకోవాలి.

మాధవీ! ఈ డైరీ అమ్మగాని, చెల్లెళ్ళుగాని చూశారంటే నన్ను అసహ్యించుకోవచ్చు అందుకే దీన్ని నీకు పంపుతున్నాను. దీని వల్ల ఇంకో లాభం కూడా ఉంది. ఇది చదివి నీవు నాలా ఎవరిచే మోసపోవు. జాగ్రత్తగా ఉంటావు. ఉంటాను.... సారీ వెళ్తాను ఫ్రెండ్. వెళ్ళిపోతున్నాను - స్వప్న

★ ★ ★

డైరీ మూసి లైట్ ఆఫ్ చేసి పడుకొన్నాడు శశాంక్. అతని మనసంతా బాధతో నిండిపోయింది. స్వప్నా. మదన్ చేసిన పనికి ఓ మగవాడిగా నేనూ సిగ్గుపడుతున్నాను. కాని నీవు తొందరపడ్డావు. నీ సమస్యకు చావే పరిష్కారం కాదు. నీ చావు వల్ల మీ ఇంట్లో ఎన్ని సమస్యలు తలెత్తుతాయో నీవు ఆలోచించలేదు. నీ కన్నతల్లి కడుపుకోత గురించీ ఆలోచించలేదు. నీవు బ్రతికుండి వాణ్ణి పోలీసులకు పట్టించి ఉంటే మరెందరో ఆడపిల్లల జీవితాల్ని కూడా కాపాడగలిగేదానివి' అనుకొన్నాడు.

మరుసటి రోజు ఉదయం పన్నెండు గంటలకు మాధవి క్లినిక్‌కు వెళ్ళి మాధవికి డైరీ తిరిగి ఇచ్చాడు.

"డైరీ చదివాక మీకేమనిపించింది? " అని అడిగింది మాధవి.

"బాధనిపించింది. స్వప్న ఆత్మహత్య చేసుకోకుండా, అతని బండారం బయటపెట్టి ఉంటే మరెందరో అమ్మాయిల జీవితాలు కాపాడి ఉండేది కదా అని అనిపించింది".

"అలా జరిగి ఉంటే నా స్నేహితురాలు నాకు దక్కి ఉండేది. నేను స్వప్నకు ధైర్యం చెప్పి జరిగింది మరచిపోయేలా చేసి ఉండేదాన్ని. నాతో ఒక్కమాట కూడా చెప్పకుండా వెళ్ళిపోయింది" అంటూ ఏడవసాగింది మాధవి.

శశాంక్ ఆమెను అంత బేలగా చూడటం అదే మొదటిసారి.

"ప్లీజ్. ఏడవకండి..." అన్నాడు. ఆమె కళ్ళు తుడుచుకొంది.

"మదన్‌తో తన అఫైర్ గురించి మీతో ఎప్పుడూ చెప్పలేదా? మీరు తనకు చాలా క్లోజ్ ఫ్రెండ్ కదా" అని అడిగాడు శశాంక్.

"చెబితే వద్దని వారిస్తానని భయపడి ఉంటుంది. అందుకే చెప్పలేదు"

"అయినా ఆవిడ అంత డబ్బు మదన్‌కు ఎలా ఇచ్చిందో అర్థంకావడం లేదు. పది వేలు లేదా యిరవై వేలు అంటే ఫరావా లేదు. మూడు లక్షలు, అదీ నెలనెలా తను కష్టపడి సంపాదించి దాచుకొన్న డబ్బు అతనికి ఎలా ఇచ్చి ఉంటుంది".

"డైరీలో రాసుకుందిగా 'డబ్బు చూడగానే మదన్ సంతోషపడ్డాడు. నన్ను సంతోషపెట్టాడు" అని. ఈమె వీక్‌నెస్ తెలుసుకున్నాడు. బాగా ఉపయోగించుకొని లాభం పొందాడు" అంది మాధవి.

"పెద్దలు అందుకే అన్ని ఆంక్షలు, కట్టుబాట్లు పిల్లలకు పెడతారు. క్రమశిక్షణతో ఉంటే ఎంత లాభమో, ఉండకపోతే ఎంత నష్టమో స్వప్న జీవితం చూసినవాళ్ళకు అర్థమవుతుంది"

కొద్దిసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"శశాంక్. మీరు చెన్నై తరచుగా వెళ్తాంటారు కదా. ఈసారి వెళ్ళినప్పుడు నాకో సహాయం చేస్తారా? "

"చెప్పండి. మదన్ కనిపిస్తే కొట్టమంటారా? " నవ్వుతూ అన్నాడు.



"కాదు. స్వప్న తల్లిని కలసి ఆమెను ఓదార్చండి. నేను చెన్నై వచ్చినప్పుడు స్వప్న సెల్‌కు ఫోన్‌చేస్తే ఆమె చెల్లెలు గీత విషయం చెప్పింది. అప్పటికి అన్నీ అయిపోయాయి. ఇంటికి వెళ్ళినా లాభం ఉండదని వెనక్కి వచ్చేశాను. పైగా నాకు ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా నెల్లూరు వచ్చి తనివి తీరా ఏడ్వాలనిపించింది. ఒంటరిగా ఉన్నప్పుడు ఇలాంటివి వింటే ఎంత నరకంగా ఉంటుందో అనుభవమైంది నాకు"

"స్వప్న ఆత్మహత్య చేసుకుందని మీకు చెన్నైలోనే తెలిసిందా? "

"లేదు. స్వప్న హార్ట్ ఫెయిలై మరణించిందని గీత చెప్పింది. స్వప్న డైరీ చదివాకే ఆమె ఆత్మహత్య చేసుకుందన్న విషయం తెలిసింది. ఆ విషయం ఎవరితోనైనా చెప్పాలనిపించి మీకు ఫోన్ చేశాను. మీరు ఆత్మహత్మకు కారణం అడిగారు. అది నేను చెప్పడం కంటే మీరు డైరీ చదివితే మంచిదని వెంటనే వచ్చి నన్ను కలవమన్నాను. మీరు కలిశారు. డైరీ యిచ్చాను. ఇంకొక్క పని చెయ్యాలి మీరు. స్వప్న యింట్లో మదన్ ఫొటో మీకు దొరికితే తీసుకురండి".

"ఎందుకు? "

"అతన్ని చూడాలని ఉంది. కనీసం అతని ఫోటోనన్నా ముక్కలు ముక్కలు చెయ్యాలని ఉంది"

కసిగా అంది మాధవి.

★ ★ ★

వీధిలో కారు హారన్ వినిపించి కిటికీలోంచి చూశాడు శశాంక్. ముకుందరావు ఫ్యామిలీ కారు దిగుతూ కనిపించారు. ఈ మధ్య ప్రమీలమ్మ అన్నగారికి అనారోగ్యంగా ఉండటంతో గత కొద్దిరోజులుగా బెంగుళూరు వెళ్లాలని ప్రయత్నిస్తున్నది ఆవిడ. కీర్తన చదువుతున్న కాలేజీకి శెలవులు యివ్వడంతో వారం రోజుల క్రితం నలుగురూ బయలుదేరి వెళ్లారు.

శశాంక్ కిందకు వచ్చి కారు లోని లగేజ్ ఇంట్లోకి తెచ్చిపెట్టాడు. అందరూ అతన్ని చూసి పలకరింపుగా నవ్వారు.

"ఏం శశాంక్ బాగున్నావా? " ప్రమీలమ్మ అడిగింది.

"బాగున్నానండీ. మీ అన్నగారు ఎలా ఉన్నారు? "

"ఇప్పుడు బాగున్నాడు".

"కారు ఎవరిది? " శశాంక్ అడిగాడు.

"మా అన్నయ్య స్నేహితుడిది. బెంగుళూరులో మేము ఉన్నన్ని రోజులు మేము తిరగడానికి అరేంజ్ చేశాడు అన్నయ్య. ఇప్పుడు మా ప్రయాణానికి కూడా ఏర్పాటు చేశాడు మేము వద్దన్నా వినకుండా."

"కూర్చోండి" అంది సాహితి శశాంక్‌తో

సాహితి ఎందుకో అతని కళ్లకు మరింత అందంగా కనిపించింది ఆమె కళ్లు సంతోషంతో, కాసింత సిగ్గుతో ప్రకాశిస్తున్నాయి. ప్రయాణం కోసం ఆమె కట్టుకొన్న నల్లటి చుక్కలున్న తెల్లని కాటన్ చీర నలిగి ఉన్నా ఏదో కొత్త అందాన్ని తెచ్చిపెట్టింది ఆమెకు.

"శశాంక్ మా సాహితికి కంగ్రాట్స్ చెప్పాలి నువ్వు" అంది ప్రమీలమ్మ.

"రిజల్ట్స్ వచ్చాయా? వెరీగుడ్. హార్టీ కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు అభినందన పూర్వకంగా ఆమె వైపు చూస్తూ.

"అది కాదు కారణం. మా అన్నయ్య సాహితికి చూసిన పెళ్లిసంబంధం కుదిరింది"

షాక్ తిన్నట్లు మొహం పెట్టాడు శశాంక్. ఆవిడ ప్రయత్నాలు ఇంత త్వరగా ఫలిస్తాయని ఊహించలేదు అతను. సాహితి మనసు గెలవడానికి ఇంకా చాలా సమయం ఉందని అనుకొన్నాడు. అతని మనసంతా బాధతో నిండిపోయింది.

"ఎటూ బెంగుళూరు వచ్చారు కాబట్టి నేను చూసిన పెళ్లికొడుకును పిలిపిస్తాను. నా ఇంట్లోనే పెళ్లి చూపులు ఏర్పాటుచేస్తాను" అన్నాడు అన్నయ్య. అసలే అతని

ఆరోగ్యం బాగా లేదు. మాకు బెంగుళూరులో ఏది ఎక్కడుందో తెలియదు. అందువల్ల 'ఇంకోసారి చూద్దాంలే' అని నేనెంత చెప్పినా వినిపించుకోకుండా అబ్బాయి తల్లిదండ్రులతో మాట్లాడి నిన్న పెళ్లిచూపులు అరేంజ్ చేశాడు. అబ్బాయికీ, అమ్మాయికీ ఒకరికొకరు నచ్చారు. వచ్చేనెలలో మంచి రోజు చూసి చెబితే నెల్లూరు వచ్చి నిశ్చితార్థం చేసుకొని వెళ్తామన్నారు."

ప్రమీలమ్మ చెబుతున్నది వినబడుతున్నా తలకెక్కడం లేదు అతనికి. సాహితి పరాయి మనిషి సొంతం అవుతుంది అన్న నిజం భరించలేకపోతున్నాడు. అంత త్వరగా సంబంధం కుదిర్చిపెట్టిన ప్రమీలమ్మ అన్నయ్య మాధవరావును మనసులోనే తిట్టుకొన్నాడు.

"ఏం శశాంక్' సంబంధం చూడండి. మొత్తం పెళ్లి నేనే జరిపిస్తాను.' అన్నావు. ఇప్పుడేమో ఏమీ మాట్లాడకుండా కూర్చున్నావు" అంది ప్రమీలమ్మ నవ్వుతూ.

"ఏదీ నువ్వు ఆయన్ను మాట్లాడనిస్తేగా? " చిరుకోపంగా అంది సాహితి.

"ఆరోజు చెప్పిందే ఈ రోజు కూడా చెబుతున్నాను. మీరు ఇల్లు కదలకుండా నేనే అన్నీ చేసి పెడతాను చూస్తూండండి" అన్నాడు శశాంక్. షాక్ నుంచి తేరుకుని. "నాకా నమ్మకం ఉంది. నీ చల్లని నోటితో సాహితికి మొదటి సంబంధమే కుదురుతుందని అన్నావు. అదే నిజమైంది చూశావా? " అంది ప్రమీలమ్మ సంతోషంగా.

శశాంక్ నవ్వుకున్నాడు. 'తను ప్రమీలమ్మను సంతోషపెట్టడం కోసం ఆ మాట అన్నాడు కాని నిజానికి సాహితికి వేరే సంబంధం కుదరడమే తనకు ఇష్టం లేదు. ఎందుకంటే ఆమె తన సొంతం కావాలని కోరుకుంటున్నాడు కాబట్టి. 'పైన తథాస్తు దేవతలుంటారు. అశుభం మాట్లాడకు' అంటూంటుంది తన తల్లి. తను శుభమే పలికినా, తనకు ఇష్టం లేని మాట అన్నాడు. దేవతలు 'తథాస్తు' అన్నారులా ఉంది' అనుకున్నాడు.

★ ★ ★

ఆరోజు సాహితి నిశ్చితార్థం. మధ్యాహ్నం మూడు గంటలకు కారులో పెళ్ళికొడుకు మోహన్, అతని తల్లిదండ్రులు, మేనత్త, ఆవిడ భర్త వచ్చారు. శశాంక్ ఉదయం నుంచీ తిరుగుతూ అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాడు. పూలు, పండ్ల దగ్గర్నుంచి వంటవాళ్ళను ఏర్పాటుచేయడం, వంట సామగ్రి తేవడం లాంటి అన్ని పనులూ తనే చేశాడు.

పెళ్ళికొడుకును చూడగానే 'సాహితికి అతను అంతగా నచ్చడంలో ఆశ్చర్యం లేదనిపించింది' అతనికి. అతను చాలా అందంగా ఉన్నాడు. శశాంక్‌కు 'కాబోయే అల్లుడి'ని పరిచయం చేశాడు ముకుందరావు. శశాంక్‌తో మోహన్ చాలా ఫ్రీగా మాట్లాడాడు. ముకుందరావు చెల్లెలు నెల్లూరులోనే ఉంది. ఆవిడ, ఆవిడ భర్త సదాశివరావు ఉదయమే వచ్చారు. సదాశివరావు రైల్వేస్‌లో పనిచేసి రిటైరయ్యారు. ఆయన పెన్షన్ అక్కౌంటు ప్రారంభించడానికి శశాంక్ సహాయం చేశాడు. రామకృష్ణ పని చేసే బ్రాంచిలో అక్కౌంట్ ఓపెన్ చేయించాడు. అప్పట్నుంచీ శశాంక్ అంటే ఎంతో అభిమానంగా ఉంటారాయన. ప్రమీలమ్మ అన్నయ్య ఫ్యామిలీ ముందురోజే వచ్చారు.

నిశ్చితార్థం సమయంలో మోహన్ తన కెమెరా శశాంక్‌కిచ్చి ఫొటోలు తీయమని కోరాడు. మోహన్‌ను, సాహితిని కెమెరా లెన్సులో చూస్తుంటే అతనికి బాధగా అన్పించింది. 'ఆమె ప్రక్కన వరుడి రోల్ పోషించవలసిన తను ఫోటోగ్రాఫర్ రోల్ చేస్తున్నాడు. ఒకే ఇంట్లో ఉంటూ కూడా ఆమె ప్రేమని పొందలేకపోయాడు. ఆమె మరొకరి సొంతం అవుతూంటే బాధపడటం మాత్రం చేతనవును తనకు' అనుకొని

తనను తానే తిట్టుకొన్నాడు.

రాత్రి భోజనాలయ్యాక బెంగుళూరు బయలుదేరి వెళ్ళారు వాళ్ళు. వెళ్ళేముందు మోహన్ సాహితివైపు చూసి చిలిపిగా నవ్వడం, సాహితి సిగ్గుతో తలవాల్చడం అతని దృష్టిని దాటిపోలేదు. ఇక సాహితి రూపాన్ని, ఆమె గురించిన ఆలోచనల్ని తన మనసునుంచి పూర్తిగా చెరిపెయ్యాలని నిర్ణయించుకొన్నాడు శశాంక్. నిర్ణయమైతే తీసుకొన్నాడు కానీ అది అంత సులభం కాదని అన్పించింది అతనికి. 'ఎందుకో సాహితి అంటే తనకే తెలియకుండా అనుబంధం పెంచుకొన్నాడు. ఒక్కసారిగా తెంచుకోవాలంటే కష్టమే' అనుకొన్నాడు.

★ ★ ★



చెన్నైలో తను వచ్చిన పని పూర్తయ్యాక మాధవి ఇచ్చిన స్వప్న అడ్రస్ పట్టుకొని యిల్లు కనుక్కున్నాడు శశాంక్. అతనికి చెన్నైలో చాలా మంది బంధువులు ఉండటం, వాళ్ళ యిండ్లకు అతను తరచూ వెళ్తూండటం వల్ల చెన్నైలోని చాలా ప్రదేశాలు అతనికి పరిచయమే. తమిళంలో బాగా మాట్లాడగలడు కూడా.

కాలింగ్‌బెల్ కొట్టగానే ఓ ముసలావిడ వచ్చి తలుపు తీసింది. అరవైలోపే ఉండొచ్చు ఆవిడ వయస్సు. శశాంక్ మాధవి స్నేహితుడిగా తనను తాను పరిచయం చేసుకొన్నాడు.

"రా నాయనా. కూర్చో మంచినీళ్ళు యివ్వనా? "

"ఇవ్వండి" కుర్చీలో కూర్చుంటూ అన్నాడు.

నీళ్ళు త్రాగాక "మీ అమ్మాయి మరణ వార్త విని మాధవిగారు ఎంతో బాధపడ్డారు. మీకు తన సానుభూతి తెలియజేయమన్నారు" అన్నాడు.

"ఏం చేస్తాం నాయనా. మాకు ప్రాప్తం లేదు" అంది కళ్ళనీళ్ళతో

"స్వప్నగారు నాకు కూడా స్నేహితురాలే. ఆవిడ ఎలా పోయారు? "

"హార్ట్ ఫెయిల్‌తో పోయింది. రాత్రి హాయిగా నవ్వుతూ ఎన్నో కబుర్లు చెప్పింది. తన స్టూడెంట్స్ ఎలా ప్రవర్తిస్తారో మిమిక్రీలా చేసి చూపింది. తన చెల్లెళ్ళు నిద్రపోయాక చాలాసేపు నా ఒడిపై తలపెట్టుకొని పడుకొంది. నాలాంటి తల్లిని పొందిన తను చాలా అదృష్టవంతురాలంది. తన తండ్రిని తలచుకొని ఏడ్చింది. నేనే "ఇక పడుకోమ్మా. మళ్ళీ రేపు ఉదయం డ్యూటీకి వెళ్ళాలి" అంటూ బలవంతంగా లేపి తన గదికి పంపాను. అదే నేను దానితో చివరిసారిగా మాట్లాడటం అని అప్పుడు తెలియలేదు నాకు" అంటూ భోరున ఏడవసాగింది.

శశాంక్‌కు మనసు కలచివేసినట్లయింది. ఆమె వైపు జాలిగా చూస్తుండిపోయాడు. ఆమె తేరుకొని మళ్ళీ చెప్పసాగింది.

"ఉదయం నిద్రలేచి గది బయటనుంచే స్వప్నను నిద్రలేపమని అరచి నా పనుల్లో పడిపోయాను. రోజూ అయిదుగంటలకల్లా నిద్ర లేచేది బిడ్డ. రాత్రి ఆలస్యంగా పడుకొంది కదా. మరి కాసేపు నిద్రపోనీ" అనుకొని ఏడు దాకా లేపలేదు. తర్వాత కాలేజీకి ఆలస్యమయితే యిబ్బందని నా రెండో కూతురు కవితను వెళ్ళి నిద్రలేపమన్నాను.

గదిలో కెళ్ళిన కవిత కంగారుగా నా దగ్గరికి వచ్చి "అమ్మా అక్క లేవడం లేదే. కదలడం కూడా లేదు" అంది. నా గుండె జారిపోయింది. పరుగెత్తినట్లే వెళ్ళి "స్వప్నా స్వప్నా" అంటూ గట్టిగా కదిపాను. నా బిడ్డ లేవ లేదు. డాక్టరు వచ్చి పెదవి విరిచాడు. నేను కుప్పకూలిపోయాను. దాంతోపాటు నా ప్రాణం కూడా పోయి ఉంటే బాగుండేది. నన్ను బ్రతికించి చంపుతున్నాడు ఆభగవంతుడు శోకంతో"

మళ్ళీ ఏడవసాగింది ఆవిడ.

"ప్లీజ్ ఏడవకండి. మీరూ పోయి ఉంటే మీ మిగిలిన పిల్లల గతి ఏమయ్యేది? పోయిన వాళ్ళతో మనమూ పోలేము కదా. ఉన్నవాళ్ళలో పోయినవాళ్ళను చూసుకుంటూ బ్రతకాలి. తప్పదు" అన్నాడు సముదాయిస్తూ.

కొద్దిసేపటికి ఆవిడ తేరుకొంది. "ఉండు నాయనా. కాస్త కాఫీ తెస్తాను" అంటూ లేచింది. "మీరు శ్రమ తీసుకోకండి. నేను కాఫీ తాగే వచ్చాను"

"ఫర్వాలేదు నాయనా. ఎండన బడి వచ్చావు. కాస్త నిమ్మరసం అయినా ఇవ్వనివ్వు" అంటూ వంటగదిలోకి వెళ్ళింది.

శశాంక్ ఇల్లు పరిశీలించసాగాడు. చాలా పాత యిల్లు అది. స్వప్న తండ్రిగారి ఫొటో కాబోలు పెద్దసైజు ఫ్రేములో గోడకు తగిలించబడి ఉంది. టీవీ మీద ఫొటో ఫ్రేములో ముగ్గురమ్మాయిల ఫొటో ఉంది. దగ్గరగా వెళ్ళి ఆ ఫొటోని చేతిలోకి తీసుకొని చూశాడు. మధ్యలో స్వప్న నిలబడి ఉంది. ఆమెకు చెరోవైపు చెల్లెళ్ళు కాబోలు నిలబడి ఉన్నారు. వాళ్ళలో స్వప్న పోలికలు బాగా కనబడుతున్నాయి.

ఆవిడ నిమ్మ రసం గాజు గ్లాసులో తెచ్చింది. శశాంక్ లేచి అందుకొని మళ్ళీ కూర్చున్నాడు. ఆవిడ అతని ఎదురుగా కూర్చుంది.

"మీరు తాగలేదేం అమ్మా. ఇంకో గ్లాసు తీసుకురండి. చెరి సగం తాగుదాం" అన్నాడు.

"వద్దు నాయనా. చల్లని పదార్థాలు నాకు పడవు"

శశాంక్ నిమ్మరసం తాగుతూ ఆలోచించ సాగాడు. 'స్వప్న తాలూకు వస్తువులు చూస్తే తనకు మదన్ ఫొటో కనబడవచ్చు అవి చూపించమని ఈవిడని ఎలా అడగాలి? అడిగితే ఆవిడకు అనుమానం రాకూడదు. ఏ కారణం చెప్పి అడగాలి?' రెండు నిమిషాల తర్వాత అతనికి ఆవిడకు ఏం చెప్పాలో తోచింది.

"అమ్మా మాధవిగారు తన షేరు సర్టిఫికెట్లు స్వప్నగారికిచ్చి ఆ డబ్బులు వచ్చేలా చూడమన్నారట. ఆ కంపెనీ చెన్నైలోనే ఉందట. సర్టిఫికేట్లు మీ దగ్గర ఉంటే తీసుకురమ్మన్నారు"

"ఆ విషయాలు నాకు తెలియవు నాయనా. స్వప్న తాలూకు వస్తువులన్నీ ఆ ట్రంకు పెట్టెలో వేశాము. నీకు ఓపికుంటే అందులో వెతుకు. దొరికితే నాకూ సంతోషమే. లేదంటే మా అమ్మాయిలు సాయంత్రం వస్తారు. వాళ్ళనడిగితే చెప్పగలరేమో చూద్దాం"

శశాంక్‌కు ఆవిడ జవాబు ఎంతో నచ్చింది.

"నేను యీ బాక్స్‌లో చూస్తాను. లేకుంటే ఏం చేయాలో ఆలోచిద్దాము" అంటూ బాక్స్‌ను సమీపించాడు. చాలా పాత పెట్టె అది. ఓ స్టూల్ లాక్కొని, పెట్టె పక్కనే కూర్చుని ఒక్కో వస్తువూ తీసి చూడసాగాడు. హేండ్ బ్యాగ్, మేకప్ బాక్స్ లాంటి వన్నీ కనిపించాయి. కొన్ని తెలుగు నవలలూ, టీచింగ్ నోట్స్ కనిపిస్తే అందులో ఎక్కడైనా ఫొటో దాచి ఉంటుందేమోనని

సోమరిగా ఉండకండి. ఉపయోగకరమైన పనులను చేయలేనపుడు మనసును మంచి పనులను చేయడం వైపు మళ్ళించండి. - ఫ్రాన్సిస్ థాంప్సన్

వెతికాడు. అతని ప్రయత్నం ఫలించలేదు. అట్టడుగున బ్యాంకు పాసు పుస్తకం కనిపించింది. తెరచి చూశాడు. పదివేలదాకా బ్యాలన్స్ ఉంది అక్కౌంటులో.

పాస్‌బుక్‌లో ఎంట్రీలు చూశాడు. లక్షా, రెండు లక్షలు డ్రా చేసినట్లు ఆ పాస్‌బుక్‌లో ఎంట్రీలు లేవు. ఆమె చనిపోయిన ముందురోజు పదివేలు డ్రా చేసినట్లు పాస్ బుక్‌లో ఎంట్రీ ఉంది. ఆ పదివేలూ తన దహనం ఖర్చులకే విత్‌డ్రా చేసి ఇంట్లో వాళ్ళకు తెలిసేలా పెట్టి ఉంటుందనిపించింది. తన దహనక్రియలకు తానే డబ్బు విత్‌డ్రా చేసి పెట్టడం ఎంత ట్రాజెడీ? అతని మనసంతా స్వప్నపై జాలితో నిండిపోయింది.

'ఆ మూడు లక్షలూ అంతకు ముందే డ్రా చేయబడ్డాయి కనుక, ఈ అక్కౌంటు నుంచి డ్రా చేసి మదన్‌కు ఇచ్చి ఉంటే ఆ రెండు ఎంట్రీలూ పాస్‌బుక్‌లో కనిపించేవి. కనిపించలేదంటే ఆ డబ్బులు ఈ అక్కౌంటు నుంచి డ్రా చేయలేదు. ఇంకో అక్కౌంటు నుంచి డ్రా చేసి ఉంటుంది' అనుకొంటూ ఇంకో పాస్‌బుక్ కోసం పెట్టె మొత్తం వెతికాడు. కనిపించలేదు. 'మదన్‌కు డబ్బులిచ్చిన విషయం ఇంట్లో తెలియకూడదని ఆ పాస్‌బుక్‌ను తన కాలేజ్‌లో గాని, బ్యాంకు లాకర్‌లో గాని దాచిపెట్టి ఉంటుంది' అనుకొన్నాడు.

తనకు దొరికిన పాస్‌బుక్‌లోని అక్కౌంటు నెంబరును తన జేబులోని పాకెట్ టెలిఫోన్ డైరెక్టరీలో రాసుకొన్నాడు ఆవిడ చూడకుండా. ఆవిడ టీవీలో ఏదో తమిళ సీరియల్ సీరియస్‌గా చూస్తోంది. మరో మూడు నిమిషాల్లో పెట్టెలోని వస్తువులన్నింటినీ సోదా చేయడం పూర్తి చేశాడు. మదన్ ఫొటో కనిపించకపోవడంతో కొంత నిరాశ చెందాడు.

'అసలు మదన్ ఫొటో ఇంట్లో ఉంటుందని తను అనుకోవడమే పొరబాటు. తల్లికి, తోబుట్టువులకూ తెలియకుండా సాగించిన ప్రేమాయణం కాబట్టి ఇంట్లో ఫొటో ఉంచితే ఆమె గుట్టు రట్టవుతుందని ఆ పనిచేసి ఉండదు లేదా ఎవరికీ తెలియని చోట రహస్యంగా దాచి ఉండాలి. 'ఎవరికీ తెలియని చోట' ఆలోచిస్తూ కూర్చున్న అతను అసంకల్పితంగా తన చేతిలోని పాస్‌బుక్కు పైకవర్ తీసి చూశాడు.

అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. పాస్ బుక్‌కీ, కవర్‌కీ మధ్య ఉంది ఓ కలర్‌ఫొటో. ఆత్రంగా ఫొటోని దగ్గరగా పెట్టుకొని చూశాడు. ఆ ఫొటోలో స్వప్న, ఆమె ప్రక్కన ఓ యువకుడు ఉన్నారు. అయితే ఫొటో తీస్తున్నప్పుడు అతను మొహానికి చెయ్యి అడ్డంగా పెట్టడం వల్ల ముఖం పూర్తిగా ఫొటోలో పడలేదు. మీసాలు, నవ్వుతున్న పెదాలు, పలువరుస కనబడుతోంది. అదీ సైడు పోజులో.

మళ్ళీ నిరాశ ఆవహించింది అతనిలో. 'ఈ ఫొటో వల్ల పెద్దగా లాభం లేదు. ఎవరూ గుర్తించలేరు అతన్ని' అనుకొన్నాడు. అతను కావాలనే తన ముఖం ఫొటోలోకి రాకుండా జాగ్రత్తపడ్డాడని అర్థమైంది శశాంక్‌కు. ఫొటోతీసి షర్టు జేబులో పెట్టుకొన్నాడు ఆమె చూడకుండా.

తర్వాత పెట్టె మూసి వచ్చి ఆవిడ ఎదురుగా కూర్చున్నాడు.

"దొరికాయా" టీవీ ఆఫ్‌చేస్తూ అడిగింది.

"లేదండీ. స్వప్నగారు కంపెనీలో ఇచ్చేసి ఉంటారేమో. మరో నెల రోజులు చూసి డబ్బులు రాకుంటే కంపెనీకే లెటర్ రాద్దాం"

"పాపం మాధవిని ఇబ్బంది పెడ్తున్నాం"

"ఇందులో ఇబ్బందేం లేదు. ఆ డబ్బులు ఎక్కడికీ పోవు. అన్నట్టు స్వప్న పాస్‌బుక్‌లో పదివేల పైనే బ్యాలన్స్ ఉంది. మీరు క్లెయిమ్ చేశారంటే మీ ముగ్గురికీ ఇస్తారు డబ్బులు"

"అవును. చెప్పారు. స్వప్న డెత్ సర్టిఫికెట్ కోసం అప్లై చేశాం. అది రాగానే

బ్యాంకు వాళ్ళను కలుస్తాం. పక్కింట్లో ఉన్న వాళ్ళు చాలా మంచివాళ్ళు. ఆ విషయాలన్నీ వాళ్ళే చూస్తున్నారు"

"మంచిది. నేను వెళ్ళి వస్తాను. మీకు చాలా థాంక్సండీ" అన్నాడు లేస్తూ.

"అలాగే నాయనా" అంటూ ఆవిడ చీర కొంగుతో కన్నీళ్ళు తుడుచుకోవడం కనిపించింది. శశాంక్ కళ్ళలో కూడా నీరు తిరిగింది. 'ఆమె బాధ ఎవరూ తీర్చలేరు. కాలమే ఆమెకు తగిలిన గాయాన్నీ మాన్పాలి' అనుకొన్నాడు.

"మీరు ధైర్యంగా ఉండండి. భగవంతుడు మీకు ధైర్యం యివ్వాలని కోరుకొంటున్నాను" అని చెప్పి బయటకు నడిచాడు.

★ ★ ★

స్వప్న ఇంటి నుంచి బయలుదేరి మందవల్లిలోని ఆమె పనిచేసిన కాలేజీకి వెళ్ళాడు. కాలేజీ అడ్రసు కూడా అతనికి మాధవే యిచ్చింది. స్వప్నతో పనిచేస్తున్న లెక్చరర్లకు మదన్ గురించి తెలిసి ఉంటుందనే ఆశాభావంతో వెళ్ళాడు కాలేజ్‌కి. మరో పది నిమిషాల్లో లంచ్ బెల్ ఉందని వాచ్‌మన్ చెప్తే గేటు బయటి ఓ చెట్టు క్రింద నిల్చున్నాడు.

బెల్ శబ్దం వినిపించిన రెండు నిమిషాలకు స్టూడెంట్స్ బయటకు రాసాగారు. శశాంక్ లోపలికి వెళ్ళి లేడీస్ స్టాఫ్‌రూం ఎక్కడో కనుక్కొని వెళ్ళాడు. లెక్చరర్లందరూ అప్పుడే ఒక్కొక్కరుగా ఆ గది చేరుకొంటున్నారు.

"నమస్తే. నేను స్వప్న స్నేహితుడిని" అన్నాడు గది బయటే నిలబడి చేతులు జోడిస్తూ.

"నమస్తే రండి లోపలికి" అన్నారు. కొంతసేపు స్వప్న గురించి మాట్లాడుకున్నాక

"స్వప్న అకాల మరణం మమ్మల్ని ఎంతో బాధిస్తోంది. ఎంతో మధనపడి ఉంటే గాని అలా మరణించే అవకాశం లేదు. స్వప్న ఎలా ప్రవర్తించేది కాలేజీలో? " అని అడిగాడు శశాంక్.

అందరూ స్వప్న మంచి పిల్లని, జాలిగుండెగల స్త్రీ అని, కాలేజీలో ప్రతి ఒక్కరూ ఆమెని అభిమానించేవారని చెప్పారు. కొంతమంది స్వప్న ప్రస్తావన రాగానే కళ్ళనీళ్ళు పెట్టుకొన్నారు కూడా.

"స్వప్న ఎవరినైనా ప్రేమించిందా? " అన్న ప్రశ్నకు "ఆ అవకాశం లేదని, ఆమె అటువంటి అమ్మాయి కాదని, బాధ్యతలు తెలిసిన అమ్మాయని' అన్నారు. శశాంక్ తన జేబులోని ఫొటో తీసి వారికి చూపించి "ఇతడిని ఎప్పుడైనా స్వప్నతో చూశారా? " అని అడిగాడు. వాళ్ళు చూడలేదన్నారు.

వాళ్ళకు 'థాంక్స్' చెప్పి బయటకు వచ్చాడు. 'తను యిలా స్వప్న కొలీగ్స్‌తో మాట్లాడినట్లు స్వప్న తల్లికిగాని, చెల్లెళ్ళకుగాని తెలిస్తే వాళ్ళకు కోపం రావచ్చు కాని ఆ మదన్ ఎవరో చూడాలన్న కోరిక, వీలైతే కసితీరా తన్నాలన్న కోరిక తనలో ప్రబలమౌతూంది. అయినా తనకెందుకింత కోపం అతని మీద? స్వప్న తన తోబుట్టువు కాదు. కనీసం స్నేహితురాలు కూడా కాదు. కేవలం పరిచయస్తురాలు. అయినా ఆమెకు అన్యాయం చేసిన ఆ మదన్‌పై తనకెందుకింత కోపం? ' అనుకొన్నాడు. కొంతసేపు ఆలోచించాక అతనికి సమాధానం దొరికింది. 'తనకు ఆడవాళ్ళంటే గౌరవం, సానుభూతి ఉంది. ఆడవాళ్ళు బాధపడుతూంటే తన చూడలేడు' అనుకొన్నాడు.

ఆలోచనల నుండి తేరుకొని అటుగా వెళ్తున్న ఆటోను పిలవబోయాడు శశాంక్. ఇంతలో "హలో. ఏమండీ" అంటూ ఓ అమ్మాయి తనవైపు రావడం కనిపించింది అతనికి. ఇందాక తను మాట్లాడిన లెక్చరర్లలో ఆవిడ ఉన్నదని గుర్తొచ్చింది అతనికి. ఆవిడ స్వప్న గురించిన సమాచారం అందించడానికి వచ్చిందని అర్థమైంది.

"చెప్పండి. ఏమిటి విషయం? " అని తమిళంలో అడిగాడు.

"నాకు తెలుగువచ్చు. నేను తెలుగమ్మా

యినే. నా పేరు నళిని" అంది నవ్వుతూ.

"నేను తెలుగువాణ్ణని మీకెలా తెలుసు?" అని అడిగాడు.

"మీ తమిళ యాస చూసి తెలుసుకొన్నాను. పైగా నెల్లూరు నుంచి వచ్చానని మీరే చెప్పారు కదా".

"అవును. ఆ విషయం మరచిపోయాను"

"స్వప్న మదన్ అనే వ్యక్తిని ప్రేమించింది. ఆ విషయం కాలేజీలో నాకు తప్ప ఇంకెవరికీ తెలియదు" అంది నళిని.

"మదన్‌ని మీరు చూశారా?" ఆసక్తిగా ఆమెను అడిగాడు.

"ఈ ఫోటోలోని వ్యక్తిని మీరు ఎప్పుడూ చూడలేదా. బాగా గుర్తు తెచ్చుకోండి" తన జేబులోని ఫొటో ఆమె చేతికిచ్చి అన్నాడు.

"లేదు. చూడలేదు. మదన్‌ను చూసిన ఒకే ఒక వ్యక్తి నాజర్"

"నాజర్ ఎవరు?" ఆశ్చర్యంగా అడిగాడు శశాంక్.

"మా కాలేజీ వాచ్‌మన్. మదన్ వస్తే ఆ విషయం స్వప్నకు తనే రహస్యంగా వచ్చి చెప్పేవాడు. నాకు మదన్‌ని చూడాలని కుతూహలంగా ఉన్నా 'ఏదో ఒకరోజు తనే చూపిస్తుందిలే' అనుకొని ఊరుకొన్నాను. కాని తను ఇలా అర్ధాంతరంగా మమ్మల్ని వదలిపోతుందని నేను అనుకోలేదు"

చివరి మాటలు అంటున్నప్పుడు ఆమె గొంతు బొంగురుపోయింది దుఃఖంతో.

"నాజర్ యిప్పుడు డ్యూటీలో ఉన్నాడా?" ఆత్రంగా అడిగాడు శశాంక్.

"లేదు"

"నైట్ డ్యూటీనా?"

"కాదు"

"మరి? రిజైన్ చేసి వెళ్ళిపోయాడా?"

"కాదు. చ...ని...పో...యా...డు"

★ ★ ★

మాధవి ఎదురుగా కూర్చుని ఉన్నాడు శశాంక్. తను చెన్నైలో స్వప్న తల్లిని కలసిన దగ్గర్నుంచీ నాజర్ విషయం తెలియడం వరకు మొత్తం మాధవికి చెప్పాడు.

"ఫోటో తెచ్చారా?" అని అడిగింది.

తన బ్యాగ్ నుంచి ఫోటో తీసి ఆమెకిచ్చాడు.

ఫొటోను పరిశీలనగా చూసి "ఇందులో అతని ఫీచర్స్ కనబడటంలేదు. ఒక మగవాడి ఫోటో అని మాత్రమే తెలుస్తోంది. మీసాలు ఉన్నందువల్ల అంతే" అంది నిరాశగా.

"బహుశ తనను ఎవరూ గుర్తించకూడదనే అతను చేయి అలా అడ్డంగా పెట్టాడేమో"

"ఉండవచ్చు. తప్పు చేసేవాళ్ళు చాలా జాగ్రత్తలు తీసుకొంటారు" అంది మాధవి.

"నిన్న రాత్రి ఆ ఫోటోను చాలాసేపు చూస్తూ ఉండిపోయాను. నాకు ఆ నవ్వు చూస్తూంటే ఎక్కడో చూసినట్లే అనిపిస్తూంది. ఎక్కడ చూశానో గుర్తురావడం లేదు. చెన్నైలోని మా కంపెనీ మేనేజర్లు, మెడికల్ రెప్స్ ఒక్కొక్కరినీ కళ్ళముందు ఊహించుకొంటూ గుర్తు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. కాని గుర్తురావడంలేదు. అతన్ని నేను చూశానన్నది మాత్రం నిజం"

ఇద్దరూ కొంతసేపు ఆలోచించుకొంటూ ఉండిపోయారు. తర్వాత

"శశాంక్. వాచ్‌మన్ మరణం గురించి మీకు తెలియగానే ఆవిడను ఇంకో విషయం అడిగి ఉండాల్సింది" అంది మాధవి.

"ఏ విషయం?"

"అతడు ఎలక్ట్రిక్ షాక్‌తో పోయాడన్నారు కదా. అతని మరణం స్వప్న మరణానికి ముందు సంభవించిందా లేక తర్వాత సంభవించిందా తెలుసుకొని ఉండాల్సింది. ఈ రెండు మరణాలకు సంబంధం ఉందేమోనని నాకు అనుమానంగా ఉంది"

సుఖాలకు పొంగిపోని, దుఃఖాలకు క్రుంగిపోని స్థిరబుద్ధికలవాడు పరిపూర్ణ వ్యక్తి. – భగవద్గీత

"నిజమే. ఆ పాయింటు నాకు తట్టలేదు" అన్నాడు శశాంక్. మళ్ళీ వెంటనే "అయినా చేసిన పొరబాట్లు దిద్దుకోవడానికి టెక్నాలజీ ఉందిగా" అంటూ తన సెల్‌లో సేవ్‌చేసి పెట్టిన నళిని సెల్ నెంబరుకు డయల్ చేశాడు.

నళిని లైన్లోకి రాగానే ఆమెతో మాట్లాడి సెల్ ఆఫ్ చేశాడు శశాంక్. అతని మొహం అదోలా అయిపోవడం చూచి "ఏమంది? " అని అడిగింది మాధవి.

"వాచ్‌మన్ స్వప్న చనిపోయిన రెండవ రోజే పోయాడు"

ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. శశాంక్ మొహం కొత్తగా కనిపించింది ఆమెకు. అతను భయపడుతున్నాడో, బాధ పడుతున్నాడో తెలియదు గాని 'తను అనవ సరంగా ఇందులో ఇరుక్కుంటున్నానేమో' అన్న ఫీలింగ్ అతని మొహంలో కనబడింది ఆమెకు.

"శశాంక్. మీరు పైకి "హేపీ గో లక్కీ మేన్"లా సరదాగా కనబడతారు గాని చాలా సెన్సిటివ్ మీరు" అంది.

"అవును. ఇలాంటి సంఘటనలు చూసినా, విన్నా చాలా అప్‌సెట్ అయిపో తాను నేను. మీరు డాక్టరు కదా. మీరే ఏదైనా ట్రీట్‌మెంట్ ఇవ్వండి" అన్నాడు నవ్వుతూ.

అతను నవ్వడంతో మాధవి మనసు కూడా తేలికైంది.

"దీనికి ట్రీట్‌మెంట్ ఏం లేదు. ఓ గయ్యాళి అమ్మాయిని పెళ్ళి చేసుకోండి. ఆమె రోజూ మిమ్మల్ని సాధిస్తుంది. ఆమెతో వేగివేగి మీరు బాగా రాటుతేలిపో తారు"

"అయితే అటువంటి అమ్మాయిని కూడా మీరే చూసి పెట్టండి"

"వేరే అమ్మాయి ఎందుకు? మీ సాహితి ఉందిగా" చటుక్కున అతని మొహం చిన్న బోయింది. 'తను తప్పుగా మాట్లాడానా' అని భయపడింది మాధవి.

"సారీ శశాంక్. తమాషాకన్నాను" అంది నొచ్చుకుంటూ.

"ఫర్వాలేదు. మీరన్నదాంట్లో తప్పులేదు. ఎటొచ్చీ ఆ అమ్మాయికి పెళ్ళి నిశ్చయమయి పోయింది"

"నిజంగా" అంటూ ఆశ్చర్యపోయింది. సాహితిపై శశాంక్‌కు అంతో ఇంతో ఆసక్తి ఉందని ఆమెకు తెలుసు.

"అవును. అబ్బాయిది బెంగుళూరు. మంచి ఉద్యోగంలో ఉన్నాడు"

"ఎలా ఉన్నాడు అతను? "

"చాలా అందంగా ఉన్నాడు. మంచివా డిలా కూడా ఉన్నాడు. ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడతాడు" న...వ్వు...తూ..."

అతని మొహంలో ఆందోళన చూసి "ఏమైంది శశాంక్" అంది మాధవి.

"ఆ నవ్వు ... ఆ నవ్వు... ఆ ఫొటోలోని నవ్వు సాహితి కాబోయే భర్తది"

★ ★ ★

"శశాంక్" అంటూ తన గదిలోకి వచ్చిన ప్రమీలమ్మను చూచి ఆశ్చర్యపోయాడు శశాంక్. అతను ఆ గదిలో చేరాక ఇంతవ రకూ ఆమె ఎప్పుడూ మేడ ఎక్కి రాలేదు. అతనితో మాట్లాడాలంటే కిందనుంచే పిలి చేది.

"రండి. కూర్చోండి. నా గది ధన్యమైంది ఈ రోజు" అన్నాడు లేచి నిలబడి.

ఆమె కూర్చోలేదు. గదిని పరిశీలనగా చూడసాగింది. శశాంక్ ఆమె ఏమంటుందో అని ఎదురుచూడసాగాడు.

ఆమె అతని వైపు తిరిగి "ఎంత బాగా పెట్టుకొన్నావయ్యా గదిని. బ్రహ్మచారి గదిలా లేదు" అంది కుర్చీలో కూర్చుంటూ. ఆమె అలా కాంప్లిమెంట్ ఇవ్వడం శశాంక్‌కు ఆనందాన్నిచ్చింది.

"కాఫీ తాగుతారా" అని అడిగాడు.

"నువ్వు చేశావా? "

"ఉదయం హోటలుకెళ్ళి కాఫీ తాగుతాను కదా. ఆదివారం మాత్రం ఫ్లాస్కు తీసుకెళ్ళి మరో రెండు కప్పులు తెచ్చుకొంటాను. మళ్ళీ తాగడానికి"

"ఎందుకలా చేస్తావు? నన్నడిగితే నేను చేసి ఇవ్వనా? " చిరుకోపంతో అంది.

"భలేవారే. మీవాళ్ళ పనులతోనే మీరు సతమతమవుతూ ఉంటే మళ్ళీ నా పని కూడా చెప్పమంటారా? "

వాళ్ళతోపాటు నువ్వూనూ. నువ్వు మా వాడివి కావా? "

ఆ మాట అతనికెంతో నచ్చింది. ఇన్నాళ్ళూ సాహితిని చేసుకోలేకపోయినందుకు బాధపడ్డాడు. ఇప్పుడు 'ఆ కుటుంబంలోని మనిషిని కాలేకపోయానే' అన్న బాధ మొదటిసారిగా కలిగింది అతనికి.

కాఫీ రెండు కప్పులలో పోసి ఆమెకొకటిచ్చి, తనొకటి తీసుకొన్నాడు.

"ఈ ఇంట్లో కాఫీ అందరికీ నేను చేసి ఇవ్వడమే కాని నాకు ఇచ్చేవాళ్ళే లేరు. ఈ రోజు నువ్వు ఇచ్చావు. నాకు చాలా సంతోషంగా ఉంది" అంది ప్రమీలమ్మ. ఆమె మొహంలో సంతోషం స్పష్టంగా కనిపించింది అతనికి. కాఫీ తాగాక

"కాఫీ చాలా బాగుంది. నీ మనసులాగే" అంది.

శశాంక్ సిగ్గుపడుతున్నట్లు నవ్వాడు. అతన్నలా చూస్తుంటే ఎంతో ముచ్చటేసింది ఆమెకు.

"అన్నట్టు శశాంక్. మళ్ళీ వచ్చిన పని మరచిపోతానేమో. ఈ రోజు భోజనానికి నీవు మా ఇంటికి రావాలి"

"ఏమిటి విశేషం. మీ రెండో అమ్మాయికి పెళ్ళిచూపులా? " తమాషాగా అన్నాడు.

"నువ్వూరుకోవయ్యా. నువ్వు ఏదంటే అది నిజమౌతుంది. ఇంకా పెద్దమ్మాయి పెళ్ళే ఎలా చెయ్యాలా అని తల బద్దలు కొట్టుకుంటూంటే అప్పుడే ఇంకో పిల్ల పెళ్ళా? " అంది నవ్వుతూ.

"మరి విశేషం ఏమిటో చెప్పండి"

"అల్లుడుగారు ఊర్లోకి వచ్చారు. అనురాగ్ హోటల్‌లో దిగారట. మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వస్తున్నారు. మేం ముగ్గురం ఆడవాళ్ళమే. మా ఆయన ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడరు. నీవు ఉంటే అతనికి కాస్త కంపెనీ ఉంటుంది"

శశాంక్ ఎంతో ఎగ్జయిట్ అయ్యాడు ఆమె మాటలు విని. "సో... మోహన్ వస్తున్నాడు. అతన్ని నిశితంగా పరిశీలించడానికి తనకు ఇదొక మంచి అవకాశం. అతని మాటల్లో పెట్టి ఎక్కడైనా దొరుకుతాడేమో ప్రయత్నించాలి. ఈ అవకాశాన్ని సద్వినియోగపరచుకోవాలి" అనుకొన్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? ఏ సాకు చెప్పి తప్పించుకుందామా అని ఆలోచిస్తున్నావా? "

"ఛఛ. అదేం లేదు. పిలిచి భోజనం పెడితే ఎవరైనా వద్దంటారా? అందులో మీ చేతి వంట. ఈరోజు పొద్దున లేచి ఎవరి ముఖం చూశానా అని ఆలోచిస్తున్నాను"

"మాటలు మాత్రం బాగా మాట్లాడతావు" అంటూ నవ్వి "నేను వస్తాను. నీ పని కాగానే కిందకు వచ్చెయ్యి" అంది.

"అమ్మా. బజారు నుంచి తీసుకురావలసినవి ఏమైనా ఉన్నాయా? " అని అడిగాడు. ఆమె వెనక్కి తిరిగి, అతని వైపు అభిమానంగా చూస్తూ "అన్నీ ఉన్నాయి" అని మళ్ళీ

"శశాంక్. బజారులో దొరకనిది ఒకటి కావాలి. తెచ్చిస్తావా? " అని అడిగింది.

"ఏమిటమ్మా"

"మనశ్శాంతి" అంది. ఆమె కంట్లో కన్నీటిని చూసి చలించిపోయాడు శశాంక్.

"ఏం జరిగిందమ్మా? " అన్నాడు ఆదుర్దాగా. వాళ్ళకు మోహన్ విషయం తెలిసిపోయిందేమోనన్న అనుమానం వచ్చింది అతనికి.

"ఆయనకు మొన్న అంత సీరియస్ అయింది కదా. మళ్ళీ తాగడం మొదలుపెట్టారు. ఈ రోజు ఆదివారం కాబట్టి నిన్న రాత్రంతా తాగుతూనే ఉన్నారు. ఉదయం నుంచే నడవలేకపోతున్నారు. ఇల్లంతా ఆల్కహోల్ వాసన. అల్లుడు ఉదయాన్నే ఫోన్‌చేసి తను ఊర్లోకి వచ్చినట్లు ఫోన్ చేశారు. నన్నేం చేయమంటావు చెప్పు? అల్లుడు చూస్తే ఏమనుకొంటాడు? తాగుబోతుల సంబంధం వద్దని అంటే ఎంత అవమానం? నిశ్చితార్థం అయ్యాక పెళ్ళి నిలిచిపోతే దాన్నెవరు చేసుకొంటారు? " అంటూ మంచంపై కూర్చుని ఏడవసాగింది.

"అమ్మా! ప్లీజ్. ఏడవకండి. అన్నీ నేను చూసుకుంటానుగా. ముకుందరావు గారి మంచాన్ని ముందు గదిలో వేసి ఆయన్ను అక్కడ పడుకోమందాం. మోహన్‌తో ఆయనకు జ్వరంగా ఉందని చెబుదాం. అతన్ని ఆ గదిలోకి పోనివ్వకుండా మనం మేనేజ్ చేద్దాం" అన్నాడు శశాంక్.

"ఎన్నాళ్ళిలా? "

"ఈ రోజు గడవనివ్వండి. వీలు చూసుకొని మనం ఆయన్ని చెన్నై తీసుకెళ్ళి "ఏంటీ ఆల్కహోల్" ట్రీట్‌మెంట్ ఇప్పిద్దాం. అదే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం"

"ఆ పని చేయి శశాంక్. నీ సహాయం జీవితాంతం గుర్తుంచుకొంటాను" అంది రెండు చేతులూ జోడించి.

"అలా అనకమ్మా... మీరు ధైర్యంగా ఉండండి. ఇంత చిన్న విషయానికే అంత బేలగా అయిపోతే ఎలా? "

"ఇది చిన్న విషయం కాదయ్యా. నా ప్రాణాలు తోడేస్తున్న విషయం. నా సమస్యల్లో నిన్నూ బాధపెట్టడం ఎందుకుగాని నేను వెళ్తాను. వీలైనంత త్వరగా వచ్చేయి" అంటూ కిందకు వెళ్ళిపోయింది.

శశాంక్ కుర్చీలో కూర్చుని చాలాసేపు ముకుందరావు గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"అతనంటే కోపం, అసహ్యం రోజురోజుకీ పెరిగిపోతోంది తనలో. ఈ సమస్యను వీలైనంత త్వరగా పరిష్కరించాలి. ప్రమీలమ్మగారికి మనశ్శాంతి ఇవ్వాలి" అనుకొన్నాడు.

తర్వాత టేబుల్ డ్రా తెరచి మదన్, స్వప్నల ఫొటో తీశాడు. చాలాసేపు మదన్‌ను చూస్తూండిపోయాడు. అతని రూపం తన మనసులో బాగా పడిపోయిందన్న నమ్మకం కుదిరాక ఫొటోను మళ్ళీ డ్రాలో పెట్టాడు.

టీవీ ఆన్‌చేసి "పాడాలని ఉంది" ప్రోగ్రాం చూడసాగాడు.

★ ★ ★

మధ్యాహ్నం పన్నెండున్నరకి ప్రమీలమ్మ ఇంట్లో అడుగుపెట్టాడు శశాంక్. సాహితి వాకిట్లోనే నిలబడి చూస్తోంది. చక్కగా తలస్నానం చేసి వదులుగా అల్లుకొన్న జడ, తలనిండుగా మల్లెపూలు, మల్లెలతో పోటీపడుతున్నట్లున్న పాల నురగలాంటి తెల్లని సిల్కుచీర, అంచు కలర్‌తో మ్యాచ్ అయ్యే బ్లౌజు, మెడలో ముత్యాల దండ, చెవులకు ముత్యాల టాప్స్‌తో చాలా అందంగా కనిపించింది. "ఈ అందం తనది కాదు' అన్న ఆలోచన రావడంతో మనస్సు ఒక్క క్షణం చివుక్కుమంది. 'ఈ అలంకరణ మోహన్ కోసం' అన్న ఊహ రాగానే మోహన్‌పై మానవ సహజమైన అసూయ కలిగింది అతనికి. అయితే వెంటనే తేరుకొని, 'తనేమిటి ఇలా ఆలోచిస్తున్నాడు. సాహితి గురించి ఎటువంటి ఆలోచనలూ చేయకూడదని ఈమధ్యేగా నిర్ణయించుకొన్నాడు" అని తనను తానే మందలించుకొంటూ, సాహితిని చూసి "హలో" అన్నాడు నవ్వుతూ.

సాహితి కూడా నవ్వి 'రండి లోపలికి' అంది. శశాంక్ లోపలికి వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. కీర్తన చదువుకొంటోంది. గంట క్రితమే శశాంక్ ముకుందరావు మంచాన్ని గదిలోకి మార్చాడు. అతనికి

హాల్లో ఇంకా ఆల్కహాల్ వాసన ఉన్నట్లే అనిపించింది. లేచి తన గదిలోకి వెళ్ళి రూం స్ప్రే తెచ్చాడు. హాలంతా స్ప్రే చేసి ముకుందరావు పడుకొన్న గదిలోకెళ్ళి అక్కడా స్ప్రే చేశాడు. ప్రమీలమ్మను అడిగి మల్లెపూలు తీసుకొని హాల్లోని దేవుళ్ళ పటాలకు మాలలుగా వేశాడు.

హాల్లో ఓ మూల అగరువత్తుల్ని వెలిగించి పెట్టాడు. అయిదు నిమిషాల్లో హాలంతా చక్కని పరిమళంతో నిండిపోయింది.

బయట ఆటో ఆగిన శబ్దమైంది. శశాంక్ గుండె వేగంగా కొట్టుకోసాగింది. 'మొదటిసారి మోహన్‌ను నిశ్చితార్థం రోజు చూశాడు. ఆ రోజు సాహితిని తన నుంచి లాక్కొంటున్నట్టు ఫీలయ్యాడు తను. అంతకంటే ఇంకేం ఫీలింగ్స్ లేవు. ఈ రోజు మనసులో అలజడిగా, కొద్దిగా భయంగా కూడా ఉంది. కారణం అతనో క్రిమినల్ అని తెలియడంవల్ల కావొచ్చు. అయితే అతను క్రిమినల్ అయిఉండకూడదనే తన కోరిక. సాహితి జీవితం నాశనం కాకూడదు. ప్రమీలమ్మ ఆనందంగా ఉండాలి' అనుకొన్నాడు.

"హలో శశాంక్‌గారూ ఎలా ఉన్నారు?" నవ్వుతూ వచ్చి కరచాలనం చేశాడు మోహన్.

"ఫైన్. మీరెలా ఉన్నారు?"

"ఇదిగో ఇలా ఉన్నాను" అంటూ రెండు చేతులూ తన శరీరం వైపు చూపిస్తూ అన్నాడు, "ఎంత లావయ్యానో చూడండి" అన్నట్లు. నిజానికి మోహన్ పొడుగు ఉండబట్టి కనిపించదు కాని అతను కొద్దిగా లావే.

ఇద్దరూ కూర్చుని మాట్లాడుకోసాగారు. సాహితి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది ఇద్దరికీ. మాటల మధ్యలో శశాంక్ "మీ పేరు ఒట్టి మోహనా లేక మదన్‌మోహన్, మురళీమోహన్, ఇలా ముందు ఇంకో పేరు కూడా ఉందా" అనడిగాడు.

"నా పేరు ఒట్టి మోహన్ కాదు. పి.మోహన్. పరమానందం మా నాన్నగారి పేరు. ముందు మదనుడు, కాముడు లాంటి పేర్లు లేవు" అన్నాడు నవ్వుతూ.

"అదే నవ్వు. ఆ ఫోటోలోని నవ్వు" ఒళ్లు జలదరించింది శశాంక్‌కు. తర్వాత "ఎలా ఉంది మీ సేల్స్?" అని అడిగాడు.

"బాగున్నాయి. మీకు చెప్పలేదు కదూ. నాకు చెన్నైకి ట్రాన్స్‌ఫర్ వచ్చింది. సిటీలో సగభాగం నా టెర్రిటరీ కింద వస్తుంది".

శశాంక్‌కు అతను చెప్పింది నమ్మబుద్ధేయడం లేదు. నిజంగా మోహన్ అటువంటి బాధ్యతాయుతమైన ఉద్యోగంలో ఉండి ఉంటే స్వప్నను మోసం చేయడం, ఆమె డబ్బులు దోచేయడం చేసి ఉండడు. అతను తన ఉద్యోగ విషయంలో అబద్ధం చెబుతుండాలి.

శశాంక్ పర్సు నుంచి తన విజిటింగ్ కార్డు తీసి మోహన్ కిస్తూ "యు హావ్ యువర్ కార్డ్?" అన్నాడు. మోహన్ తన పర్సులోంచి కార్డు తీసి శశాంక్‌కు ఇచ్చాడు.

'పి.మోహన్, సేల్స్ మేనేజర్' అని ముద్రించబడి ఉంది ఈ కార్డులో. క్రింద కంపెనీ పేరు, అడ్రసు ఉంది. 'ఆ విధంగా తనే ప్రింట్ చేయించుకొని ఉంటాడు. అసలు అటువంటి కంపెనీ ఉందో లేదో కనుక్కోవాలి' అనుకున్నాడు శశాంక్.

ప్రమీలమ్మ వచ్చి భోజనానికి పిలవడంతో ఇద్దరూ లేచారు.

★ ★ ★

భోజనాలయ్యాక తన గదికి వెళ్తుంటే ప్రమీలమ్మ పిలిచి 'రాత్రి కూడా భోజనానికి ఇక్కడికే వచ్చేయ్' అంది. అలాగేనని చెప్పి పైకి వచ్చాడు. మధ్యాహ్నం రెండున్నరకు

ఒక పనిని తప్పుగా ఎందుకు చేస్తామో వివరించడానికి పట్టే సమయం కంటే ఆ పనిని సరిగ్గా చేయడానికి తక్కువ సమయం పడుతుంది. – లాంగ్‌ఫెలో



పడుకొని నిద్రపోయాడు. సాయంత్రం అయిదు గంటలకు కీర్తన వచ్చి నిద్రలేపింది. లేచి కూర్చుని "ఏమిటమ్మా?" అని అడిగాడు.

"అందరం సినిమాకెళ్తున్నాం. మిమ్మల్నీ రమ్మంటున్నారు బావగారు"

ఇబ్బందిగా చూశాడు ఆమె వైపు. ప్రేమించిన అమ్మాయిని మరొకడు పెళ్లి చేసుకోవడం ఓ పనిష్మెంట్ అయితే వాళ్ళ సాన్నిహిత్యం చూస్తూ ఉండటం మరో పనిష్మెంట్ అనుకొన్నాడు. ఏం చెప్పి తప్పించుకోవాలా అని ఆలోచించాడు. ఏమీ తోచలేదతనికి.

"అలాగే. ఓ పావుగంటలో వస్తాను" అన్నాడు. కీర్తన వెళ్లిపోయింది. అన్నట్లే పావుగంటలో రెడీ అయి కిందకు వచ్చాడు. ముకుందరావు వరండాలో కూర్చుని పేపరు చదువుకొంటున్నాడు. అతను లేచి ఉండటం చూసి శశాంక్ తృప్తిగా నిట్టూర్చాడు. ఆయన శశాంక్‌ను చూచి పలకరింపుగా నవ్వాడు.

సాహితి, మోహన్, కీర్తన ఆటోలో, శశాంక్ తన మోటర్‌బైక్ పైన థియేటర్ చేరారు. శశాంక్ ముందుగా అక్కడికి చేరడంతో తనే టిక్కెట్లు కొన్నాడు. అతని చేతిలో టికెట్లు చూచి "అరె మీరెందుకు కొన్నారు? పిలిచింది మేము కదా" అన్నాడు మోహన్.

"మీరు మా ఊరికి గెస్ట్ కాబట్టి మేమే కొనాలి" అన్నాడు శశాంక్ నవ్వుతూ.

నలుగురూ హాలు బయటే కాసేపు మాట్లాడుకొంటూ గడిపారు. ఇంతలో శశాంక్ దృష్టి రోడ్డుపై నున్న గోడపై "మరో చరిత్ర" సినిమా వాల్‌పోస్టర్‌పై పడింది. వెంటనే అతనికి ఒక ఆలోచన వచ్చింది.

"అరె. మరో చరిత్ర సినిమా ఆడుతూందే. ముందే తెలిసుంటే దానికి వెళ్లే

వాళ్లం" అన్నాడు.

"అయినా అది పాత సినిమా కదా. కీర్తనకు నచ్చకపోవచ్చు. పైగా అది బ్లాక్ అండ్ వైట్ సినిమా" అన్నాడు మోహన్.

"మీరు చూశారా ఆ సినిమా? " శశాంక్ మోహన్ని అడిగాడు.

"సి.డి. చూశాను. నాకు చాలా నచ్చింది."

"అప్పట్లో బాగా హిట్టైన సినిమా అట. మా నాన్నగారు అయిదుసార్లు థియేటర్లో చూశారట. నేను థియేటర్లోనే చూశాను. మదన్, స్వప్నల ప్రేమ సన్నివేశాలు, చివర్లో స్వప్న మరణించే సన్నివేశం చాలాబాగా తీశారు బాలచందర్."

మోహన్ శశాంక్ వైపు తీక్షణంగా చూశాడు. ఆ చూపుకు ఒక్క క్షణం భయపడ్డాడు శశాంక్. అంతలోనే తేరుకొని "ఏమిటలా చూస్తున్నారు? " అని అడిగాడు.

"ఉదయం నుంచీ మీరు ఎందుకు మదన్ నామ జపం చేస్తున్నారో నాకర్థంకావడం లేదు. ఆ సినిమాలో హీరో పేరు బాలు. చివర్లో స్వప్న మాత్రమే కాదు, బాలు కూడా చనిపోతాడు" అన్నాడు చిరాకుగా.

"అవును కదూ. నిన్న రాత్రి హైదరాబాదు నుంచి నా ఫ్రెండ్ మదన్ ఫోన్ చేసి చాలాసేపే మాట్లాడాడు. అతని గర్ల్‌ఫ్రెండ్ పేరు స్వప్న. అందుకే వాళ్లిద్దరి పేర్లు నా నోట్లో నానుతున్నాయి. ఈ రోజు సారీ" అన్నాడు అనర్గళంగా ఓ అబద్ధాన్ని సృష్టించి.

"ఇట్సాల్ రైట్. కనీసం మీ స్వప్న మదన్‌ల ప్రేమ సుఖాంతం కావాలని కోరుకుందాం. ఏమంటారు? "

"అవునవును. పదండి. సినిమా మొదలు పెట్టే సమయం అయింది" అంటూ కదిలాడు శశాంక్. మిగిలిన ముగ్గురూ అతన్ని అనుసరించారు.

★ ★ ★

సినిమా నుంచి ఇంటికి వస్తూ 'దారిలోనే ఏదైనా హోటల్‌లో టిఫిన్ తిని వచ్చేయ్యాలని' అనుకొన్నాడు. మళ్లీ 'ప్రమీలమ్మ బాధపడుతుందని' ఆ ఆలోచన మానుకొన్నాడు.

'తన కజిన్స్‌కు పెళ్లిళ్లు అయి బావలు ఇంటికి వస్తే తను ఎంతో క్లోజ్‌గా వాళ్లతో మూవ్ అవుతాడు. వాళ్లందరూ కూడా తన కంపెనీని ఎంజాయ్ చేస్తారు. ఎక్కడికెళ్లినా తనను పిలుచుకొని వెళతారు. అలాంటిది ప్రస్తుతం మోహన్‌తో తను క్లోజ్‌గా ఉండలేకపోతున్నాడు. అతని గురించి తనకున్న అనుమానాలు తీరితేగాని అతనితో ఫ్రీగా కలవలేడు. మోహన్ తనని తీక్షణంగా చూసిన చూపు మర్చిపోలేకపోతున్నాడు. "నిజంగా మదన్ పేరు పదే పదే ఉచ్చరించినందుకు విసుగుతో చూశాడా లేక అతని గుట్టు తనకు తెలిసిపోయినందుకు కోపంతో అలా చూశాడా? " అనుకొన్నాడు.

మోటర్‌సైకిల్ ఇంటి కాంపౌండు లోపల పార్క్ చేసి ఇంట్లోకి వెళ్లాడు. భోజనాలు పూర్తయ్యేవరకు అందరితో మాట్లాడుతూ గడిపాడు.

పదకొండు గంటలకు గదిలోకొచ్చి తలుపేసుకొని పడుకొన్నాడు. మనసులో ఎందుకో భయం భయంగా అనిపించసాగింది. 'అంత భయమున్నప్పుడు ఈ ఇన్వెస్టిగేషన్స్ అన్నీ మానుకొని తన పనేదో తాను చూసుకోవాలి' అనుకొన్నాడు. మళ్లీ 'అలా ఉండకూడదు. తన వాళ్లందరూ హాయిగా ఉండాలి. అందుకోసం తన చేతనయింది చేయాలి. ఎన్ని అడ్డంకులు, ఆపదలు ఎదురైనా సరే' అనుకొన్నాడు.

వెంటనే అతనికి నిద్ర పట్టింది.

ఎవరో తలుపు తడుతూంటే మెలకువ వచ్చింది శశాంక్‌కు. లేచి టైము చూశాడు. పన్నెండు గంటలయింది.

'ఈ టైములో ఎవరొచ్చారబ్బా' అనుకొంటూ తలుపు తెరచి ఎదురుగా ఉన్న

ఒక వ్యక్తి యొక్క పొడిగింపబడిన నీడే ఒక సంస్థ. విమర్శకు చోటివ్వని మచ్చలేని జీవితాన్ని జీవించు. – రోస్‌పాల్

వ్యక్తిని చూచి నిశ్చేష్టుడైపోయాడు.

ఆ వ్యక్తి మో...హ...న్.

★ ★ ★

"లోపలికి రావచ్చా? "

షాకు తిన్నట్టు నిలబడిపోయిన శశాంక్ తేరుకొని 'రండి లోపలికి' అంటూ కుర్చీ చూపించాడు. అతను కూర్చున్నాక తను మంచం మీద కూర్చున్నాడు.

శశాంక్‌కు ఒళ్లంతా చెమటలు పట్టసాగింది. అతనికి నాజర్ గుర్తొచ్చాడు. అతని భయం మరింత పెరిగింది. 'అతని మీద తనకు అనుమానం వచ్చినట్లు కనుక్కొన్నాడా! అందుకే తనకు వార్నింగ్ ఇవ్వడానికి వచ్చాడా లేక చంపెయ్యాలనే వచ్చాడా? ' అనుకొన్నాడు. తనకు దగ్గరలో ఏదైనా ఆయుధం ఉందేమోనని చూశాడు. మంచం ప్రక్కనే క్రికెట్ బ్యాట్ కనిపించింది. అది చూశాక అతనికి కొంత ధైర్యమొచ్చింది.

మోహన్ జేబులోంచి సిగరెట్టు పెట్టె తీసి శశాంక్‌తో 'సిగరెట్? ' అన్నాడు.

'నో థాంక్స్, నాకు అలవాటు లేదు'

అగ్గిపుల్ల గీసి సిగరెట్ వెలిగించుకొన్నాడు. అగ్గిపుల్ల వెలుగులో అతని మొహం శశాంక్‌కు భీతిని కలిగించింది.

"మీతో ఓ విషయం మాట్లాడాలి శశాంక్" అన్నాడు మోహన్.

"మాట్లాడండి"

"మీరెందుకో భయపడుతున్నట్లున్నారు. భయం కలిగించే కలలేమైనా వచ్చాయా? "

"లేదు"

"నేను మీ నిద్ర పాడుచేశానా? "

"లేదు. చెప్పండి"

"ముకుందరావు గారికి తాగుడు అలవాటు ఉన్నట్లు గమనించాను నేను. ఆయన రోజూ తాగుతారా? "

ఒక్క క్షణం ఆలోచించాడు శశాంక్. నిజం చెప్పకపోవడమే ప్రస్తుతానికి మంచిదని అతనికి అనిపించింది.

"రోజూ తాగరు. అప్పుడప్పుడూ అకేషనల్‌గా తాగుతారు."

"మా ఇంట్లో అలాంటి అలవాట్లు ఎవరికీ లేవు. పెద్దలకు తెలియకుండా సిగరెట్లు తాగడం వరకే మా అలవాట్లు పరిమితం. ఇంటికి కాబోయే అల్లుడు వస్తున్నాడన్న భయం కూడా లేకుండా తాగి ఉన్నారు యీ రోజు. మా పెద్దలకు ఈ విషయం తెలిసిందంటే ఈ సంబంధమే వద్దంటారు"

"మనిషికి తాగుడు అలవాటు కాకూడదు. ఒకసారి అయ్యిందంటే ఇక దాన్నుంచి బయటపడటం కష్టం" అన్నాడు శశాంక్.

"అట్లని మనం చూస్తూ చూస్తూ ఆయన్ను అలా వదిలెయ్యలేం కదా. మా అత్తగారి కోసమన్నా ఏదైనా చెయ్యాలి. చెన్నైలో నాకు తెలిసిన డాక్టర్లు కొంతమంది ఉన్నారు. వాళ్ళనడిగి ఈ తాగుడుకు ట్రీట్‌మెంట్ ఎక్కడ ఇస్తారో తెలుసుకొని ఆయన్ను అక్కడ చేర్పిద్దాం"

"నేనూ ఆ విషయం గురించే ఉదయం ప్రమీలమ్మ గారితో మాట్లాడాను. కాని ఆయన ట్రీట్‌మెంట్‌కు ఒప్పుకోవాలి కదా. ఆయన కో-ఆపరేట్ చేస్తేనే ట్రీట్‌మెంట్ సాధ్యమౌతుంది. మీరు కాబోయే అల్లుడు కాబట్టి మీ మాట ఆయన వినే అవకాశం ఉంది. మీరొకసారి ఆయనతో మాట్లాడి చూడండి"

"ఈ విషయంలో నాకంటే మీరే బెటర్. మీకు ఆయనతో అంతో ఇంతో చనువుంది. ఆయనకు ఒకసారి సీరియస్ అయితే మీరే హాస్పిటల్‌లో చేర్పించి ఎంతో సహాయం చేశారని సాహితి చెప్పింది. మీరే ఆయనతో నెమ్మదిగా మాట్లాడండి. నేను వస్తాను. సారీ. మీ టైం తీసుకొన్నాను" అంటూ లేచాడు మోహన్.

"మరేం ఫర్వాలేదు. ముకుందరావు గురించి మీరింత శ్రద్ధ తీసుకోవడం నాకెంతో సంతోషంగా ఉంది' అన్నాడు శశాంక్.

"అది మన బాధ్యత. గుడ్‌నైట్"

మోహన్ మెట్లు దిగి గేటు తెరచుకొని బయటకు వెళ్ళేంతవరకూ చూస్తూ నిల్చున్నాడు. ఆ తర్వాత తలుపు మూసి మంచంపై కూర్చున్నాడు.

అతనికి చాలా ఆశ్చర్యంగా ఉంది. మోహన్ తన్నేమీ చేయకపోవడం ఒకరకంగా ఆశ్చర్యపరిస్తే అతను తన కాబోయే మామగారి గురించి అంత బాధపడటం మరింత ఆశ్చర్యపరిచింది. 'మదన్, మోహన్ ఒక్కరు కారేమో అన్న అనుమానం వచ్చింది అతనికి. మళ్ళీ 'తనలో ఏర్పడిన ఆ అనుమానాన్ని పోగొట్టడానికే అలా మామగారి మీద శ్రద్ధ ఉన్నట్లు నటించాడేమో' అని కూడా అనిపించింది.



'ఏదేమైనా ఒకసారి నాజర్ కుటుంబాన్ని కలిస్తే తప్ప తన అనుమానాలు నివృత్తి కావు' అనుకొంటూ కిటికీ లోంచి చూశాడు. మోహన్ ఆటో ఎక్కుతున్నాడు. ముకుందరావు టాటా చెప్పి గేటుకు తాళం వేస్తున్నాడు. మోహన్ చేతిలో లగేజ్ లేదు కాబట్టి అతను హోటల్‌కు వెళ్తున్నాడని అర్థమైంది. 'అంటే రేపు కూడా మోహన్ ఊర్లోనే ఉండొచ్చు' అనుకొన్నాడు శశాంక్.

★ ★ ★

మరుసటి రోజు డ్యూటీకి బయలుదేరుతుంటే కీర్తన వచ్చి "అంకుల్. అమ్మ పిలుస్తోంది" అంది. మోహన్ గొంతు వినిపిస్తోంది బయటికి.

లోపలికి వెళ్ళి "గుడ్‌మార్నింగ్ టు ఎవిరిబడీ" అన్నాడు.

"గుడ్‌మార్నింగ్ శశాంక్ గారూ. నేను ఊరికి బయలుదేరుతున్నాను. థాంక్యూ ఫర్ యువర్ వండ్రఫుల్ కంపెనీ" అన్నాడు మోహన్.

"చెన్నై కేనా? "

"కాదు. బెంగుళూరుకు"

"అన్నట్టు నిశ్చితార్థం ఫోటోలు వచ్చాయా? నిన్నట్నుంచీ అడగాలనుకొని మర్చిపోతున్నాను" అన్నాడు శశాంక్.

"లేదండీ. ఇక్కడినుంచి బెంగుళూరుకు వెళ్ళగానే స్టూడియోలో ఇచ్చాను. వెంటనే చెన్నైలో రిపోర్ట్ చేయమని కంపెనీ నుంచి ఆర్డర్స్ వచ్చాయి. నిన్న చెన్నై నుంచి ఇటు వచ్చాను. ఇప్పుడెళ్తున్నాను మళ్ళీ బెంగుళూరుకి"

"మీరు చెన్నై ఎప్పుడు వస్తారు మళ్ళీ? "

"రేపే బయలుదేరాలి. ఊపిరి పీల్చుకోలేనన్ని పనులున్నాయి నాకు"

"నేను రేపు రాత్రి చెన్నై వెళ్తున్నాను. ఎల్లుండి ఉదయం మిమ్మల్ని కలుస్తాను. ఆ ఫోటోలు నా చేతికిస్తే నేను వీళ్ళకు అందజేస్తాను"

మోహన్ ఒక్క క్షణం ఆలోచించి "దట్ సౌండ్స్ ఫైన్. నేను హోటల్ అశోకాలో దిగుతాను. పారిస్‌లో ఉంది ఆ హోటల్" అన్నాడు.

"తెలుసు. నేను ఎల్లుండి ఉదయం వచ్చి కలెక్ట్ చేసుకొంటాను"

"సరే. నేను వస్తాను. వస్తానండీ" అంటూ ప్రమీలమ్మ, ముకుందరావుల దగ్గర శలవు తీసుకొని "కీర్తనా. సీయూ" అన్నాడు. తర్వాత సాహితి వైపు కళ్ళతోనే వెళ్ళొస్తానన్నట్టు చూశాడు. సాహితి తలూపింది.

"బస్టాండుకు రానా? " అన్నాడు శశాంక్

"ఎందుకండీ? మీరు డ్యూటీకి వెళ్ళాలి కదా. నన్ను ఆటో ఎక్కించండి. చాలు" అన్నాడు. అటుగా వెళ్తున్న ఆటోను ఆపాడు శశాంక్. మోహన్ ఆటో ఎక్కి వెళ్ళిపోయాడు. సాహితి, కీర్తన ఇంట్లోకి వెళ్ళారు. శశాంక్ లోపలికి వచ్చి తన బ్యాగ్ తీసుకొన్నాడు. ప్రమీలమ్మ బయటకు వెళ్ళబోతున్న శశాంక్‌తో "చాలా థాంక్స్ నాయనా. అన్నీ చక్కగా జరిగిపోయేలా చూసుకొన్నావు. ఎంతో సమయస్ఫూర్తితో వ్యవహరించావు. నూరేళ్ళు చల్లగా ఉండాలి నువ్వు" అంది.

"చేసిందంతా మీరు. మీ ఇంట్లో తినడం, సినిమాకెళ్ళడం తప్ప ఇంకేం చేశాను నేను"

"అలా అనడం నీ గొప్పతనం. అల్లుడు కూడా నీలాగే చాలా మంచివాడు శశాంక్. నేను మొదట భయపడ్డాను గాని మనిషి కలివిడిగా ఉన్నాడు"

"మీ అన్నయ్య గారు అన్నీ చూసే కదా యీ సంబంధం గురించి మీకు చెప్పి ఉంటారు. ఇంక మీకు భయమెందుకు? " అన్నాడు శశాంక్.

"వాడు చాలా అమాయకుడు శశాంక్. ఎవరు ఏది చెబితే అది నమ్ముతాడు. అందుకే యీ సంబంధం విషయంలో నాకు భయంగానే ఉండింది. అదృష్టవశాత్తూ మంచి అల్లుడే దొరికాడు" అంటూ లోపలికి వెళ్ళింది కీర్తన పిలవడంతో.

తలమీద బాంబు పెట్టి పేల్చినట్టు ఫీలయ్యాడు శశాంక్. 'అంటే మోహన్ గురించి మాధవరావుకు ఏమీ తెలియదు. ఎవరో మంచి పిల్లవాడని చెబితే నమ్మేసి యీ సంబంధం కుదిర్చి ఉంటాడు' అనుకొన్నాడు. అతనికి మాధవరావుపై ఎక్కడలేని కోపం వచ్చింది. 'ఏం కొంపలు మునిగాయని అంత తొందరగా సాహితికి పెళ్ళి నిశ్చయం చెయ్యాలి? ఆమెకు వయసూ ఏం మించిపోలేదు. కనీసం అన్ని విషయాలూ తెలుసుకొని నిర్ణయం తీసుకోవాలి. తనపై ఎంతో నమ్మకంతో ఉంచిన బాధ్యతను సరిగా నిర్వర్తించాలి. లేదంటే చేతకాదని ఊరుకోవాలి' అనుకొన్నాడు.

'తను ఏ పాయింట్ గురించి ధైర్యంగా ఉన్నాడో ఆ పాయింట్ కూడా బలహీనపడిపోయింది. మోహన్ విషయంలో ఒక్కో నిజం తెలిసేకొద్దీ తనలో అలజడి, అసహనం పెరుగుతూంది. భగవాన్. నేను అనుకొన్నవేవీ నిజం కాకూడదు. మోహన్ మంచివాడే అయి ఉండాలి. సాహితి నాకు దక్కకున్నా ఫరవాలేదు. ఆమెమాత్రం ఆనందంగా ఉండాలి' అనుకొన్నాడు శశాంక్.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం మాధవిని కలిశాడు శశాంక్. మందుల శాంపుల్స్ టేబుల్ మీద పెట్టి అలసటగా కూర్చున్నాడు.

మాధవి కాఫీ తెప్పించింది. కాఫీ తాగుతూ శశాంక్‌నే చూడసాగింది. అతను ఎప్పటిలా ఉల్లాసంగా లేడనిపించింది ఆమెకు. అతనితో పరిచయమయ్యాక అతను అలా డల్‌గా కనిపించడం అదే మొదటిసారి.

"శశాంక్. ఆర్ యు నాట్ వెల్? " అని అడిగింది ఆదుర్దాగా.

"అఫ్‌కోర్స్ ఐ ఆమ్ వెల్. మెంటల్‌గా కాస్త అప్‌సెట్. అంతే" అన్నాడు.

"ఏం జరిగింది? "

మోహన్ నెల్లూరు రావడం, రాత్రి తన గదికి రావడం, తను మరో విధంగా అనుకొని భయపడటం, అతను ముకుందరావు తాగుడు గురించి మాట్లాడటం చెప్పాడు శశాంక్.

"నాకేం చేయాలో తోచడం లేదు. చూస్తూ చూస్తూ సాహితిని ఆ హంతకుడికి అప్పజెప్పలేను. వీళ్ళకు విషయం చెప్పి హెచ్చరిద్దామంటే ఆ విషయం ఇంకా పూర్తిగా కన్‌ఫర్మ్ కాలేదు"

"కన్‌ఫర్మ్ కానంతవరకూ సాహితితో

అతని గురించి ఏమీ చెప్పకండి. ఒకసారి అనుమానం అంటూ ఏర్పడితే జీవితాంతం ఉంటుందది. కాని నా భయం ఇంకోటు న్నది" అంటూ ఆగింది.

ఏమిటన్నట్టు చూశాడు శశాంక్.

"ఎటూ నిశ్చితార్థం అయింది కదా అని సాహితి అతనితో అడ్వాన్స్ అవుతుందేమో నని" అంది మాధవి. అన్నాక శశాంక్‌కు కోపం వస్తుందేమోనని భయపడింది. అయితే ఆమె ఊహించినట్లు శశాంక్‌కు కోపం రాలేదు.

"మీకు చెప్పలేదు కాని నాకూ ఆ భయం ఉంది. సాహితి అటువంటి అమ్మాయి కాదు గాని మోహన్ అటువంటి వాడే కదా" అన్నాడు.

"అలా జరగదనే అనుకొందాం' అంది మాధవి.

"రేపు నేను సూళ్ళూరుపేటకు వెళ్తున్నాను. రాత్రి అట్నుంచి అటే చెన్నై వెళ్తాను. ఎల్లుండి నాజర్ కుటుంబ సభ్యుల్ని కలిసి మరికొన్ని వివరాలు తెలుసుకోవాలనుకొంటు న్నాను" అన్నాడు శశాంక్.

"మంచిది. అన్నట్టు శశాంక్! చెన్నైలో మా కజిన్ ఒకడున్నాడు. అతని పేరు ఉదయ్. మంచివాడు. ఎన్నో వ్యాపారాలు చేస్తూంటాడు. మంచి మాటకారి. చెన్నై మొత్తం అతనికి తెలుసు. మీరు అతని సహాయం తీసుకోండి. నేను ఉత్తరం రాసి స్తాను" అంటూ తన లెటర్ పాడ్ తీసుకొని ఉత్తరం రాయసాగింది.

"మొన్న చెన్నై వెళ్ళినప్పుడు అతన్ని కలి శారా? "

"లేదు. స్వప్న మరణవార్త విన్నాక నాకు అక్కడ ఒక్క క్షణం కూడా ఉండాలని అని పించలేదు".

ఉత్తరం పూర్తిచేసి అతనికిచ్చి "అతని ఫోన్ నెంబరు, అడ్రసు కూడా ఉత్తరంలో రాశాను. మీరు అతనితో ఫ్రీగా ఉండొచ్చు. మొహమాటపడకుండా అతని సహాయం తీసుకోండి" అంది మాధవి.

"థాంక్యూ" అన్నాడు ఉత్తరాన్ని జేబులో పెట్టుకొంటూ.

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలకు చెన్నైలోని హోటల్ అశోకా ముందు ఆటో దిగాడు శశాంక్. రిసెప్షనిస్టు దగ్గరికి వెళ్ళి మోహన్ రూం నెంబరు అడిగాడు.

"సెకండ్ ఫ్లోర్. రూం నెంబర్ టూ నాట్ టూ. లిఫ్ట్ కుడివైపు కార్నర్‌లో ఉంది" అంది ఆ అందమైన అమ్మాయి.

"ఆయన తరచుగా మీ హోటల్‌లో దిగు తుంటారా? " అని ఆమెని అడిగాడు శశాంక్.

"నాకు తెలిసి ఆయన మా హోటల్లో దిగడం ఇదే మొదటిసారి"

"థ్యాంక్యూ" అంటూ లిఫ్ట్ వైపు నడి చాడు. సెకండ్ ఫ్లోర్‌లో గది బయట నిల బడి బెల్ నొక్కాడు. మోహన్ తలుపు తెరచి "రండి" అంటూ వెనక్కు జరిగి కుర్చీ చూపించి "కూర్చోండి" అన్నాడు. శశాంక్ కూర్చున్నాక తను మంచంపై కూర్చున్నాడు.

"ఎప్పుడొచ్చారు? " శశాంక్ అడిగాడు.

"నిన్న సాయంత్రం వచ్చాను. ఏమిటి విశేషాలు? కాఫీ తీసుకుంటారా, కూల్ డ్రింక్ తీసుకొంటారా? "

"కాఫీ విల్ బి ఫైన్"

మోహన్ బెల్లు కొట్టి బేరర్‌ని పిలిచి కాఫీ చెప్పాడు.

"ఫొటోలు తెచ్చారా? " శశాంక్ అడి గాడు.

"లేదు శశాంక్ గారూ! రీలు పాడైపో యిందిట. నాకు ఫొటోలు తీయడం తెలు

పిల్లలు లేని ఇల్లు పూలు లేని పూదోట లాంటిది. – బెన్‌జాన్సన్

సుగాని ఫిల్మ్ లోడ్ చేయడం తెలియదు. నెల్లూరులో తప్పనిసరై నేనే లోడ్ చేశాను. ఎక్కడో పొరబాటు చేశాను. మొత్తం ఫిల్మ్ వేస్టయింది. ముఖ్యంగా జీవితాంతం దాచుకోవలసిన ఫొటోలు లేకుండా పోవడం నన్నెంతో బాధిస్తోంది"

మోహన్ మాటలు విని ఒళ్లు మండింది శశాంక్‌కు. 'అతని గురించి తనకు తెలియక పోయి ఉంటే అతను చెప్పినదంతా నిజమని నమ్మేవాడు తను. కాని తనకు తెలుసు కాబట్టి అతను అబద్ధం చెబుతున్నాడని తెలిసిపోతూ ఉంది. కావాలనే ఎటువంటి సాక్ష్యాలూ లేకుండా జాగ్రత్త పడ్డాడు ముందు జాగ్రత్తగా. అతను ఇలా చేస్తాడని తెలిసుంటే తన కెమెరాతో కూడా కొన్ని స్నాప్స్ తీసేవాడు. ఎటూ తన కెమెరాలో ఫిల్మ్ లోడ్ చేయబడి ఉంది. అందులో కొన్ని మాత్రమే తను వాడాడు. మోహన్ "ఫోటోలు తీయగలరా" అంటే మరో ఆలోచన లేకుండా ఒప్పుకొన్నాడు. ఇతని మనసులో ఇన్ని దురాలోచనలు ఉన్నాయని అనుకోలేదు. ఇకమీదట ఇతనితో ఉన్నప్పుడు ప్రతి మాటా ఆలోచించి మాట్లాడాలి. ప్రతి చర్యా ఆలోచించి మరీ చెయ్యాలి అనుకొన్నాడు.

కాఫీ వచ్చింది. "తీసుకోండి" అంటూ తనే కప్పు అందించాడు శశాంక్‌కు.

"థాంక్యూ" అంటూ కాఫీ సిప్ చేశాడు శశాంక్.

"శశాంక్‌గారూ నాదో చిన్న అనుమానం. తీరుస్తారా? " అని అడిగాడు మోహన్.

"అడగండి"

"సాహితిలాంటి అందమైన అమ్మాయి మీకు అతి సమీపంలో ఉన్నప్పుడు మీరెందుకు ఆమెని పెళ్ళి చేసుకోవాలని అనుకోలేదు? "

శశాంక్ ఈ ప్రశ్న అతని నుంచి ఊహించలేదు. అందుకే వెంటనే జవాబు చెప్పలేక పోయాడు.

"ముకుందరావు ఓ తాగుబోతు. ప్రమీలమ్మ అమాయకురాలు. సాహితి అందగత్తె. కీర్తన చిన్నపిల్ల. ఇన్ని అడ్వాంటేజస్ ఉండి కూడా మీరెందుకు ఆమెని ప్రేమించలేదు? " శశాంక్‌ని సూటిగా చూస్తూ అడిగాడు.

"ఈ ప్రశ్న మీరు నెల్లూరులోనే నన్నెందుకు అడగలేదు? " అంతే సీరియస్‌గా శశాంక్ ప్రశ్నించాడు.

"అవకాశం రాలేదు"

"అర్ధరాత్రి మేడపైకి వచ్చి మాట్లాడారుగా. అప్పుడు అవకాశం రాలేదా? "

"అప్పుడా ఆలోచన రాలేదు. ఇప్పుడొచ్చింది. ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఎదురు ప్రశ్న వేస్తారేం"

"సరే చెబుతాను. సాహితి చెన్నైలో ఎం.ఎస్‌సి. చదువుతున్నప్పుడు నేను వాళ్ళింట్లో అద్దెకు చేరాను. ఆమె చదువు పూర్తి కాగానే నెల్లూరు వచ్చింది. అయితే మా మొదటి పరిచయం ప్లెజంట్‌గా జరగలేదు. అప్పట్నుంచీ ఆమె నాతో మాట్లాడలేదు. వాళ్ళ నాన్నగారికి సీరియస్ అయిన రోజే నాతో మామూలుగా మాట్లాడింది. అంతలోనే మీ సంబంధం కుదిరింది. అందువల్ల మా మధ్య ప్రేమకు అవకాశం రాలేదు. ఆ ఆలోచన కూడా రాలేదు"

"మీరు కథలు రాస్తుంటారా శశాంక్? "

శశాంక్ మొహం ఎర్రగా అయిపోయింది కోపంతో.

"నాకు కథలు రాయడం అలవాటు లేదు. మీలా కథలు చెప్పడం కూడా అలవాటు లేదు" అన్నాడు.

"నేను మీకు కథలు చెప్పానా? "

"మీరే ఆలోచించుకోండి నేను మీ గదిలోకి వచ్చాక నాకు ఏం కథ చెప్పారో" అంటూ బయటికి నడిచాడు శశాంక్. అతను వెళ్ళిపోయిన నిమిషం తర్వాత అతనన్నదేమిటో అర్థమైంది మోహన్‌కు.

★ ★ ★

అడయార్‌లోని ఉదయ్ ఇల్లు సులభం



**ప్రేమలేఖలు రాస్తారా?**

'మీకు ఫలానా మాస్టర్ తారా సింగ్ ఉత్తరం రాశారట?' లోక్‌సభలో ఓ సభ్యుడు పండిట్ నెహ్రూని ప్రశ్నించాడు.

'అవును' అన్నారు జవహర్‌లాల్.

'పంజాబ్ విషయాలే రాశారా?' మళ్లీ రెట్టించాడతను.

'పంజాబ్ విషయాలు కాకుంటే ఆయన నాకేమైనా ప్రేమలేఖలు రాస్తాడని మీ ఉద్దేశమా?' తిప్పికొట్టారు నెహ్రూ.

గానే కనుక్కొన్నాడు శశాంక్. గేటు తీసుకొని లోపలికి అడుగుపెట్టాడు.

కొత్తగా కట్టిన ఇల్లు అది. చిన్న ఇల్లే అయినా చుట్టూ తోట బాగా పెంచడంతో ఎంతో అందంగా కనబడుతుంది. బయట లాన్‌లో కుర్చీపై కూర్చుని ఓ వ్యక్తి పేపరు చదువుకొంటున్నాడు. యాభైకి దగ్గరగా ఉండొచ్చు అతని వయసు. 'ఆయన బహుశ ఉదయ్ తండ్రి అయి ఉండవచ్చు' అనుకుంటూ ఆయనను సమీపించాడు.

"ఎవరు కావాలి?" అని తమిళంలో అడిగాడాయన.

"ఉదయ్ కావాలి"

"మీకు తెలుగువారా? ఉదయ్ హేర్ కటింగ్‌కు వెళ్ళాడు. రండి కూర్చోండి" అంటూ ఎదురుగా ఉన్న కుర్చీని చూపాడాయన.

శశాంక్ కూర్చున్నాక "సావిత్రీ" అని పిలిచాడు. లోపలినుండి నలభై, నలభై అయిదు మధ్య వయసుగల ఓ స్త్రీ బయటకు వచ్చి ఆయన వైపు, శశాంక్ వైపు చూసింది.

"మన ఉదయ్ కోసం వచ్చారు. కాఫీ తీసుకురా" అన్నాడు.

"అబ్బే వద్దండీ. నేను కాఫీ తాగి వచ్చాను" అన్నాడు శశాంక్ మొహమాటంగా.

"ఫరవాలేదులే నాకు సెకండ్ డోస్ కావాలి. మీ సాకుతో నేనూ" అంటూ నవ్వాడు. ఆవిడ లోపలికి వెళ్ళిపోయింది.

"మిమ్మల్ని నేను ఎప్పుడు ఉదయ్‌తో చూడలేదు. మీరు వాడి క్లాస్‌మేటా?" అని అడిగాడు ఆయన.

"కాదండీ. నన్ను నెల్లూరులోని మాధవి గారు పంపారు"

"యు మీన్ డాక్టర్ మాధవి?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడాయన.

"అవును"

"మరి ఆమాట ముందరే చెప్పరేమండీ. ఎలా ఉంది మాధవి?"

మాధవి పేరు వినగానే ఆయన అంత ఎక్సైట్ అవడం శశాంక్‌ను ఆశ్చర్యపరచింది.

"మాధవి గారు బాగున్నారు. మిమ్మల్ని అడిగినట్లు చెప్పమన్నారు" అన్నాడు శశాంక్.

"మాధవి వరుసకు నాకు కూతురవుతుంది. మనసుకు మాత్రం స్వంత కూతురే. ఎంత మంచి బిడ్డ! అంత చదువుకున్నా గర్వం లేదు తనకి"

మాధవిని ఆయన పొగడుతూంటే ఆమె స్నేహితుడిగా ఎంతో సంతోషించాడు శశాంక్. 'నిజంగా మాధవి ఆ పొగడ్తలకు అర్హురాలే. లేకుంటే తను డాక్టరై ఉండి ఓ మెడికల్ రెప్ అయిన తనతో అంత



స్నేహంగా ఉండటం గొప్ప విషయం' అనుకొన్నాడు.

ఇంతలో ఆయన భార్య కాఫీ తెచ్చి ఇద్దరికీ యిచ్చింది.

"ఈయన మన మాధవి స్నేహితుడట. నెల్లూరు నుంచి వచ్చారు" అన్నాడు ఆయన భార్యతో. మాధవి పేరు వినగానే ఆవిడ ముఖం కూడా వికసించింది.

"మాధవి బాగుందా? పెళ్ళి సంబంధాలేమైనా కుదిరాయా? " అని అడిగింది.

"బాగున్నారండీ. పెళ్ళి సంబంధాల గురించి నాకు తెలియదు గాని కుదిరుంటే నాకు చెప్పేవారే" ఆవిడ వెళ్ళిపోయింది. శశాంక్ కాఫీ కప్పు కిందపెడుతూ "ఇంకా చాలాసేపు పడుతుందా ఉదయ్‌గారు రావడానికి" అన్నాడు ఉదయ్ తండ్రితో.

"వాడు వెళ్ళి చాలాసేపయింది. వచ్చేయాలి ఇక. అదిగో మాటల్లోనే వచ్చేశాడు" అన్నాడు గేటు వైపు చూస్తూ. శశాంక్ తల తిప్పి గేటు వైపు చూశాడు. సన్నగా, పొడుగ్గా ఉన్నాడతను. చామనఛాయ రంగులో సాధారణంగా ఉన్నాడు. అతని కళ్ళు మాత్రం చాలా చిన్నవిగా, చురుకుగా ఉన్నాయి.

"ఉదయ్. ఈయన నీకోసం వచ్చారు. మన మాధవి పంపిందంట"

"ఏ మాధవి? " నుదురు చిట్లిస్తూ అడిగాడు.

"నెల్లూరు మాధవిరా. డాక్టరమ్మ"

"ఓ మాధవి అక్కా? కూర్చోండి" అంటూ తనూ కూర్చున్నాడు.

"నా పేరు శశాంక్" అంటూ చేయి అందించాడు శశాంక్. ఉదయ్ తండ్రి లేచి నిలబడి "మీరు మాట్లాడుకుంటూ ఉండండి" అని ఇంట్లోకి వెళ్ళాడు.

శశాంక్ తన జేబునుంచి మాధవి ఇచ్చిన ఉత్తరాన్ని ఉదయ్‌కిచ్చాడు.

ఉత్తరం చదివి "చెప్పండి. నేనేం సహాయం చేయాలి?" అన్నాడు ఉదయ్.

శశాంక్ అతనికి స్వప్నతో పరిచయం దగ్గర్నుంచి స్వప్న ఆత్మహత్య, నాజర్ మరణం, సాహితి పెళ్ళి మోహన్‌తో నిశ్చయం కావడం, స్వప్న ఇంట్లో దొరికిన ఫోటోలోని వ్యక్తిని తాను మోహన్‌గా గుర్తించడం వరకు చెప్పాడు.

"నేను నాజర్ ఇంటికి ఒకసారి వెళ్ళి అతని కుటుంబ సభ్యులతో మాట్లాడాలని అనుకొంటున్నాను. స్వప్న ఆత్మహత్యకూ, నాజర్ మరణానికీ సంబంధం ఉంటుందని నా అనుమానం"

"ఉంటుందనే అనుకుందాం. అది తెలుసుకున్నందువల్ల మీకు కలిగే లాభం ఏమిటి?"

"దానివల్ల మదన్, మోహన్ ఒకరేనా కాదా అని తెలుస్తుంది"

"మీరు చాలా ప్రమాదకరమైన ఆలోచనలలో ఉన్నారు. నాజర్‌ను చంపింది మదన్ అయితే మీరు తన గురించి ఎంక్వయిరీ చేస్తున్నారని తెలిస్తే మిమ్మల్ని చంపడానికి కూడా వెనుకాడడు. మీరు సినిమాలు చూసి, నవలలు చదివీ ఆవేశంతో ఉన్నట్టున్నారు. నిజజీవితంలో మీరు అనుకొన్నట్లు జరుగవు"

"నేను ఆవేశంతో ఉన్నమాట నిజం. కాని నా ఆవేశం వెనుక ఆలోచన కూడా ఉంది. ఎంతవరకు సాధ్యమో అంతవరకూ నా ప్రయత్నం చేయాలని వచ్చాను"

"అయితే నాజర్‌ను చంపింది మదన్ అని తెలిస్తే అతన్ని పోలీసులకు పట్టిస్తారా?"

"మదన్ ఎవరో, ఎక్కడుంటాడో నాకు తెలియదు. కాని మోహనే మదన్ అన్న అనుమానం వచ్చింది. ఆ విషయం నిర్ధారణ అయితే ముందు సాహితి పెళ్ళి ఆపుచేయాలి. సాహితి జీవితం నాశనం కాకూడదన్నది నా మొదటి ఆశయం. చట్టానికి అతన్ని పట్టిచ్చే అవకాశం వస్తే అందుకు వెనుకాడను. ఎందుకంటే నేను ఆ పని చేస్తే మరెన్నో జీవితాలు కాపాడిన వాడినవుతాను"

"మోహన్ ఫోటో మీ దగ్గరుందా?"

"మదన్ ఫోటో ఉంది" అంటూ జేబులోంచి స్వప్న యింట్లో దొరికిన ఫోటో ఇచ్చాడు.

"మొహం పూర్తిగా కనబడటం లేదు. మీ స్నేహితురాలి నిశ్చితార్థం ఫోటోలు లేవా?"

"లేవు. రీలు పాడైపోయిందని మోహన్ చెప్పాడు"

"ఈ ఫోటో ఎక్కడ దొరికింది మీకు?"

"స్వప్న ఇంట్లో ఆమె బ్యాంకు పాసు పుస్తకంలో దొరికింది"

"మరి ఈ ఫోటోలోని వ్యక్తి ఎవరని ఆ ఇంట్లో వాళ్ళను అడగలేదా?"

"లేదు. స్వప్న తల్లికి తన కూతురి ప్రవర్తన గురించి ఎటువంటి అనుమానాలూ లేవు. ఈ ఫోటో చూపించి ఆమెలో అలజడి సృష్టించడం నాకు ఇష్టం లేదు"

"నిజమే" ఒప్పుకొన్నాడు ఉదయ్.

కొంతసేపు ఆలోచించి శశాంక్‌తో "శశాంక్ గారూ. మా మాధవికి అప్పుడిగా మీకో సలహా చెబుతాను. వింటారా?" అన్నాడు.

"వినడానికేం. చెప్పండి" అన్నాడు శశాంక్.

"మగ పిల్లలు అమ్మాయిల్ని వలలో వేసుకోవడం, తర్వాత మోసం చేయడం, కొంత మంది అమ్మాయిలు ఆ షాక్‌ను తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకోవడం మనం పేపర్లో చూస్తూనే ఉన్నాం. కొన్నిసార్లు రేప్ చేయడం, ఇంకొన్నిసార్లు రేప్ చేసి చంపేయడం లాంటివి కూడా మనం విన్నాం. కాని ప్రేమ విషయంగా మూడోవ్యక్తి హత్య

చదువు మనిషికి నిండుతనాన్ని ఇస్తుంది. రచన అతడిని అసలైన మనిషిగా తీర్చిదిద్దుతుంది.– ఫ్రాన్సిస్ బేకన్

కావింపబడటం నేను ఎప్పుడూ వినలేదు. సిటీలో యిటువంటి దురాగతాలు చేసే గ్యాంగ్ ఒకటి తయారైందని నేను విన్నాను. మీలాంటి సున్నిత మనస్కులు, గౌరవంగా ఉద్యోగం చేసుకొంటున్న వాళ్ళు ఇందులో తలదూర్చకండి. దీన్ని డీల్ చేయడానికి పోలీస్ డిపార్ట్‌మెంట్ ఉంది"

శశాంక్ మౌనంగా కూర్చుండిపోయాడు ఆలోచిస్తూ.

కొంతసేపటి తర్వాత ఉదయ్ "మిమ్మల్ని భయపెట్టడం నా ఉద్దేశ్యం కాదు. ఈ సిటీలో ఇన్నేళ్ళుగా ఉంటున్న నాకు ఇక్కడ మోసాలు, ఘోరాలూ అన్నీ తెలుసు. కాని మనం చేయగలిగింది చాలా తక్కువ. నేనూ మొదట్లో మీలాగే ఆవేశపడి కొన్నిట్లో తలదూర్చాను. తల బొప్పికట్టింది. అతిక ష్టంతో వాటినుంచి బయటపడ్డాను. అప్ప ట్నించీ నా పనేదో నేను చూసుకుంటు న్నాను." అన్నాడు నవ్వుతూ.

"మీకు నామీదున్న అభిమానానికి ఎంతో కృతజ్ఞుణ్ణి. కాని ఒక విషయం కన్‌ఫర్మ్ చేసుకొని నేను నెల్లూరు వెళ్ళిపోతాను. మీరు కోరినట్లే ఇంకే విషయంలోనూ తల దూర్చను" అన్నాడు శశాంక్.

"ఏ విషయం?"

"మోహన్, మదన్ ఒక్కరు కారన్న విషయం లేదా యిద్దరూ ఒక్కరేనన్న విషయం"

"సరే. మీ స్నేహితురాలి శ్రేయస్సు కోసం మీరు పడే తపన నాకు అర్థమైంది. మనం ముందుగా ఎక్కడికి వెళ్ళాలి?"

"స్వప్న పనిచేసిన కాలేజీకి వెళ్ళి అక్కడ పనిచేస్తున్న వాళ్ళను అడిగి నాజర్ యిల్లు ఎక్కడుందో కనుక్కోవాలి. తర్వాత ఆ ఇంటికి వెళ్ళి నాజర్ భార్యతో మాట్లాడాలి"

"ఆ కాలేజ్ ఎక్కడుంది?"

"మందవల్లిలో"

"వెరీగుడ్. మందవల్లిలో నాకూ పనుంది. నేను స్నానం చేసి వస్తాను. మీరు వెయిట్ చేస్తారా?"

"చేస్తాను. ఈ రోజు పేపర్ నేను యింకా చూళ్ళేదు. మీరొచ్చే లోపల పేపరు చదు వుతూ ఉంటాను. మీరు రెడీ అయి రండి"

ఉదయ్ ఇంట్లోకి వెళ్ళాడు. శశాంక్ టీపాయ్ మీదున్న 'హిందూ' పేపర్ తీసు కొని చదవసాగాడు. కళ్ళు అక్షరాల మీదే ఉన్నా మనసు మోహన్ గురించే ఆలోచి స్తూంది.

'మోహన్ కావాలనే తనతో గొడవ పెట్టు కొన్నట్టు తనకు అనిపిస్తూంది. తనతో మన స్పర్థలు పెట్టుకొంటే అతనితో తను కల వడు. క్రమంగా తను ప్రమీలమ్మ కుటుం బానికీ దూరం అవుతాడు, వాళ్ళకు తన కంటే అల్లుడే ముఖ్యం కనుక మోహన్ సాహితిని పెళ్ళాడేందుకు ఇక ఏ అడ్డూ ఉండదు. వాళ్ళను ఇబ్బంది పెట్టినా, సతా యించినా అతన్ని అడిగేవారు ఉండరు'

'మోహన్. యు ఆర్ ఇంటలిజెంట్' అను కొన్నాడు శశాంక్.

★ ★ ★

శశాంక్‌ను మందవల్లిలోని స్వప్న పనిచే సిన కాలేజీ దగ్గర డ్రాప్ చేశాడు ఉదయ్.

"మీ పని అయ్యాక బయటే నిలబడి ఉండండి. అయిదు నిమిషాలు ఆలస్యమైనా నేనే వచ్చి మిమ్మల్ని పికప్ చేసుకొంటాను"

"అలాగే"

"ఆల్ ది బెస్ట్" అని విష్ చేసి, ఉదయ్ వెళ్ళిపోయాడు. బయట వాచ్‌మెన్ కనిపించకపోవడంతో గేటు దాటుకొని నేరుగా స్టాఫ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. అక్కడ ఒకావిడ కూర్చుని నోట్స్ రాసుకుంటోంది. ఇదివరకు ఆ కాలేజీకి వచ్చినప్పుడు ఆమెను చూశాడు శశాంక్.

ఆమె తలెత్తి శశాంక్‌ను చూసి నవ్వుతూ "మీరు స్వప్న ఫ్రెండు కదూ. కూర్చోండి" అంది.

కుర్చీలో కూర్చున్నాక "నళిని గారు ఉన్నారా?" అని అడిగాడు.

"ఆవిడ క్లాసులో ఉంది. ఇంకో అయిదుని మిషాల్లో క్లాసు అయిపోతుంది" అంది.

"అట్నుంచి అటే ఇంకో క్లాసుకు వెళ్తే? " అనుమానంగా అడిగాడు.

"ఆ అవకాశం ఉంది. నేను వెళ్ళి చెప్పి వస్తాను" అంటూ లేచి వెళ్ళింది ఆమె.

కొంతసేపటికి బెల్లు కొట్టిన శబ్దం వినిపించింది. రెండు నిమిషాల తర్వాత నళిని ఆ గదిలోకి వచ్చింది.

"హలో శశాంక్ గారూ. బాగున్నారా? " అంది.

శశాంక్ లేచి నిలబడి "పేరు బాగా గుర్తు పెట్టుకొన్నారు. మీరు బాగున్నారా? " అన్నాడు నవ్వుతూ.

'నళిని వయసు పాతికేళ్ళు ఉంటుంది. తెల్లగా, అందంగా, చలాకీగా కనిపిస్తుంది. ఇంకా పెళ్ళి కాలేదని మెడ, పాదాలు చూస్తే తెలుస్తోంది. ఆ కాలేజీని, అక్కడి స్టూడెంట్స్ సంఖ్యను చూస్తే ఆమెకు జీతం పెద్దగా ఉండదనిపిస్తుంది. అయినా ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. అలా నవ్వుతూ చలాకీగా ఉండటం దేవుడిచ్చిన వరం' అనుకొన్నాడు. అతనికి సాహితి గుర్తొచ్చింది. 'సాహితి అందగత్తె. కాని ఎప్పుడూ చిటపటలాడుతూ ఉంటుంది. ఆమెను నవ్వుతూ తను చూసింది చాలా తక్కువసార్లు. మాధవి ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. ఆమె అందానికి ఆ నవ్వు మరింత వన్నె చేకూరుస్తూంటుంది" అనుకొన్నాడు.

"హీరో శశాంక్ గారూ? ఏ లోకంలో ఉన్నారు? "

శశాంక్ ఆమె వైపు ఆశ్చర్యంగా చూశాడు. 'ఈమె చలాకీ అయినదేకాదు. చురుకైనది కూడా' అనుకొన్నాడు.

"సరిగ్గా ఊహించారు. ఆ ఇంటి అడ్రస్ మీకు తెలుసా? "

"తెలుసు. మీకు మైలాపూర్ బాగా పరిచయముందా? "

"ఉంది. మైలాపూర్‌లో మా అక్కయ్య ఉంది. వాళ్ళింట్లోనే నేను దిగాను"

"మైలాపూర్ నుంచి లజ్‌కు వెళ్ళేదారిలో ఉంది" అంటూ ఆ ఇంటికి ఎలా చేరుకోవాలో చెప్పింది.

"థాంక్యూ సోమచ్. మీరు నాజర్ ఇంటికి వెళ్ళేవారా? "

"లేదు. కాని అతను పోయాడని తెలిశాక చూడ్డానికి స్టాఫ్ అందరం ఆటోలలో వెళ్ళాం. వచ్చేటప్పుడు లంచ్ టైం కాబట్టి అట్నుంచి అటే మా ఇంటికి వెళ్ళిపోయాను. మా ఇల్లు మైలాపూర్‌లో ఉంది కనుక, నేను నడచి వెళ్ళాను కనుక ఆ రూటు నాకు బాగా గుర్తుంది" అంది.

"యూ ఆర్ కరెక్ట్. మీరేమీ అనుకోనంటే మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడుగుతాను"

"అడగండి. నాకు యీ పీరియడ్ లీజర్"

"నాజర్ ఎలాంటివాడు? "

"అతని గురించి నాకు ఏమీ తెలియదు. నాతో ఎక్కువ మాట్లాడేవాడు కాడు. స్వప్నతో బాగా మాట్లాడేవాడు. కాలేజీలో నాకు తెలిసి అతనిమీద కంప్లైంట్లేవీ లేవు. అతనికి, మదన్‌కు స్నేహం ఉందని స్వప్న ద్వారా నాకు తెలిసింది. వాళ్ళకు ముందే పరిచయం ఉందో, స్వప్నతో ప్రేమమొదలయ్యాక మదన్‌కు నాజర్‌తో పరిచయం ఏర్పడిందో నాకు తెలియదు"

"నాజర్ స్వప్న యీ కాలేజీలో చేరక ముందు కూడా పనిచేస్తూండేవాడా? "

"లేదు. నాజర్ గత సంవత్సరం ఆఖరులో చేరాడు. స్వప్న పదేళ్ళుగా ఈ కాలేజీలో పనిచేస్తూంది.

'అంటే నాజర్‌కు ఈ కాలేజీలో చేరక ముందు నుంచే మదన్‌తో పరిచయం, స్నేహం ఉండి ఉండాలి. స్వప్నను ట్రాప్ చేయడానికి మదన్ నాజర్‌ను ఒక కేటలిస్ట్‌లా వాడుకొన్నాడు. ఎందుకంటే మదన్‌తో స్వప్నకు పరిచయమైందీ, నాజర్ కాలేజీలో చేరిందీ దాదాపు ఒకే సమయంలోనే" అను

కొన్నాడు.

"నాజర్ వయసు ఎంత ఉండి ఉంటుంది అతను పోయేనాటికి"

"ముప్పై అయిదు-నలభై మధ్యలో ఉంటుంది"

"అతనికి భార్య ఉందా? "

"ఉంది. ఆవిడకు ముప్పై ఏళ్ళుంటాయి. పిల్లలు లేరు"

"స్వప్న మరణం సంభవించిన వెంటనే నాజర్ పోవడం మీ కాలేజీలో ఎవరికీ అనుమానం కలిగించలేదా? "

"మీరు ఫోన్‌చేసి అడిగేదాకా నాక్కూడా రాలేదు. ఇద్దరూ వేర్వేరు కారణాలవల్ల వేర్వేరు ప్రదేశాల్లో చనిపోయారు కదా. స్వప్న గుండె ఆగి చనిపోతే నాజర్ కరెంట్ షాక్ వల్ల పోయాడు"

"నా ప్రశ్న లన్నింటికీ ఎంతో ఓపికగా జవాబిచ్చినందుకు మీకు చాలా థాంక్స్. నేను వెళ్ళొస్తాను. అఫ్‌కోర్స్ ఇక రానను కోండి. బై"

"బై అండ్ ఆల్ ది బెస్ట్" అంటూ చేయి ఊపింది నళిని.

★ ★ ★

కాలేజీ గేటు దాటి బయటకు రాగానే కాస్త దూరంలో బైక్ పార్క్‌చేసి నిలబడి ఉన్న ఉదయ్ కనిపించాడు శశాంక్‌కు. శశాంక్ అతన్ని సమీపించాడు.

"పని అయిందా? " ఉదయ్ అడిగాడు.

"అయింది".

"ఎక్కడుంది నాజర్ ఇల్లు? "

శశాంక్ చెప్పాడు. "ఇప్పుడే వెళ్ళాలా? " అని అడిగాడు ఉదయ్.

"వెళ్దాము. ఆలస్యం అమృతం విషం" అన్నాడు శశాంక్. ఉదయ్ బైక్ ఎక్కి స్టార్ట్ చేశాడు. శశాంక్ అతని వెనుక కూర్చోగానే ముందుకు నడిపించాడు వెహికల్‌ని.

సగం దూరం వెళ్ళాక బైక్ ఆగిపోయింది.

"షిట్. పెట్రోలు అయిపోయినట్లుంది" అన్నాడు ఉదయ్ కోపంగా నేలను గట్టిగా తన్నుతూ.

"దగ్గర్లో పెట్రోలుబంకు ఉందా? " అని అడిగాడు శశాంక్.

"మరీ దగ్గర్లో లేదు. పెట్రోలు పోయించుకోవాలని అనుకుంటూనే మర్చిపోయాను. మీరు ఓ పనిచెయ్యండి. ఆటో తీసుకొని వెళ్ళి ఆవిడతో మాట్లాడుతూ ఉండండి. నేను పదినిమిషాల్లో అక్కడికి వచ్చేస్తాను"

"కాని మీరు ఒంటరిగా ఎలా తీసుకొని వెళ్తారు. నేను కూడా మీతో వస్తే కంపెనీ ఉంటుంది. కొంతసేపు నేను తోసుకురావచ్చు"

"మరేం ఫర్వాలేదు. తోసుకుంటూ వెళ్ళడం నాకలవాటే. మీరు వెళ్ళి పనిచూడండి ముందు"

"సరే. మీ ఇష్టం". అని శశాంక్ ఆటో ఆపి ఎక్కాడు. ఆటో కదిలింది.

నళిని చెప్పిన విధంగా ఎస్.టి.ఒ షాపు ఎదురుగా ఉన్న పెంకుటిల్లు ముందు ఆటో ఆపించి దిగాడు. ఆటో ఛార్జీ చెల్లించి ఆ ఇంటివైపు అడుగులు వేశాడు.

చాలా పాత ఇల్లు అది. గోడలు బాగా మసిబారి ఉన్నాయి. బాగా వంగిపోయి ఉన్న ఇంటి పైకప్పును చూస్తే ఏ క్షణంలో కూలిపోతుందో అన్న భయం కలుగుతుంది.

పాత చెక్క తలుపుపై వేళ్ళతో తడుతూ "హలో" అన్నాడు.

"కౌన్" అంటూ ఓ స్త్రీ గొంతు వినిపించింది ముందు. తర్వాత తలుపుతీసి నిలబడిన ముస్లిం స్త్రీ కనబడింది. "భర్త పోయిన దుఃఖం వల్ల వాడిన తీగవలె ఉంది కాని నిజానికి మంచి అందగత్తే" అనుకొన్నాడు.

"నాజర్ భార్య ఉన్నారా? " అని అడిగాడు తమిళంలో, ఆవిడే నాజర్ భార్య అని నిర్ధారించుకోవడానికి.

"నేనే మీరెవరు? " భయంగా చూస్తూ అడిగింది.

"నేను నాజర్ స్నేహితుడిని. మాది

చిత్తూరు. నాజర్ మరణించాడని తెలిసి ఎంతో షాకయ్యాను. మిమ్మల్ని ఒకసారి చూసి పోదామని వచ్చాను" అన్నాడు.

ఆమె లోపలికి జరిగి "రండి... కూర్చోండి" అంది. శశాంక్ కుర్చీలో కూర్చున్నాడు. ఆమె నేలపైనే కూర్చుని ఉన్నట్టుండి ఏడవసాగింది.

"మీరు ధైర్యంగా ఉండండి. అతనికి ఈ లోకంతో ఋణం తీరిపోయింది. వెళ్ళిపోయాడు" శశాంక్ సముదాయించడానికి ప్రయత్నించాడు.



ఆమె ఏడుపు ఆప లేదు.

"నాజర్ ఈమధ్యే నాకు ఫోన్‌చేసి మాట్లాడాడు. అనవసరంగా గొడవల్లో ఇరుక్కొన్నానని, ఇవి ఎక్కడికి దారి తీస్తుందో అని భయంగా ఉందని అన్నాడు. అతను భయ పడినట్లే అయింది"

ఆమె ఈసారి శశాంక్ వైపు కుతూహలంగా చూసింది.

"ఇంతకూ అతను ఎలా పోయాడు? "

"కరెంటు షాకు తగిలి పోయారు."

"నాతో అందరూ అలాగే చెప్పారు. కాని నేను నమ్మను. ఎందుకంటే అతను నాకు మొత్తం చెప్పాడు. ఎవరు చంపదలచుకొన్నారో కూడా చెప్పాడు. నేను అడిగేది అతన్ని ఎలా చంపారని? "

"నాకు తెలీదు. నాకు... తెలీదు" అంటూ ఏడవసాగింది.

"చూడండి. నేను పోలీస్ డిపార్ట్‌మెంటు నుంచి రాలేదు. నాది ఈ ఊరు కూడా కాదు. నా వల్ల మీకు ఏ హానీ జరుగదు. ఓ స్నేహితుడిగాఅతనెలా పోయాడో తెలుసుకోవాలని ఉంది నాకు. అతను చనిపోవడానికి ముందు ఎవరైనా ఇంటికి వచ్చి గొడవ పడ్డారా?

ఆమె ఏడుపు ఆపి "అవును. ఇద్దరు కుర్రాళ్ళొచ్చారు. ఆ రోజు రాత్రి పదకొండు గంటలకు ఆయన ఇంటికొచ్చారు. మేమిద్దరం భోజనం చేసి పడుకొన్నాము. ఒంటిగంటకు ఎవరో తలుపు తట్టడం వినిపించింది. ఆయన లేచి వెళ్ళి తలుపుతీశారు. నేనూ వెనకే వెళ్ళి చూశాను. ఆయన ఆ కుర్రాళ్ళను తన గదిలోకి పిలుచుకొని వెళ్ళారు. వాళ్ళను కూర్చోబెట్టి నా దగ్గర కొచ్చి "నాకోసం పనుండి వచ్చారు. మేము కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడుకోవాలి. నువ్వెళ్ళి పడుకో" అన్నారు. నేను నిద్రపోయాను. ఉన్నట్టుండి అరుపులు వినిపిస్తే పరుగెత్తుకెళ్ళి చూశాను. మా ఆయన, వాళ్ళలో ఓ కుర్రాడు చొక్కాలు పట్టుకొని అరచుకొంటున్నారు. నేను "క్యా హోగయా" అంటూ వాళ్ళ మధ్యకి వెళ్ళాను. ఆయన అక్కడ్నుంచి నన్ను వెళ్ళి పొమ్మన్నారు. నేను వినలేదు. ఆయన కోపంతో అరిచారు. ఆ కుర్రాడు విడిపించుకొని కుర్చీలో కూర్చుని "మేం గొడవ పడంలేండి. మీరెళ్ళండి" అన్నాడు. నేను మా గదిలోకి వచ్చేసినా నాకు ఆందోళన వల్ల నిద్ర రాలేదు. మెల్లగా లేచి వెళ్ళి వాళ్ళ మాటలు వినడానికి ప్రయత్నించాను. మాటలు వినబడలేదు. గాని వాళ్ళు మామూలుగానే మాట్లాడుకొంటున్నా

ఎవరి అహం నశిస్తుందో వాని ఆత్మ మేల్కొంటుంది. – స్వామీ వివేకానంద

రని అనిపించింది. నేను గదిలోకి వచ్చి పడుకొని నిద్రపోయాను. తెల్లవారు ఝామున ఆయన గదిలోకి వెళ్ళి చూశాను. ఆయన చనిపోయి ఉన్నారు. బెల్టుతో ఆయన్ను ఉరితీసి చంపారు"

ఆ సన్నివేశాన్ని గుర్తుచేసుకొన్నందువల్ల ఆమె మళ్ళీ ఏడవసాగింది.

"మీరు పోలీస్ కంప్లైంట్ ఇవ్వలేదా? "

"లేదు. మళ్ళీ వాళ్ళతో ఇంకోవిధంగా ఇబ్బందులు మొదలవుతాయి. అందువల్ల అందరికీ కరెంట్ షాక్ అనే చెప్పాను".

"మీరు తప్పు చేశారు. పోలీసులకు తెలిసి ఉంటే ఆ దుర్మార్గులకు శిక్ష పడేది. వాళ్ళ దుర్మార్గం అంతమై ఉండేది. మీరు వాళ్ళిద్దరినీ ఇంకోసారి చూస్తే గుర్తుపడతారా? "

ఆమె భయంతో అతనివంక చూసి "వాళ్ళను ఇంకోసారి చూడాలని నేను అనుకోవడంలేదు" అంది.

శశాంక్ తన జేబులోని ఫొటో తీసి ఆమెకిచ్చి "ఇందులోని వ్యక్తి ఆ ఇద్దరు కుర్రాళ్ళలో ఒకడేమో చూడండి" అన్నాడు.

ఆమె ఫొటోను పరీక్షగా చూసి "ఊహు మొహం కనిపించడం లేదు. మొహం స్పష్టంగా కనిపించే ఫొటో చూపిస్తే చెప్పగలను" అంది.

"అతనెలా ఉన్నాడు? "

"పొడుగ్గా ఉన్నాడు. మరీ లావు కాదు. అట్లని సన్నం కూడ కాదు. తెల్లగా అందంగా ఉన్నాడు"

ఆ వర్ణనలన్నీ మోహన్‌కు సరిపోతున్నాయి.

"వాళ్ళ మాటల్లో మదన్ అన్న పేరుగాని, మోహన్ అన్న పేరుగాని మీకు వినిపించాయా? "

"లేదు"

శశాంక్‌లో నిరుత్సాహం ఆవహించింది. 'కొండను తవ్వి ఎలుకను పట్టినట్లు తన ఇన్వెస్టిగేషన్‌లో ఏదీ క్రొత్త విషయం బయటపడలేదు. మోహన్ అతని నిశ్చితార్థం ఫొటోలు ఇచ్చి ఉంటే అతి ముఖ్యమైన క్లూ తనకు దొరికి ఉండేది. నాజర్‌ను చంపింది మోహనా కాదా అన్న విషయం తెలిసిపోయి ఉండేది. ఆ తర్వాత మోహన్ మదన్ ఒక్కరేనా అన్న విషయం మాత్రమే తెలుసుకోవాల్సి ఉండేది. ప్రస్తుతానికి నాజర్ హత్య చేయబడి ఉంటాడన్న తన అనుమానం మాత్రం నిజమయ్యింది. అంతే' అనుకొన్నాడు.

"నేను వెళ్తాస్తాను. మీకు అన్నీ గుర్తుచేసి బాధ కలిగించాను. సారీ" అని హసీనాతో చెప్పి బయటకు నడిచాడు.

"ఒక్క నిమిషం"

వెళ్తున్న శశాంక్ వెనక్కి తిరిగి ఆమె వైపు చూశాడు.

"మీరెవరు? ఎందుకు ఇన్ని వివరాలు అడిగి తెలుసుకొన్నారు? " సూటిగా అతన్నే చూస్తూ అడిగింది.

"చెప్పాగా నాజర్ స్నేహితుడినని"

"నేను నమ్మను. నన్ను పరామర్శించడానికి వచ్చిన వాళ్ళు ఫొటోలు జేబులో పెట్టుకొని రారు. పైగా మా వారి స్నేహితుడన్నారు. ఆయన చిత్తూరులో ఉన్నట్లునాకెప్పుడూ చెప్పలేదు. మీరు కొంతకాలం చెన్నైలో ఉన్నారని అన్నా నేను నమ్మను. మీరు మాట్లాడిన తమిళం ఆ విషయం చెప్పడం లేదు. మీరు అడగ్గానే నేను అమాయకంగా నిజం చెప్పాను. నాకు నిజం చెప్పడం మీ బాధ్యత".

శశాంక్ ఆమె మాటలు విని ఆశ్చర్యపోయాడు. 'ఆమె అమాయకంగా జరిగినదంతా చెబుతున్నప్పుడు తను ఆమెని సరిగ్గా హేండిల్ చేశానని అనుకొన్నాడు. ఆమె తను అనుకొన్నంత అమాయకురాలేం కాదు' అనుకొన్నాడు.

"మీరు చెప్పింది కరెక్ట్. నిజం చెప్పడం నా బాధ్యత" అంటూ తను ఆమె ఇంటికి వచ్చిన కారణం చెప్పాడు.

"నా స్నేహితురాలి జీవితం నాశనం కాకూడదని, మరెందరో అమ్మాయిల జీవి

తాలు నాశనం కాకుండా కాపాడాలని నా ప్రయత్నం"

"మీరు మోహన్ హంతకుడా కాదా అన్న విషయం తెలుసుకోండి. మిగతా విషయాలు మాకొద్దు"

"ఎందుకలా అంటున్నారు? " ఆశ్చర్యంగా అడిగాడు శశాంక్.

"మీరు ఆ హంతకుణ్ణి పోలీసులకు పట్టిస్తే పోలీసులు మా ఇంటికి వస్తారు. నానా ప్రశ్నలూ వేస్తారు. అతన్ని అరెస్ట్ చేసినా బెయిలు మీద బయటికొచ్చి నన్ను చంపేస్తాడు. అయిన నష్టం చాలు. ఇక నన్నొదిలెయ్యండి" చేతులు జోడించి దీనంగా అంది.

"అలాగే. మీ ఆయన్ని చంపింది మోహనా కాదా తెలుసుకొనేందుకు ప్రయత్నం చేస్తాను. తెలిశాక ఇంకే ప్రయత్నమూ చేయను".

"థాంక్యూ" అంది కృతజ్ఞతగా

శశాంక్ బయటకు వచ్చి నిలబడ్డాడు. ఆమె కూడా అతని వెనకే వచ్చి నిలబడింది.

"నా ఫ్రెండు వస్తాడు నన్ను పికప్ చేసుకోవడానికి" అన్నాడు తను ఎందుకు ఇంకా అక్కడే నిలబడి ఉన్నాడో ఆమెకు తెలియడం కోసం. 'అలాగా' అన్నట్లు తలాడించింది. "మీ పేరు? " శశాంక్ అడిగాడు. 'హసీనా' అంది. "మీరు ఉద్యోగం చేస్తున్నారా? " అని అడిగాడు.

"లేదు"

"మరి..." అంటూ ఆగిపోయాడు.

"నా జీవనం ఎలా అంటారా? ఆయన బ్యాంకులో కొంత డబ్బు దాచారు. ఆ వడ్డీతో బ్రతుకు వెళ్లదీస్తున్నాను. ఒంటరి ప్రాణానికి ఎంతకావాలి? " ఆమె మాటల్లో విరక్తి ధ్వనించింది.

"ఓ వాచ్‌మన్ అంత డబ్బు దాచుకోగలిగాడంటే అది న్యాయంగా సంపాదించినది అయి ఉండదు. మదన్‌కు చేసిన సర్వీసెస్‌కు అతనికి లభించిన సొమ్ము అయి ఉంటుంది" అనుకొన్నాడు.

ఇంతలో ఉదయ్ వస్తూ కనిపించాడు.

ఉదయ్ బైక్ ఆపి శశాంక్ వైపు, హసీనా వైపు చూశాడు.

"ఇతను నా ఫ్రెండ్ ఉదయ్" శశాంక్ పరిచయం చేశాడు.

"హలో" అన్నాడు ఉదయ్

"హలో" అంటూ చేతులు జోడించింది హసీనా.

"వస్తానండీ. మీరు మనసులో ఎలాంటి భయాలూ పెట్టుకోకండి. మీకు నావల్ల ఎటువంటి ఇబ్బందీ కలుగదు" అంటూ బైక్‌పై కూర్చున్నాడు.

బైక్‌ను ముందుకు పోనిచ్చాడు ఉదయ్.

"ఏమంటూంది ఆవిడ? " ఉదయ్ అడిగాడు దారిలో

శశాంక్ తమ మధ్య జరిగిన సంభాషణ మొత్తం చెప్పాడు.

"మోహన్ ఫొటో చూపారా? "

"చూపాను. గుర్తించలేకపోయింది. మొహం బాగా కనిపించే ఫొటో చూపిస్తే గుర్తించగలనంది. ఇది నేను చేతులారా చేసుకొన్నది. కాస్త తెలివిగా ప్రవర్తించి ఉంటే నా మనసును తొలిచేస్తున్న అనుమానం నివృత్తి అయి ఉండేది" అన్నాడు బాధగా.

"అంత అప్‌సెట్ కాకండి. మీకింకా టైముంది కదా"

"అవును. ఇంకా రెండు నెలల టైముంది"

"మీ నెక్స్ట్ మూవ్ ఏమిటి? "

"ప్రస్తుతానికేం లేదు. రేపు ఉదయం నెల్లూరు వెళ్లిపోతాను. మళ్ళీ ఎప్పుడైనా మోహన్ నెల్లూరు వచ్చినప్పుడు అతనికి తెలిసో, తెలియకో ఫొటో తీసి, తర్వాత చెన్నైకి వచ్చి ఫొటో హసీనాకు చూపించాలి"

"హసీనా అంటే నాజర్ భార్యా? "

"అవును"

సరే. మిమ్మల్ని ఎక్కడ డ్రాప్ చేయమంటారు? "

"మైలాపూర్‌లోని సాయిబాబా గుడి దగ్గర డ్రాప్ చేయండి. అక్కడ్నుంచి మా అక్కయ్య యిల్లు చాలా దగ్గర"

ఉదయ్ శశాంక్‌ను సాయిబాబా గుడి దగ్గర దింపి వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఉదయ్ గుడి దగ్గర డ్రాప్ చేశాక గుడి లోకి వెళ్లి దేవుని దర్శించుకుని ఇంటికి వచ్చే భోంచేసి పడుకొన్నాడు. సాయంత్రం లజ్ వరకూ నీరజతో. వెళ్లి షాపింగ్ చేశాడు. అయితే హసీనా నాజర్ ఎలా చనిపోయాడో చెప్పడం, నాజర్ చనిపోయిన గది తను చూడడం ఇదే తన మనసంతా ఆక్రమించి ఉండటంతో హుషారుగా ఉండలేక పోయాడు. తను పెరిగిన వాతావరణం అటువంటిది. అమ్మ, నాన్న, చెల్లి, కజిన్స్, బంధువులు, స్నేహితులు, ఆప్యాయతలు, అనుబంధాలు, నవ్వులు, జోక్స్, శుభకార్యాలు, ఆనందం, అందం ఇవే తన లోకం ఇన్నాళ్లూ. మొదటిసారిగా ఓ కొత్త వాతావరణాన్ని, కొత్త ప్రపంచాన్ని చూశాడు.

ఆలోచిస్తూనే ఎప్పుడో నిద్రలోకి జారిపోయాడు.

★ ★ ★

ఉదయం అయిదు గంటలకే నిద్రలేచిన తమ్ముణ్ణి చూసి "ఏరా. రాత్రి నిద్రపట్ట లేదా? " అని అడిగింది నీరజ.

"పట్టింది. ఈ రోజు లీవు పెట్టలేదు. డ్యూటీకి వెళ్లాలి. చాలా పనులున్నాయి. అందువల్ల ఎనిమిది గంటల ట్రైనుకు వెళ్తున్నాను"

"చిత్తూరుకు వెళ్లి ఓ రెండు రోజులు రెస్ట్ తీసుకోరాదూ. మనసుకు కాస్త రిలీఫ్ ఉంటుంది".

"చెప్పాగా చాలా పనులున్నాయని. చిత్తూరుకు ఎటూ దీపావళికి వెళ్తాన్నాను."

ఏడు గంటలకే సెంట్రల్ స్టేషన్ చేరాడు శశాంక్. నెల్లూరుకు టిక్కెట్టు కొని ప్లాట్ ఫారం చేరుకుని ఓ బెంచీపై కూర్చున్నాడు. చాలాసేపు వచ్చీపోయే మనుషుల్ని చూస్తూ గడిపాడు. తర్వాత తన బ్యాగ్ తెరచి అందులోని తన టూర్ డైరీ తీశాడు. డైరీ తోపాటు చేతిలోకి వచ్చింది ఓ కవరు. ఆ కవరు ఎవరిచ్చారో అతనికి గుర్తొచ్చింది. ముకుందరావు చెల్లెలి భర్త సదాశివరావు నాలుగు రోజుల క్రితం ఫోన్‌చేసి తనకు రైల్వేస్ నుంచి ఓ చెక్కు వచ్చిందని, చెక్కును ప్రమీలమ్మ దగ్గర ఇస్తానని, రామకృష్ణకు ఇచ్చి తన అక్కౌంటులో ఆ మొత్తం పడేలా చూడమని, తన ఊరికి వెళ్తున్నానని, తిరిగి రావడానికి పదిరోజులు పడుతుంది కనుక తానే వెళ్లి బ్యాంకులో డిపాజిట్ చేయలేకపోతున్నానని చెప్పారు.

ఊరికి బయలుదేరే ముందు ప్రమీలమ్మ ఇంటికి వెళితే ఆవిడ సదాశివరావు ఇచ్చిన కవరు అతనికిచ్చింది. అయితే శశాంక్ సూళ్లూరుపేటకు బయలుదేరుతున్నాడు ఆ సమయంలో గది కూడా అప్పటికి లాక్ చేసేశాడు. అందువల్ల ఆ కవరును అలాగే తన బ్యాగులో వేసుకున్నాడు.

"నెల్లూరుకు వెళ్లగానే చెక్కును రామకృష్ణకు మరచిపోకుండా ఇవ్వాలి" అనుకుంటూ కవరు చించాడు. లోపల చెక్కుతో పాటు ఓ ఉత్తరం, మరో చిన్న కవరు కనిపించింది.

ఉత్తరాన్ని చదవసాగాడు.

"శశాంక్ గారూ. మీకు యిబ్బంది కలిగిస్తున్నాను. సారీ. నేను మిమ్మల్ని కోరినట్లుగా యీ చెక్కును మీ స్నేహితుడు శ్రీరామకృష్ణకు అందచేయగలరు. చెక్కు వెనక నా సంతకం చేసి అక్కౌంటు నెంబరు రాశాను.

చి. సాహితి నిశ్చితార్థం రోజున నేను తీసిన ఫొటోల్లో ఒక ఫొటోలో మీరు కూడా పడ్డారు. ఆ ఫొటోలో మీరు చాలా బాగున్నారు. అందుకే ఆ ఫొటో కాపీ ఒకటి మీకు ఇస్తున్నాను. నా గుర్తుగా ఉంచుకోండి - సదాశివరావు.

అతనికి ఆశ్చర్యంతోపాటు ఆతృత కూడా పెరిగింది. తన పనులతో బిజీగా ఉండటంతో ఆయన తనను ఫొటో తీసిన విషయం కూడా గమనించలేదు అనుకున్నాడు.

శశాంక్ మనసులో ఏదో ఆశ. వణికే చేతులతో కవరులోని ఫొటోని బయట కులాగి చూశాడు. అతని ఆనందానికి హద్దుల్లేవు. ఆ ఫొటోలో సాహితి, మోహన్ పీటలపై కూర్చుని ఉంటే శశాంక్ కాస్త వెనుకగా కూర్చుని ఉన్నాడు. ఆ ఫొటోలో మోహన్ మొహం స్ప....ష్టం....గా కనిపిస్తోంది.

వెంటనే బ్యాగూ, బ్రీఫ్‌కేసు తీసుకుని బయలకు నడిచాడు ఉద్వేగంతో.

★ ★ ★

ఆటోలో హసీనా యింటికి వెళుతూ ఆలోచిస్తున్నాడు శశాంక్. అతని మనసంతా సదాశివరావుపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. 'ఆయన ఏ ఫంక్షన్‌కు వెళ్లినా తన కెమెరాతో రెండు ఫొటోలు తీసుకుని తన పర్సనల్ ఆల్బమ్‌లో పెట్టుకుంటాడట. అది ఆయన హాబీ. ఆ విషయం తనతో కూడా ఒకసారి చెప్పాడు. తను మర్చిపోవడమేకాదు. ఆయన ఫొటో తీసిన విషయం కూడా గమనించలేదు. ఏదైతేనేం సరైన సమయానికి ఆ ఫొటో తన చేతికి అందింది. మరో నెల రోజుల ఆలస్యాన్ని తగ్గించింది' అనుకున్నాడు.

ఆటోను హసీనా యింటిముందు ఆపించాడు. ఆటో అతన్ని కాసేపు ఉండమని చెప్పి హసీనా యింటి తలుపు తట్టాడు.

తలుపు తీసిన హసీనా శశాంక్‌ను చూసి ఆశ్చర్యపోయింది. 'రండి' అంటూ లోపలికి జరిగి దారిచ్చింది. శశాంక్ లోపలికి అడుగుపెట్టాడు.

"కూర్చొండి" అంది హసీనా.

శశాంక్ కూర్చోలేదు. తన జేబులోని ఫొటోను తీసి ఆమె చేతికిచ్చి "నాజర్‌ను చంపిన వ్యక్తి ఇతనేనా చూడండి" అన్నాడు.

ఫొటో చూడగానే ఆమె నోటినుండి అప్రయత్నంగా ఓ చిన్నకేక వెలువడింది. ఆ వెంటనే.

"వీడే... వీడే... ఆ ... దుర్మార్గుడు" అంది.

★ ★ ★

ఇల్లు చేరగానే నేరుగా మెట్లెక్కి తన గదికి వెళ్లిపోయాడు శశాంక్. అతనికి సాహితితో మాట్లాడే ధైర్యం లేదనిపించింది. పసిడి మొగ్గ లాంటి సాహితిని ఆ రాక్షసుడికి ఇచ్చి వివాహం చేయడానికి తలపెట్టిన ప్రమీలమ్మ మీద, మాధవరావుపైన అతనికి విపరీతమైన కోపం వచ్చింది. రూం తలుపు తీసి చెప్పులు వదలి అలసటగా అలాగే మంచంపై వాలిపోయాడు. ప్రయాణాలు చేయడం అతనికి కొత్తకాదు. అసలు అతని ఉద్యోగమే ఊర్లు తిరగడం. కాని ఎప్పుడూ అతను ఇంత అలసట ఫీల్ కాలేదు. శారీరక శ్రమకన్నా మానసికంగా తను అలసిపోవడం వల్లే ఇంత నీరసంగా ఉన్నాడు అనుకున్నాడు.

పది నిమిషాలు అలాగే పడుకుని లేచాడు. ప్యాంటు విప్పి లుంగీ కట్టుకున్నాడు. టవల్ తీసుకుని బాత్‌రూంకెళ్లి స్నానం చేశాడు. స్నానంచేశాక అలసట తగ్గినట్లనిపించింది అతనికి. టవల్‌తో తల తుడుచుకుంటూ గదిలోకి వచ్చాడు. అక్కడ సాహితి నిలబడి ఉంది. ఆమె చేతిలో కొన్ని ఉత్తరాలు ఉన్నాయి.

"రండి. కూర్చొండి" అని చెప్పి చొక్కా తగిలించుకున్నాడు.

ఆమె ఉత్తరాలు అతని చేతికిచ్చి మంచంపై కూర్చుంది. శశాంక్ కుర్చీలో కూర్చున్నాడు.

జీదతనం ఎక్కడ ఉన్నా సరే పురోగతికి అది అవరోధమే. – కెన్నెడీ

"ఏమిటీ? మా ఇంట్లోకి రాలేదు? " అని అడిగింది.

"నేను ఇప్పుడే వచ్చాను. అలసటగా ఉంటే నేరుగా మేడపైకొచ్చేశాను. ఇంట్లో అందరూ బాగున్నారా? "

"బాగున్నారు. మీరు ఇంట్లో లేకుంటే మా అందరి మనసుల్లో ఏదో లోటుగా అనిపించింది. మీరొచ్చింది చూడగానే మేమంతా హేపీగా ఫీలయ్యాం"

శశాంక్ ఆశ్చర్యంగా చూశాడు ఆమె వంక. తను లేని లోటు ప్రమీలమ్మ ఫీలైతే ఆశ్చర్యం లేదు. కానీ సాహితి కూడా ఫీలవడం ఆశ్చర్యకరమే. ఇప్పుడు తనతో మాట్లాడుతున్నట్లు ఇదివరకు కూడా మాట్లాడి ఉంటే తను ఎలాగైనా ఆమెని తన సొంతం చేసుకునేవాడు. అప్పుడు తనను చూస్తేనే మండిపడేది. అయినా ఇప్పుడు వాటి గురించి ఆలోచించి ప్రయోజనం లేదు. జరగబోయేదాన్ని గురించే ఆలోచించాలి.

"ఏమిటి చెన్నై విశేషాలు? " అని అడిగింది.

"విశేషాలేముంటాయి. అన్నీ రొటీన్‌గా జరిగిపోయాయి"

"ఆయన్ను కలిశారా? " అంది కాస్త సిగ్గుపడుతూ.

"కలిశాను. మిమ్మల్నందరినీ అడిగినట్లు చెప్పమన్నారు"

"ఫొటోలు తెచ్చారా? "

శశాంక్‌కు ఏం చెప్పాలో తోచలేదు. "ఫొటోలు పాడయ్యాయని చెబితే సాహితి తప్పకుండా బాధపడుతుంది. కాని ఎన్నాళ్లని నిజం దాచగలడు? ఎటూ మోహన్ ఆమెకు ఫోన్‌చేసినప్పుడు ఆ విషయం తప్పకుండా తెలుస్తుంది" అనుకుని

"ఫొటోలు పాడయ్యాయట" అన్నాడు.

ఆమె మొహం చిన్నబోయింది. కొంతసేపు మౌనంగా ఉండిపోయింది. తర్వాత.

"నాకేదో భయంగా ఉంది శశాంక్ గారూ. నిశ్చితార్థం ఫొటోలు పాడవడం అశుభంగా అనిపిస్తుంది నాకు" అంది. ఆమె కళ్లలోనీళ్లు.

"ఛఛ. అలాంటి భయాలేం పెట్టుకోకండి. మా మేనత్త పెళ్లికి ఫొటోగ్రాఫర్‌ని అరేంజ్ చేస్తే అతను బిజీగా ఉండి ఫొటోలు తీయడానికి చిన్న కుర్రవాడిని పంపాడట. తీరా రీలు డెవలప్‌చేసి చూస్తే అన్ని ఫొటోలు నల్లగా వచ్చాయట. వాళ్లు మొన్నే షష్టిపూర్తి కూడా చేసుకున్నారు. అప్పుడప్పుడూ కొన్ని పొరబాట్లు జరుగుతుంటాయి. ప్రతి ఒక్కటీ సెంటిమెంటుగా ఆలోచించకూడదు" అన్నాడు.

శశాంక్ చెప్పింది విన్నాక ఆమె మనసు కుదుటపడింది.

"మోహన్ మీతో బాగానే ఉన్నారు కదా" అని అడిగాడు శశాంక్.

"ఆయనతో ఏం ఇబ్బంది లేదు. చాలా మంచివారు. నా మనసు నొప్పించకుండా చూసుకున్నారు" మోహన్ హంతకుడు అని తెలిస్తే ఆమె రియాక్షన్ ఎలా ఉంటుందో ఊహించడానికే భయపడ్డాడు శశాంక్.

సాహితి లేచి నిలబడి "మీరు రెస్ట్ తీసుకోండి. మీ భోజనం..." అంది.

"భోజనం చేసే వచ్చాను. అమ్మతో తర్వాత వచ్చి మాట్లాడతానని చెప్పండి" అలాగేనంటూ తలూపి వెళ్లిపోయింది సాహితి.

★ ★ ★

గదికి తాళంవేసి కిందకు వచ్చి మోటర్ బైక్ స్టాండ్ తీస్తూంటే సాహితి కనిపించింది. పలకరింపుగా నవ్వాడు.

"శశాంక్ గారూ. ఇందాక ఆయన ఫోన్ చేశారు. చెన్నైలో మీరు కలిసినట్లు చెప్పారు. ఫొటోలు పాడైనందుకు చాలా బాధపడ్డారు" అంది సాహితి. ఆమె మొహంలో ఫొటోలు పాడయ్యాయన్న బాధ ఇంకా కనిపించింది అతనికి. సదాశివరావు వద్ద కొన్ని ఫొటోలు ఉన్నట్లు చెబుదామని

అనుకున్నాడు. మళ్లీ 'ఆ విషయం మోహన్‌కు తెలిస్తే ఆయనకు కూడా కీడు తలపెట్టొచ్చు. ఆయనంతట ఆయనే సాహితికి ఫొటోలు చూపిస్తే చూపించనీ. తను మాత్రం ఇందులో తలదూర్చకూడదు' అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు" అంది సాహితి.

"ఫొటోల గురించి. ఈసారి మోహన్ గారు వచ్చినప్పుడు మంచి ఫొటోగ్రాఫర్‌ని పిలుచుకుని వస్తాను. అందరం కలిసి కొన్ని ఫొటోలు తీసుకుందాం" అన్నాడు.

అతని మాటలకు సాహితి ఎంతో ఆనందపడింది. 'శశాంక్ తను ఎప్పుడూ ఎలా ఆనందంగా ఉంటాడో తన వాళ్లు కూడా అలాగే ఆనందంగా ఉండాలని కోరుకుంటాడు. వాళ్లను ఆనందంగా ఉంచడానికి తన ప్రయత్నం తను చేస్తుంటాడు. ఫొటోలు పాడవడం అన్నది చాలా చిన్న విషయం. తనకంటే అంతో ఇంతో బాధ ఉంది కాని ఇతరులకు అది ఇంకా చిన్న విషయం. అయినా ఆ లోటును కవర్‌చేయడానికి ఏదో ఒకటి చేయాలని అతను ప్రయత్నించడం నిజంగా అతని గొప్పతనం' అనుకుంది.

"ఈసారి మీరు ఆలోచనలో పడ్డారు" అన్నాడు నవ్వుతూ.

"ఏంలేదు. మీ గురించే ఆలోచిస్తున్నాను"

"నాగురించా? 'ఓహో. ఫొటోలు సరిగా తీయలేదు దుర్మార్గుడు' - అనుకుంటున్నారా? "

'ఛఛ. రీలు సరిగ్గా లోడ్ చేయనందువల్ల ఫొటోలు పాడయ్యాయనీ, తప్పు తనదేననీ ఆయన చెప్పారు ఫోన్లో. నేను ఆలోచించేది మీ మంచితనం గురించి. ఎదుటి మనిషి గురించి ఆలోచించే మనుషులు యింకా ఉన్నారా అనిపిస్తుంది నాకు"

"సరే. వస్తాను నేను. ఈ రాత్రికి భోజనం లేదు నాకు" అన్నాడు శశాంక్.

"ఎందుకు? " అర్థం కాక అడిగింది సాహితి.

"మీ పొగడ్తలతో కడుపు నిండిపోయింది కనుక"

సాహితి నవ్వింది. ఆమె అందానికి అందం వచ్చింది ఆ నవ్వు వల్ల.

★ ★ ★

శశాంక్ మాధవి క్లినిక్ ముందు బైక్ ఆపాడు. మాధవి బయటే నిలబడి ఉంది.

"సారీ. ఆలస్యం చేశానా? "

"ఆలస్యంగా రావడం ఒక తప్పు. ఆలస్యం చేశానా అని అడగడం ఇంకో తప్పు" అంది కోపం నటిస్తూ.

"నేరం నాది కాదు - సాహితిది"

"తనేం చేసింది మధ్యలో"

"నాతో మాట్లాడుతూ ఉండింది"

"కాబట్టి తమకు టైము తెలియలేదు" చిరుకోపంతో అంది.

"టైము తెలిసింది. ఆమె మాట్లాడుతూంటే వచ్చేయడం తెలియలేదు"

"రాముడు మంచి బాలుడు"

"శశాంక్ లాగే" అన్నాడు శశాంక్.

నవ్వుతూ అతని వెనుక బైక్‌పై కూర్చుంది.

"నా బైక్ ఎంతో పుణ్యం చేసుకుంది ఈ రోజు" శశాంక్ అన్నాడు.

అతని మాటలకు సిగ్గుపడింది మాధవి.

"ఏ హోటల్‌కెళ్దాం? " శశాంక్ అడిగాడు.

"మీ యిష్టం డీసెంట్‌గా, సేఫ్‌గా ఉండే హోటల్ సెలక్ట్ చేయండి"

"అలాగే"

ఊరికి నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉంది ఆ హోటల్. డాబా టైపులో ఆరుబయట కూర్చుని తినవచ్చు. మామూలు హోటల్‌లోలా పెద్ద హాలు కూడా ఉంది. టేబుల్స్, ఛెయిర్స్ వేసి ఉన్నాయి. అక్కడ కూడా సర్వ్ చేస్తారు.

బైక్ పార్క్‌చేసి మాధవితోపాటు లాన్‌లో నడవసాగాడు.

"గుడ్ ఈవినింగ్ సార్" అంటూ వెయిటర్ వచ్చి నిలబడ్డాడు.

చెట్ల పక్కగా చల్లగా గాలివీచే చోటు, ఎక్కువ వెలుతురులేని చోటు చూసి అక్కడ టేబుల్స్ అరేంజ్ చేయమన్నాడు శశాంక్. రెండు నిమిషాల్లో టేబుల్, ఛెయిర్స్ అరేంజ్ చేయబడ్డాయి.

"ఏం తీసుకుందాము? " శశాంక్ అడిగాడు.

"ఫస్ట్ టమేటో సూప్, తర్వాత గోబీ మంచూరియా తీసుకుందాం. మీ ఛాయిస్ ఏమిటి? "

"నా ఛాయిస్ కూడా అవే. అవి వచ్చాక మిగతావి ఆర్డర్ చేద్దాము"

శశాంక్ వెయిటర్‌కి ఏంకావాలో చెప్పి పంపాడు.

అతని చూపులన్నీ మాధవిపైనే ఉన్నాయి.

పౌర్ణమి దగ్గర పడుతూండటంతో వెన్నెల అంతటా పరచుకొని ఉంది. 'వెన్నెల వెలుగులో మాధవి మరింతగా మెరిసిపోతోంది. ఆమె కళ్లలోని మెరుపు ఆ వెలుతురులో మరింత స్పష్టంగా కనిపిస్తోంది. కోటేరు ముక్కు, శంఖం లాంటి మెడ, చక్కని అవయవ సౌష్టవంతో ఓ 'ఫర్‌ఫెక్ట్ లేడీ'లా తన ముందు కూర్చుని ఉంది' అనుకొన్నాడు.

"ఇంతసేపా ఆలోచించడం? " అంది మాధవి.

"ఏదీ ఇంకా ఆలోచన మొదలే పెట్టందే."

"మరి యింత సేపూ ఏం చేస్తున్నారు? "

"మిమ్మల్ని చూస్తున్నాను" నిజాయితీగా చెప్పేశాడు శశాంక్. చెప్పాక భయమేసింది అతనికి మాధవి ఏమంటుందో అని. అయితే మాధవి మొహంలో నవ్వు చూశాక అతని భయం పోయింది.

"ఒకే. నాకో జోక్ గుర్తొచ్చింది. అంటూ తండ్రి చెప్పిన ఓ జోక్ చెప్పాడు.

వెయిటర్ తమ దగ్గరకు రావడం చూసి "ఈసారి ఛాయిస్ మీది. మీరే అర్డర్ ఇవ్వండి" అంది మాధవి.

పుల్కా, చనా మసాలా ఆర్డర్ చేశాడు శశాంక్.

తర్వాత దగ్గరలో ఎవరూ లేరని నిర్ధారించుకొని జరిగినదంతా మాధవికి చెప్పాడు శశాంక్. మోహన్ 'హంతకుడు' అన్న విషయం వినగానే ఆమె మనసంతా అదోలా అయిపోయింది.

"ఇప్పుడు చెప్పండి. నన్నేం చేయమంటారు? ప్రమీలమ్మ గారితో అసలు విషయం చెప్పి పెళ్లి ఆపు చేయించనా? లేక ఇంకా కొన్ని రుజువుల కోసం ఆగి చూద్దామంటారా? " అన్నాడు శశాంక్.

మాధవి కొంతసేపు మాట్లాడలేదు ఆర్డర్ చేసిన ఐటమ్స్ రావడంతో మౌనంగా తినసాగారు. తర్వాత అంది మాధవి.

"మనం తొందరపడవద్దు శశాంక్. నాజర్ భార్య చెప్పింది నిజమని అనుకోవడానికి లేదు. ఆమె ఇంటికి వెళ్లారని తెలుసుకొన్న హంతకులు ఈసారి మీరు ఎవరి ఫోటో చూపిస్తే అతడినే హంతకుడుగా గుర్తించమని ఆమెను బెదిరించి ఉంటే, మీరు మోహన్ ఫోటో చూపించగానే ఆమె అతడిని హంతుకుడిగా గుర్తించి ఉండవచ్చుగా. ఇక కెమేరాలో రీలు పాడవటం కొన్నిసార్లు జరిగేదే. సరిగా లోడ్ చేయనందువల్ల రెండు సార్లు ఫిల్మ్ పాడైంది నా విషయంలోనే. ఇకపోతే మోహన్ మీతో "సాహితిని మీరెందుకు ప్రేమించలేదు" అని అడిగారన్నారు. ఓ మగవాడిలా అతనికి ఆ అనుమానం రావడం సహజం. కొంచెం ఫ్రాంక్‌గా మాట్లాడేవాళ్లు మొహమాటం లేకుండా అలా అడిగేస్తారు."

"ఈ క్షణం వరకూ 'మోహన్ హంతకుడు' అని గట్టిగా నిర్ణయించుకొని, ఎంతో కొంత సాధించానన్న గర్వంతో ఉన్నాను. మీరు మొత్తం మార్చేశారు. మీరు చెప్పినవన్నీ విన్నాక మళ్లీ 'ఎక్కడ వేసిన గొంగళి

అక్కడే' ఉన్నట్టుంది. అయితే సాహితిని దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే మోహన్ హంతకుడు కాకుండా ఉంటేనే మంచిదనిపిస్తుంది" అన్నాడు శశాంక్.

"మీకింకా రెండు నెలల టైముంది. కాబట్టి తొందరపడవలసిన అవసరం లేదు. మనం ఆఖరు నిముషం వరకూ ప్రయత్నిద్దాం."

మాధవి మెడలో సన్నని బంగారు చెయిన్, దానికి ఓ డాలర్ ఉంది. లేత నీలి రంగు చీర మీద ఆ బంగారం మిలమిలా మెరుస్తుంది. మాధవి మాట్లాడుతూ అప్పుడప్పుడూ ఆ డాలర్‌ని గడ్డం దగ్గర ఆన్చి పట్టుకోవడం చూశాడు శశాంక్.

"ఏమిటి మీలో మీరే నవ్వుకొంటున్నారు? "

శశాంక్ తన ఆలోచన చెప్పాడు. మాధవి కూడా నవ్వింది.

"మీలో ఆ నిజాయితీ నాకెంతో నచ్చింది శశాంక్. యుఆర్ గ్రేట్" అంది మాధవి. టౌన్లో ప్రవేశించగానే "మిమ్మల్ని ఎక్కడ డ్రాప్ చేయను? " అని అడిగాడు.

"మా ఇంటి దగ్గరే డ్రాప్ చేయండి"

ఆమె ఇంటి ముందు బైక్ ఆపాడు శశాంక్. ఆమె బైక్ దిగి "రండి లోపలికి" అంది.

"ఇంకో రోజు వస్తాను. బై. గుడ్‌నైట్"

"థాంక్యూ. గుడ్‌నైట్" అని ఇంట్లోకి వెళ్లింది మాధవి.

★ ★ ★

మోటర్ బైక్ కాంపౌండు లోపల పెట్టి ప్రమీలమ్మ ఇంటివైపు చూశాడు శశాంక్. తాళం కప్ప వేలాడుతోంది. 'సెకండ్ షోకి వెళ్లినట్లున్నారు' అనుకుంటూ మెట్లవైపు నడుస్తూంటే 'హలో' అని ఎవరో పిలవడం వినిపించింది. పిలుపు వచ్చిన దిశగా చూశాడు. ప్రమీలమ్మ ఇంటి అరుగుమీద ఎవరో కూర్చుని ఉన్నారు. చీకట్లో అతని కళ్లు మాత్రం కనిపిస్తూ భయం కలిగిస్తున్నాయి.

శశాంక్ తన సెల్ ఆన్ చేసి ఆ వెలుగులో గోడమీద స్విచ్ బోర్డ్ ఎక్కడుందో చూసి స్విచ్ వేసి ఆ వ్యక్తివైపు చూసి నిశ్చేష్టుడైపోయాడు.

అతను మో...హ...న్.

★ ★ ★

"హలో! ఎప్పుడొచ్చారు" అంటూ మోహన్‌ను పలుకరించాడు శశాంక్, తన తత్తరపాటును బయటకు కనబడనీయకుండా...

"వచ్చి పది నిమిషాలయింది. వీళ్ళు షాపింగ్‌కో, గుడికో వెళ్లినట్లున్నారు"

"మీరు వస్తారన్న విషయం వాళ్ళకు తెలియదా? "

"నేను చెప్పలేదు. చెప్పకుండా వచ్చి సాహితిని సర్‌ప్రైజ్ చేద్దామని అనుకొన్నాను. వాళ్ళంతా కలిసి నన్ను సర్‌ప్రైజ్ చేశారు"

శశాంక్ కూడా అక్కడే అరుగుమీద మోహన్‌కు ఎదురుగా కూర్చున్నాడు.

"ఎనిమిదిన్నర వరకూ కూడా ఇంట్లోనే ఉన్నారు. ఈ సమయంలో ఇంట్లో లేరంటే తప్పకుండా సెకండ్ షోకి వెళ్లి ఉంటారు" అన్నాడు శశాంక్.

"అంటే అర్ధరాత్రి వరకూ నా గతి ఇంతేనా? " అన్నాడు గాభరాగా.

"ఎందుకు? నా గదికొచ్చి పడుకోండి" అన్నాడు శశాంక్. అన్నాక నాలిక కరచుకొన్నాడు. మోహన్ తన గదిలో ఉంటే ఎలా? అన్న ఆలోచనే అతనికి ఎంతో భయాన్ని కలిగిస్తోంది.

అతనికి ప్రమీలమ్మ కుటుంబం మీద కోపం వచ్చింది. 'ఈరోజే సినిమాకు వెళ్లకుంటే ఏం? ఎంతసేపు ఇతన్ని ఇంటి

సంఘటనలను మనం మార్చలేకపోవచ్చు. కానీ ఆ సంఘటనల విషయంలో ఏర్పడే మనోభావాలను మాత్రం మార్చుకోవచ్చు. – రాధాకృష్ణన్

బయటే కూర్చోబెట్టుకొని ఎంటర్‌టైన్ చెయ్యగలను? పైగా ఇప్పుడైతే వీధిలో అంతో ఇంతో మానవ సంచారం ఉంది. పద కొండు దాటితే ఎవరూ ఉండరు. అప్పుడు మోహన్ తనను చంపేస్తే? అసలు యీ కాంపౌండు లోపల తామిద్దరే ఉన్నామన్నా ఆలోచనే తను భరించలేకపోతున్నాడు' అనుకొన్నాడు.

"ఒక అయిడియా" అన్నాడు మోహన్ ఉన్నట్టుండి.

"ఏమిటి? "

"మనం కూడా సెకండ్ షో కెళ్దాం"

"ఇప్పుడా? ఈ పాటికి సినిమా మొదలు పెట్టేసి ఉంటారు"

"ఫర్వాలేదు. టైం పాస్‌కేగా మనం వెళ్లేది. పదండి. మీ గదిలో లగేజ్ పడేసి వెళ్దాం"

భయంగా అతనివైపు చూశాడు శశాంక్. అయితే మోహన్ శశాంక్‌ని చూడలేదు. లగేజ్ చేతిలోకి తీసుకొంటున్నాడు.

'గదిలోకి వెళితే తప్పకుండా తనని చంపేస్తాడు. ఫిల్ము రీలు కావాలనే పాడు చేశావని తను నోరు జారాడు. ఒకవేళ అతను హసీనాను కలిసుంటే ఆమె అతని ఫొటోను గుర్తించిందని తెలిసిపోయి ఉంటుంది. కొంపదీసి ఆ విషయం తెలుసుకోగానే వెంటనే బయలుదేరి ఇక్కడికి వచ్చాడా ఏమిటి? అదే నిజమైతే ఇదే ఆఖరుసారి తను మేడమెట్లు ఎక్కడం, దిగడం ఎటూ ఉండదు. దింపడమే ఉంటుంది. మోహన్ తనను చంపేసి, లగేజ్ తీసుకొని వెళ్లిపోతే తనను ఎవరు చంపారో కూడా ఎవరికీ తెలియదు. ఎందుకంటే మోహన్ వచ్చిన విషయం, వెళ్లిన విషయం ప్రమీలమ్మ కుటుంబ సభ్యులెవరికీ తెలియదు కనుక అనుకొన్నాడు.

"పదండి" అన్నాడు మోహన్ లగేజి చేతిలోకి తీసుకొని తప్పదన్నట్టు కదిలాడు శశాంక్. మనసులో మోహన్ దాడికి దిగితే ఎలా తనని తాను కాపాడుకోవాలా అని ఆలోచించుకొంటూ మెట్లవైపు కదిలాడు.

ఇంతలో ఇంటి ముందు ఆటో ఆగింది. చటుక్కున తల తిప్పి ఆటో దిగుతున్న కీర్తనను చూశాడు శశాంక్. అతని మొహం సంతోషంతో విప్పారింది. వెంటనే "వాళ్ళొచ్చేశారు" అంటూ ఆటోను సమీపించాడు.

"ఎక్కడికెళ్లారు? " అని అడిగాడు శశాంక్ ప్రమీలమ్మను.

"సెకండ్ షోకు టికెట్లు దొరకలేదు. 'చిరంజీవి సినిమాకు టికెట్లు దొరకవు. నాలుగు రోజులాగి వెళ్దాం' అంటే కీర్తన వింటేగా? " అంటూ మోహన్‌ను చూసి "అరె. మీరెప్పుడొచ్చారు? " అంది కంగారుగా.

"నేను వచ్చి అర్ధ గంటైంది. శశాంక్ గారితో మాట్లాడుతూ కూర్చుని ఉన్నాను" అన్నాడు మోహన్. మోహన్‌ను చూడగానే సాహితి మొహం వికసించడం శశాంక్ గమనించాడు.

ఆటోకు డబ్బులిస్తున్న ముకుందరావును చూసి "అరె అంకుల్ కూడా సినిమాకు బయలుదేరారా? అందుకే టికెట్లు దొరకలేదు" అన్నాడు శశాంక్ నవ్వుతూ.

ముకుందరావు నవ్వి "రండి లోపలికి" అన్నాడు. అందరూ లోపలికి వెళ్లారు. శశాంక్ అందరికీ 'గుడ్‌నైట్' చెప్పి తన గదిలోకి వచ్చి పడుకొన్నాడు.

ఆలోచనలతో అతనికి నిద్ర పట్టలేదు. తను ఇదివరకులా హుషారుగా ఉండటం లేదు ఈ మధ్య. ఎప్పుడూ మోహన్ గురించిన ఆలోచనలే తన మదినిండా ఉంటున్నాయి అనుకొన్నాడు. అతనికి స్వప్నతో పరిచయం, స్వప్న మరణించడం, సాహితి పెళ్ళి నిశ్చయం అవడం, స్వప్న ఇంట్లో మోహన్ ఫొటో దొరకడం, ఉదయ్‌తో పరిచయం, హసీనాను కలవడం అన్నీ సినిమా రీళ్ళలా కళ్ళముందు కదలుతున్నాయి. ఇవన్నీ జరగకపోయి ఉంటే తను ఎప్ప




టిలా ఆనందంగా ఉండేవాడు.

ఆలోచిస్తున్న శశాంక్‌కు ఉన్నట్టుంది ఏదో శబ్దం వినబడింది. చెవులు రిక్కించి ఆ శబ్దాన్ని వినసాగాడు. ఎవరో మేడమెట్లు ఎక్కి వస్తున్నారు. 'ఎవరో ఏమిటి? మోహనే అయి ఉంటాడు' అనుకొని ఊపిరి బిగబట్టి పడుకున్నాడు. తలుపుపై మునివేళ్ళతో తట్టిన శబ్దం వినిపించింది. శశాంక్ కదల్లేదు. బదులు రాకపోయేసరికి మళ్ళీ తలుపు తట్టిన శబ్దం వినిపించింది.

శశాంక్ భయంతో తలుపువైపే చూడసాగాడు. తర్వాత అతను మెట్లు దిగుతున్న శబ్దం వినిపించింది. బరువుగా నిట్టూర్పు వదిలాడు శశాంక్. అయితే భయం వల్ల ఆ రాత్రి అతనికి నిద్ర రాలేదు. తాను నిద్రపోతే మోహన్ ఏదో ఒక విధంగా తలుపు తెరచుకొని వచ్చి తనను చంపేస్తాడనే భయం అతనికి ఉంది. తెల్లవారుజామున నిద్ర పట్టింది.

★ ★ ★

ఉదయం ఆలస్యంగా నిద్ర లేచాడు శశాంక్. లేచి గోడ గడియారం వైపు చూశాడు. ఏడు గంటలు చూపిస్తోంది. మామూలుగా ఊర్లో ఉన్న రోజులు ఉదయం అయిదు గంటలకంతా లేచి జాగింగ్‌కు వెళ్లి వస్తాడు శశాంక్. అతనికి ప్రాతఃకాలాన్ని చూడటమంటే చాలా ఇష్టం.

గోడమీద ఉన్న షిర్డీ సాయిబాబా పటానికి నమస్కారం చేసి సిటౌట్‌లోకి వచ్చి కిందికి చూశాడు. మోహన్ బయట కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్నాడు.

'అంటే అయ్యగారు రాత్రి అత్తగారింట్లోనే పడుకొన్నారన్నమాట' అనుకొన్నాడు. అతనితో 'ఎటూ నిశ్చితార్థం అయిందని సాహితి అడ్వాన్స్ అయితే' అన్న మాధవి మాటలు గుర్తొచ్చాయి. మళ్ళీ 'ప్రమీలమ్మ సాంప్రదాయాలు పాటించే మనిషి. మోహన్‌కు ముకుందరావు పక్కనే మంచం అరేంజ్ చేసి ఉంటుంది. వీళ్లిద్దరిపై ఓ కన్ను వేసే ఉంటుంది' అనుకొన్నాడు.

ఇంతలో మోహన్ తలెత్తి చూశాడు.

"హాయ్ గుడ్ మార్నింగ్" అన్నాడు శశాంక్.

"గుడ్ మార్నింగ్. రండి" అన్నాడు మోహన్.

శశాంక్ వస్తానన్నట్టు తలూపి బ్రష్ చేసుకొని, మొహం కడుక్కొని, కట్టుకొన్న లుంగీపైన టీ షర్టు ధరించి కిందకు వెళ్లాడు.

"నిన్న రాత్రి చాలా త్వరగా నిద్రపోయినట్లున్నారు" అన్నాడు మోహన్ శశాంక్‌నే పరీక్షగా చూస్తూ...

"అవును ఏం? "

"రాత్రి మీ గదిలో పడుకొందామని వచ్చి తలుపు తట్టాను. మీరు లేవలేదు"

"అలాగా ఐ యామ్ సారీ" అన్నాడు నొచ్చుకున్నట్లు నటిస్తూ.

"ఫర్వాలేదులెండి. అది నా మంచికే అయింది"

అనుమానంగా అతనివైపు చూశాడు శశాంక్.

"అలా చూడకండి. అదేం కాదు. సాహితితో మరికొంతసేపు మాట్లాడే అవకాశం దొరికింది. అంతే? " అన్నాడు మోహన్ నవ్వుతూ.

శశాంక్ కూడా నవ్వాడు మనసులోని భయం తీరడంతో.

కీర్తన వచ్చి శశాంక్‌కు కాఫీ యిచ్చింది.

"మీ బావగారికి? " అన్నాడు శశాంక్.

"నేను యిప్పుడే తాగాను" మోహన్ అన్నాడు.

కీర్తన వెళ్ళిపోయాక మోహన్ చుట్టూ ఒకసారి చూచి "శశాంక్ గారూ. ఐ యామ్ వెరీ సారీ. ఆ రోజు మీతో కాస్త పూలిష్‌గా మాట్లాడాను. మీరు కోపంగా రియాక్టవడం కూడా న్యాయమే. కాని చివరగా మీరు అన్నమాట నన్ను ఎంతో బాధపెట్టింది. నా నిశ్చితార్థం ఫొటోలు నేనెందుకు పాడుచేస్తాను చెప్పండి? అసలు మీ మనసులో ఏముందో చెబితే మీ అనుమానాల్ని పోగొట్టడానికి నా ప్రయత్నం నేను చేస్తాను. సాహితికి, ఆమె కుటుంబానికి ఎంతో దగ్గరివారైన మీరు నాకూ దగ్గర కావాలి. చెప్పండి. ఎందుకలా అన్నారు? "

శశాంక్‌కు ఏం జవాబు చెప్పాలో తోచలేదు. మోహన్‌ను చూస్తూంటే, అతని మాటలు వింటూంటే నిజంగా అతని తప్పు లేదేమో అనిపిస్తోంది. మరి హసీనా అతడిని హంతకుడుగా ఎలా గుర్తించింది? మాధవి అన్నట్లు అసలు హంతకుడిగా 'ఎవరి ఫొటో చూపిస్తే వాళ్ళనే హంతకుడు అని గుర్తించమని' హసీనాకు చెప్పి ఉంటాడా? ' అనుకొన్నాడు.

"ఏ మొహమాటం లేకుండా చెప్పండి. నేనేం అనుకోను" మళ్ళీ అన్నాడు మోహన్.

"నిజానికి ఆ క్షణంలో నా మనసులో ఏమీలేదు. మీరు ఆ ప్రశ్న వేసేసరికి కోపం వచ్చి ఇంకేమనాలో తోచక ఆ మాటన్నాను. పైగా ఫొటోలు రాలేదంటే సాహితి బాధపడతారన్న ఆలోచన కూడా ఉండటంతో అలా అన్నాను".

"ఓ.కె. లెటజ్ ఫర్గెట్ యిట్ అండ్ లెట్ అజ్ బీ ఫ్రెండ్స్" అన్నాడు మోహన్.

ఆ తర్వాత శశాంక్ వాళ్ళతోనే టిఫిన్ తిన్నాడు. మోహన్ అతనితో చనువుగా మాట్లాడుతూంటే 'తను అతన్ని అనవసరంగా అనుమానించానేమో' అనిపించింది అతనికి.

మధ్యాహ్నం మోహన్ ఊరికి బయలుదేరాడు. అతన్ని రైల్వేస్టేషన్ దగ్గర డ్రాప్ చేశాడు శశాంక్.

"థాంక్యూ శశాంక్. మీకో సర్‌ప్రైజింగ్ న్యూస్ చెప్పనా? " అన్నాడు మోహన్.

ఏమిటన్నట్టు చూశాడు శశాంక్.

"ఫొటో స్టూడియో వాడు పొరబాటుగా వేరే రీలు చూసి అలా చెప్పాడు మాకు. మొన్న బెంగుళూరు వెళ్ళినప్పుడు మీరు అలా అన్నారన్న ఉక్రోషంతో వాణ్ణి కేకలేశాను. వాడు తర్వాత నాకు ఫోన్ చేసి పొరబాటు జరిగిందనీ, ఫొటోలన్నీ బాగా వచ్చాయనీ, వచ్చి తీసుకెళ్ళమనీ అన్నాడు. నేను వెళ్ళి తీసుకున్నాను. అవి సాహితికి ఇవ్వడానికే నెల్లూరు వచ్చాను".

"మరి ఫొటోలు వచ్చిన విషయం నాకెవరూ చెప్పలేదే"

"నేను బయలుదేరే ముందే సాహితికి యిచ్చాను. ఎనీవే కామెడీ ఆఫ్ ఎర్రర్స్ నాట్ ఎండెడ్ విత్ ట్రాజెడీ. బై".

మోహన్ వెళ్ళిపోయాడు. శశాంక్

మాత్రం అక్కడే నిలబడ్డాడు అతను వెళ్ళిన వైపే చూస్తూ.

ఏమిటి ఇతని ధోరణి? నిజంగా ఫొటో స్టూడియో అతను పొరబాటుగా చెప్పాడా లేక తనకు మరొకరి ద్వారా ఫొటో దొరికి హసీనాచే మోహన్ హంతకుడని తెలుసుకున్నాడు కాబట్టి ఇక ఆ ఫొటోలు దాచిపెట్టి ప్రయోజనం లేదని ఇలా బయటపెడుతున్నాడా?

ఈసారి చెన్నై వెళ్ళినప్పుడు హసీనాను ఇంకోసారి కలసి మోహన్‌ను ఆమె హంతకుడిగా గుర్తించడంలో ఎవరి ప్రమేయం గాని, బలవంతంగాని ఉందా అని కనుక్కోవాలి. ఉన్నా ఆవిడ నిజం చెప్పదు. తనే ఏదో ఒకటి చేసి నిజం చెప్పించాలి. అవసరమయితే ఉదయ్ సహాయం తీసుకోవాలి' అనుకున్నాడు శశాంక్.

★ ★ ★

మరుసటిరోజు తన సేలరీ చెక్కు అక్కౌంటులో జమ చెయ్యడానికి స్టేట్ బ్యాంక్‌కు వెళ్ళాడు శశాంక్. అతన్ని చూడగానే బ్యాంకులోని ఉద్యోగులు చాలామంది శశాంక్‌ను పలుకరించారు.

'ఈ గౌరవం తనది కాదు. రామకృష్ణది. రామకృష్ణ తన తోటి ఉద్యోగులతో తమాషాగా మాట్లాడుతుంటాడు. ఎవరినీ నొప్పించడు. అందరికీ సహాయం చేస్తూంటాడు. అందుకే అతని ఫ్రెండుగా తనకు గౌరవం' అనుకున్నాడు శశాంక్.

రామకృష్ణ సీటుకు ఎదురుగా నిల్చుని "హలో" అన్నాడు.

"హలో శశాంక్. రా... కూర్చో. ఎక్కడ ఈమధ్య దర్శనాలే లేవు" అన్నాడు రామకృష్ణ.

"మామూలే. క్యాంపులు, టార్గెట్లు, మెడికల్ షాపులు, డాక్టర్లు"

"డాక్టరమ్మలు"

అతను మాధవి గురించి అంటున్నాడని అర్థమైంది శశాంక్‌కు.

"నీ శ్లేష నాకర్థమయిందిలే. ఏమిటి విశేషాలు?"

"విశేషాలు నీవే చెప్పాలి. డాబా హోటల్‌లో డిన్నర్ ఎలా ఉంది?"

శశాంక్ ఆశ్చర్యంగా అతనివైపు చూసి "నీవూ ఆ రోజు హోటల్‌కు వచ్చావా? మరి మమ్మల్ని పలకరించలేదేం?" అన్నాడు.

"ఆ రోజు మేము తేలు కుట్టిన దొంగలం"

ఆ రోజు అతనితోపాటు సంధ్య కూడా వచ్చిందని అర్థమైంది శశాంక్‌కు.

"అన్నట్టు శశాంక్. నీకొక గుడ్ న్యూస్"

"విజయ్‌కు పెళ్ళి కుదిరిందా?" అన్నాడు శశాంక్. విజయ రామకృష్ణ చెల్లెలు.

"నువ్వు ఫాస్ట్ అని తెలుసు కాని యింత ఫాస్ట్ అని తెలియదు. మొన్న విజయ్‌కు అనంతపురంలో పెళ్ళిచూపులు జరిగాయి. అబ్బాయి, అమ్మాయి ఒకరికొకరు నచ్చారు. అతను ఎల్.ఐ.సి.లో పనిచేస్తున్నాడు".

"వెరీగుడ్. విజయకు కంగ్రాట్స్ చెప్పు. నేను సాయంత్రం ఫోన్ చేసి తనతో మాట్లాడుతాను. విజయ పెళ్ళిరోజే సంధ్య పెళ్ళికూడా చేసెయ్. ఖర్చు కలిసొస్తుంది" అన్నాడు శశాంక్.

"అలా చేస్తే నువ్వు నా పెళ్ళికి రాలేవు"

"ఎందుకని?"

"ఇప్పుడే కదా నిన్ను ఫాస్ట్ అని మెచ్చుకున్నాను. త్వరగా ఆలోచించు మరి"

"సాహితి పెళ్ళి, విజయ పెళ్ళి ఒకే రోజా?"

"అవును. నౌ యు ఆర్ శశాంక్. ఇంతకూ నువ్వు ఎవరి పెళ్ళికి అటెండ్ అవుతావు?"

"విజయ పెళ్ళికి ఎలాగూ అన్నీ నువ్వు

> యవ్వనం అన్నది ఒక జీవిత దశకాదు. అది మానసికమైన స్థితి.
> – స్వామి చిన్మయానంద

చేస్తావు. సాహితి పెళ్ళి పనులు చెయ్యడానికి ఎవరూ లేరు. అందువల్ల సాహితి పెళ్ళికే అటెండ్ అవుతాను. నీకు వీలైనంత సహాయం చేస్తాను"

శశాంక్ వైపు మెచ్చుకోలుగా చూసి "మంచి నిర్ణయం నీది" అన్నాడు రామకృష్ణ.

ఇంతలో సంధ్య అటుగా వెళుతూ శశాంక్‌ను చూసి, దగ్గరకు వచ్చి పలుకరించింది.

"ఏమిటి యీ మధ్య మీరు ఎక్కడా కనిపించటం లేదు? " అన్నాడు శశాంక్.

"అంటే నేను ఊరంతా తిరుగుతూ ఉంటానంటారా? " కోపం నటిస్తూ అంది సంధ్య

"అది కాదు నా ఉద్దేశం. మనం నలుగురం అప్పుడోసారి థియేటర్‌లో కలిశాం కదా. మళ్ళీ అలా కలవలేదు అన్నాను"

"మీరూ తెలుగు సినిమాలు చూస్తే కలిసేవాళ్ళం" అంది నవ్వుతూ.

"మీకు మాధవిగారు చెప్పారా? " అంటూ తల పట్టుకుని "ఇంకా ఏం చెప్పారు నా గురించి? " అని అడిగాడు కుతూహలంగా.

"మీరు చెన్నైలో టాయిలెట్‌ని డైరెక్టర్ల ఛాంబర్ అనుకోవడం కూడా చెప్పింది" అంది పగలబడి నవ్వుతూ.

శశాంక్ కూడా నవ్వుతూ "ఆడవాళ్ళ నోట్లో ఏదీ దాగకూడదన్న ధర్మరాజు శాపం గురించి తెలిసీ ఆవిడతో అన్ని విషయాలూ చెప్పాను" అన్నాడు.

"మీ ఫ్రెండు పాలకథ తెలుసా మీకు? " అని శశాంక్‌ను అడిగింది సంధ్య.

"మీ కోసం కస్టమర్లు కాచుకొని ఉన్నారు. మీరు సీటుకు వెళ్ళండిక" అన్నాడు రామకృష్ణ కోపంగా.

"ఈ ఒక్క విషయం చెప్పి వెళతాను" అంటూ చెప్పసాగింది.

"బ్యాంకులో ఉద్యోగం రాకమునుపు రామకృష్ణ హైదరాబాదులో ఓ ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేసేవాడు. అతని అన్నావదినలు హైదరాబాదులోనే ఉండటంతో వాళ్ళతోనే ఉండేవాడు. ఓ రోజు అతని అన్నా వదినలు సినిమాకు వెళుతూ, రామకృష్ణకు ఫోన్ చేసి "ఎదురింటివాళ్ళు పాలు తీసి ఉంచుతారు. నువ్వు ఆఫీసు నుంచి రాగానే వాళ్ళనడిగి పాలు తీసుకుని కాస్త కాచి పెట్టు' అని చెప్పారట. రామకృష్ణ ఎదురింటికి వెళ్ళి పాలు అడిగితే వాళ్ళు అప్పుడే పాలను కాచి ఉండటంతో వేడికి చేయి కాలుతుందని పాలగిన్నె కింద కొ ప్లేటు పెట్టి 'జాగ్రత్త. వేడిగా ఉంది' అని చెప్పి ఇచ్చారట. రామకృష్ణ కొంతదూరం నడచి వెనక్కి తిరిగి "పాలు మీరు కాచారా లేక నేను కాచాలా? " అని అడిగాడట"

"ఈ విషయం మీకెవరు చెప్పారు? " అని అడిగాడు శశాంక్ నవ్వుతూ.

"ఇంకెవరు. ఆయనే' అంటూ వెళ్ళిపోయింది సంధ్య.

శశాంక్ బ్యాంకులో తన పని అయ్యాక రామకృష్ణ దగ్గర శెలవు తీసుకుని బయటకు నడిచాడు.

★ ★ ★

సెప్టెంబర్ రెండో తారీఖు. ఆ రోజు శశాంక్ పుట్టిన రోజు. ఉదయం అయిదు గంటలకు అతని సెల్ రింగయింది. నిద్రపోతున్న శశాంక్ లేచి సెల్ చేతిలోకి తీసుకున్నాడు. ఆ కాల్ తన తల్లిదగ్గర్నుంచి అని అతనికి తెలుసు. అందుకే నెంబరు కూడా చూడలేదు అతను.

"హ్యాపీ బర్త్‌డే రా శశాంక్" తల్లిగొంతు వినిపించింది.

"థాంక్యూ అమ్మా"

"నీ బర్త్‌డేకు ఇక్కడుంటావని ఆశపడ్డానురా. వీలు చేసుకొని వచ్చుండాల్సింది నువ్వు"

"ప్రయత్నించానమ్మా. వీలుకాలేదు. కంపెనీ పెద్దది కాబట్టి పనులూ ఎక్కువగానే ఉన్నాయి. దీపావళికి తప్పకుండా వస్తాను"

"సరే. ఈరోజు తలస్నానం చెయ్యి. కొత్త

బట్టలు కొన్నావా? "
"కొన్నాను"
"కొత్త బట్టలు వేసుకో. స్వీటు కొని తిను. ప్రమీలమ్మ ఇంట్లో అందరికీ ఇవ్వు. సాయంత్రం సాయిబాబా గుడికి వెళ్ళి రా. రామకృష్ణతో సినిమాకెళ్ళి ఎంజాయ్ చెయ్యి"
తల్లి మాటలకు నవ్వొచ్చింది అతనికి. 'ఆమె నెల్లూరుకు రాకపోయినా తన మాటల ద్వారా ఇక్కడివారందరూ ఆమెకు పరిచయమే' అనుకొన్నాడు.
"నాన్నగారు మాట్లాడతారు"
తర్వాత తండ్రి నుంచి, చెల్లి నుంచి శుభాకాంక్షలు అందుకొన్నాడు.
షాంపూతో తలస్నానం చేశాడు. కాసేపు టీవీలో న్యూస్ చూసి, తర్వాత రెడీ అయి హోటల్‌కు బయలుదేరాడు. హోటల్‌లో రామకృష్ణ కనబడ్డాడు. తనూ అతని ఎదురుగా కూర్చుని టిఫిన్ ఆర్డర్ చేశాడు శశాంక్.
"రాంకీ. ఈ రోజు నా బర్త్‌డే"
"అలాగా. మెనీ మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అని చెప్పి బేరర్‌ని పిలిచి టిఫిన్‌తో పాటు స్వీటు కూడా తెమ్మన్నాడు.
"ఈ రోజు టిఫిన్, స్వీటు ఖర్చు నాది" అన్నాడు రామకృష్ణ.
తర్వాత "శశాంక్. రేపు నేను చెన్నై వెళ్తున్నాను. కాబోయే బావగారికి బట్టలు, వాచీ, ఉంగరం కొనాలి. అలాగే నా బట్టలూ కొనాలి. నీకు వీలైతే రేపు లీవుపెట్టి నాతో రాగలవా? " అని అడిగాడు రామకృష్ణ.
"తప్పకుండా వస్తాను"
"అయితే ఏ ట్రైనులో వెళ్లాలో సాయంత్రం నీకు ఫోన్ చేస్తాను. వీలైనంత ఎర్లీగా బయలుదేరుదాం"
"అలాగే"
ఈమధ్య తరచుగా చెన్నై వెళ్ళి వస్తూండటంతో తన బిజినెస్ టార్గెట్‌ను అందుకోవడంలో కాస్త వెనకబడి ఉన్నాడు శశాంక్. అందుకే పుట్టినరోజు కూడా చిత్తూరు వెళ్లకుండా పనులు పూర్తిచేసుకోవాలనుకున్నాడు. అయితే రామకృష్ణ చెన్నైకి రమ్మని కోరగానే ఒప్పుకోవడానికి కారణం హసీనాను కలిసి మాట్లాడవచ్చనే!
హోటల్ నుంచి గదికొచ్చి ఆ రోజు తను కలవవలసిన డాక్టర్ల లిస్టు, మెడికల్ షాపుల లిస్ట్ తయారుచేసుకొన్నాడు. మధ్యమధ్యలో స్నేహితుల నుంచి, బంధువుల నుంచి ఫోన్ ద్వారా శుభాకాంక్షలు అందుకొన్నాడు.
టై కట్టుకొని షూస్ వేసుకొంటూంటే మేడపైకి ఓ కుర్రాడొచ్చాడు. ఏమిటన్నట్లు చూశాడు శశాంక్.
"కొరియర్ సర్వీస్" అంటూ శశాంక్‌కు ఓ ప్యాకెట్ అందజేసి అతని సంతకం తీసుకొని వెళ్ళిపోయాడు ఆ కుర్రాడు.
"ఎవరు పంపించారబ్బా? " అనుకొంటూ కొరియర్ రిసీట్‌లో పేరు కోసం వెతికాడు.
నెల్లూరు అని రాసి ఉంది. అంతే. ప్యాక్ విప్పి లోపల చూశాడు.
స్వీట్ ప్యాకెట్. ఓ రెడీమేడ్ షర్టు కనిపించింది. స్కై బ్లూ కలర్ షర్టు అది. ఓ కాగితం షర్టుకు పిన్ చేయబడి ఉంది. కాగితం చదివాడు.
"బర్త్‌డే బాయ్‌కి పుట్టినరోజు శుభాకాంక్షలు- మాధవి" అని రాసి ఉంది. అతని మనసు ఆనందంతో, ఆశ్చర్యంతో నిండిపోయింది. "ఈ రోజు తన బర్త్‌డే అన్న విషయం మాధవికెలా తెలుసు? " అనుకొన్నాడు. ఆ మాట మాధవినే అడుగుదామని ఆమె సెల్‌కు ఫోన్ చేశాడు.
సెల్‌లో అతని నెంబరు చూడగానే "హలో శశాంక్. హాపీ బర్త్‌డే టూ యూ" అంది మాధవి.
"థాంక్యూ. మీ గిఫ్ట్ అందింది. థాంక్యూ వెరిమచ్. షర్టు చాలా చాలా బాగుంది"
"థాంక్యూ"
"ఈరోజు నా బర్త్‌డే అని మీకెలా తెలిసింది? "
"చాలారోజుల కిందట ఏదో మాటల్లో

మీరే చెప్పారు. నేను నోట్ చేసుకొన్నాను"

శశాంక్‌కు చాలా ఆనందమేసింది. ఆమె మాటలు విని. 'తన బర్త్‌డే అంత బాగా గుర్తుంచుకొందంటే తనంటే ఆమెకు ఎంత అభిమానం ఉందో తెలుస్తూంది" అనుకొన్నాడు. ఓ అందమైన, చురుకైన, మెడిసిన్ చదివిన అమ్మాయి తనంటే అభిమానం, ఆసక్తి చూపించడం అతనికెంతో థ్రిల్‌ను కలిగించింది.

"బర్త్‌డే రోజు మీ ప్రోగ్రాం ఏమిటి? ఎలా సెలబ్రేట్ చేయాలనుకొంటున్నారు? " అని అడిగింది మాధవి.

"నో సెలబ్రేషన్స్. నేనేం అబ్దుల్ కలాంనా లేక సచిన్ టెండూల్కర్‌నా లేక ఎ.ఆర్. రెహమాన్నా? ఏం సాధించానని సెలబ్రేట్ చేసుకోవాలి" అన్నాడు.

"నేనో విషయం చెప్పనా? మీరు అబ్దుల్ కలాం, సచిన్ టెండూల్కర్, ఏ.అర్. రెహమాన్ కాకపోవచ్చు. కాని నా మనసులో వీళ్లందరి కంటే ఇంకా ఉన్నతమైన స్థానంలో మీరున్నారు. ఎందుకంటే..."

"ఎందుకంటే"

"ఎందుకంటే నా హీరో మీరే కాబట్టి"

శశాంక్‌కు ఏం మాట్లాడాలో కూడా తోచ లేదు. అతని చెవుల్లో 'నా హీరో మీరే' అన్న మాధవి మాటే ప్రతిధ్వనిస్తోంది. 'ఇన్ని రోజులుగా ఉన్న అనుమానం, సందేహం పోయి ఆమె మనసు స్పష్టంగా తనకు తెలిసిన ఈ సమయం తన జీవితంలో అత్యంత మధురమైన సమయం" అనుకొన్నాడు.

"ఏమిటి మాట్లాడరు? "

"అందుకు నేను అర్హుణ్ణో కాదో తెలియదు కాని అదృష్టవంతుణ్ణి"

"అలాంటి మాటలు వద్దు. పుట్టిన రోజు బాగా ఎంజాయ్ చెయ్యండి. నేను మళ్ళీ సాయంత్రం మీకు ఫోన్ చేస్తాను. ఈ రోజు ఆదివారం అయి ఉంటే ఇద్దరం కలిసి సినిమాకు వెళ్ళేవాళ్ళం"

"ముందున్న రోజులన్నీ మనవే లెండి"

"అవును. ఉంటాను. హేవ్ ఎ నైస్ డే. బై"

"బై" అంటూ సెల్ ఆఫ్ చేశాడు శశాంక్.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం ప్రమీలమ్మ ఇంట్లో అందరికీ మాధవి పంపిన స్వీట్లను పంచాడు శశాంక్. అందరూ అతనికి శుభాకాంక్షలు చెప్పారు. ప్రమీలమ్మ గదిలోకి వెళ్ళి తిరిగొచ్చి ఓ పుస్తకాన్ని అతని చేతిలో పెట్టింది. "శ్రీ సాయి సచ్చరిత్ర పారాయణ గ్రంథ'మది.

"నీకు సాయిబాబా అంటే భక్తి, నమ్మకం ఉందని తెలుసు నాకు. అందుకే నీ పుట్టిన రోజు కానుకగా ఆ పుస్తకాన్ని నీకిచ్చాను" అంది ప్రమీలమ్మ.

"చాలా విలువైన బహుమతిని ఇచ్చారు థాంక్యూ" అన్నాడు ఎంతో సంతోషపడుతూ.

"ఆ బాబా దయవల్ల నీవు ఇంకా ఎంతో ఎదగాలి. నీ మంచి మనసుకు తగినట్లు మంచి భార్య రావాలి" అంది ప్రమీలమ్మ.

తర్వాత సాయిబాబా గుడికెళ్ళాడు శశాంక్. దేవుడి దర్శనం చేసుకొని బయటికొచ్చి కూర్చున్నాడు. మనసు గాలిలో తేలిపోతున్నట్లు అనిపిస్తూంది అతనికి. కనులు తెరిచినా, మూసినా మాధవి రూపమే కనపడసాగింది. దేవుణ్ణి కూడా తననూ మాధవిని ఏ అడ్డంకులూ లేకుండా, ఎవరికీ మనస్తాపం కలగకుండా ఒకటయ్యేలా చూడమని ప్రార్థించాడు.

ఇంతలో అతని దృష్టి గుడిలోకి అడుగు పెడుతున్న సాహితిపై పడింది. ఆమె ఎప్పటిలా అందంగా కనబడుతున్నా మొహంలో ఆనందం లేదనిపించింది అతనికి. 'మోహన్ వచ్చిన రోజు ఆమె మొహంలో కనిపించిన కాంతి ఇప్పుడు కనిపించడంలేదు. చాలా డల్‌గా కనిపిస్తూంది. బహుశా తల్లిదండ్రులను వదిలి వెళ్లాలన్న బాధవల్ల ఉండొచ్చు" అనుకొన్నాడు.

సాహితి శశాంక్‌ను చూసి నవ్వింది. శశాంక్ కూడా నవ్వాడు. ఆమె గుడి లోపలికి వెళ్ళింది. శశాంక్‌ను ఆమె ఇదివరకు ఒకసారి అదే గుడిలో కనబడి తనను చూసి మొహం తిప్పుకొన్న సంఘటన గుర్తుకొచ్చింది. మనసులోనే నవ్వుకొన్నాడు. 'మనం కొంచెం ఓపిక, సహనం చూపితే మనుషులు తామే మారతారు. మన మనుషులు అవుతారు" అనుకొన్నాడు.

సాహితి దేవుడి దర్శనం చేసుకొని వచ్చి శశాంక్ ఎదురుగా కూర్చుంది. ఇదివరకు సాహితి అంటే ఆసక్తి ఉన్నందువల్ల ఆమెను చూసినప్పుడల్లా మనసులో ఏదో అలజడి. అందువల్ల కొంచెం జంకు కలిగేది శశాంక్‌లో. ఈ రోజు అతనికి మాధవి అంతరంగం తెలిసినందువల్ల సాహితిని చూసినా ఎటువంటి అలజడీ కలగడంలేదు. ఆమెతో ఫ్రీగా మాట్లాడాలనిపిస్తూంది.

"అమ్మగారు రాలేదా? " అని అడిగాడు ఆమెని.

"లేదు. పేపర్ కరెక్షన్స్ ఉన్నాయని చెప్పింది. కీర్తన ట్యూషన్‌కెళ్ళింది"

"మీరెందుకో ఈమధ్య డల్‌గా కనిపిస్తున్నారు. బహుశా మీ అమ్మానాన్నలను వదిలి వెళ్తున్నానన్న బాధ మీకు ఉండి ఉండవచ్చు. వాళ్ళను నేను చూసుకొంటాను. మీరు నిశ్చింతగా ఉండండి. మీ పెళ్ళి కాగానే మీ నాన్నగారిని చెన్నై తీసుకెళ్ళి మద్యం మానెయ్యడానికి ట్రీట్‌మెంట్ ఇప్పిస్తాను. ఇటీజ్ మై ప్రామిస్" అన్నాడు.

"నా ఆలోచన అమ్మా నాన్నల గురించి కాదు"

"మరి ఇంకెవరి గురించి అంతగా ఆలోచిస్తున్నారు? "

"ఆయన గురించి"

"మోహన్ గురించా? ఎందుకు? " మనసులోనే భయపడుతూ అడిగాడు.

చెప్పటానికి ఒక క్షణం తటపటాయించింది సాహితి. తర్వాత చెప్పడమే మంచిదన్నట్లు భావించి శశాంక్‌తో "ఆయనకూ తాగుడు అలవాటు ఉన్నట్లుంది. మొన్న రాత్రి ఆయన మాట్లాడుతున్నప్పుడు ఆల్కహాల్ వాసన వచ్చింది. అనుమానం వచ్చి ఆయన బ్యాగ్ తెరచి చూస్తే ఖాళీ బాటిల్ కనిపించింది" అంది.

శశాంక్ ఆలోచిస్తూ ఉండిపోయాడు. 'మోహన్‌కు ఈ అలవాటు కూడా ఉందా? అయితే అతను 'సిగరెట్లు తాగడం మాత్రమే అలవాటు' అని తనతో చెప్పిన మాట అబద్ధం. అంతే కాదు. తన కాబోయే మామగారి తాగుడు గురించి అతను బాధపడింది కూడా నిజం కాదు. అలా నటించాడు. అంతే' అనుకొన్నాడు.

"నాన్న వల్ల అమ్మ పడుతున్న కష్టాలు చూస్తున్నాము. తెలిసి తెలిసి ఓ తాగుబోతును నా జీవితంలోకి ఎలా ఆహ్వానించను? " కన్నీళ్ళతో అంది.

"ఆ విషయం నేను కనుక్కొంటాను. మీరు బాధపడకండి. అప్పుడప్పుడూ తాగే అలవాటుంటే ఫరవాలేదు. అది యీ రోజుల్లో సహజం. అతను తాగుబోతు కానంత వరకూ మీకు భయం లేదు" ఆమెను ఓదార్చడానికి అన్నాడు శశాంక్.

"మానాన్నగారు కూడా మొదట్లో అకేషనల్‌గానే తాగేవారు. క్రమంగా అది వ్యసనంగా మారి మా సంతోషాన్ని, ఆయన ఆరోగ్యాన్ని బలి తీసుకొంటోంది. శశాంక్ గారూ. నేనొక పని చెబుతాను. చేస్తారా? "

"చెప్పండి" ఆశ్చర్యంగా ఆమె వంకే చూస్తూ అన్నాడు.

"మీరు చెన్నై తరచుగా వెళ్తూంటారు కదా. ఈ సారి వెళ్ళినప్పుడు ఆయనతో రెండు రోజులు గడిపి, ఆయన ఎటువంటి వారో కనుక్కొని నాకు చెప్పగలరా?

ప్రారబ్ధం బంధువులను సమకూరుస్తుంది. ఎన్నిక స్నేహితులను ఇస్తుంది. – కాటో

చెన్నైలో మనకు కావలసిన సమాచారం దొరక్కపోతే బెంగుళూరుకు కూడా వెళ్లి రావాలి మీరు".

"నేను రేపే చెన్నై వెళ్తున్నాను. మోహన్‌ను కలసి అతని గురించి తెలుసుకొనే ప్రయత్నం చేస్తాను. ఒకవేళ అతను తాగుబోతే అని, మంచివాడు కాదని తెలిసిందనుకోండి. అప్పుడేం చేస్తారు? కీడెంచి మేలెంచమంటారు కదా? "

"అతన్ని పెళ్ళి చేసుకోను. పెళ్ళి కాన్సిల్ చేయిస్తాను. జీవితాంతం ఒంటరిగానైనా బతుకుతాను కాని ఓ తాగుబోతుకు భార్యను మాత్రం కాలేను" స్థిరంగా అంది సాహితి.

ఆమె జవాబు అతన్ని సంతోషపరిచింది. పెళ్ళి కాన్సిల్ అయితే 'ఎక్కడ సాహితి డిప్రెస్ అవుతుందో' అని భయపడుతున్నాడు శశాంక్. మానసికంగా ఆమె సిద్ధంగా ఉండటం మంచిదనుకొన్నాడు.

"మనం ఊహించినది నిజం కాకూడదనే ఆశిద్దాం. వెళదామా? " లేచి నిలబడి అన్నాడు. సాహితి కూడా లేచింది. ఇద్దరూ నడుస్తూ మాట్లాడుకుంటూ ఇల్లు చేరారు. సాహితికి 'బై' చెప్పి మేడపైకి పోబోతున్న శశాంక్‌ను ప్రమీలమ్మ పిలిచింది.

"ఏమిటమ్మా? " అంటూ హాల్లోకి వెళ్లాడు.

ఆమె తన హేండ్ బ్యాగ్ తెరచి ఓ చెక్కు అతనికిస్తూ "ఈ చెక్కు నా అక్కౌంటులో వేసుకోవాలి. రామకృష్ణకిచ్చి నా అక్కౌంటులో వెయ్యమని చెబుతావా? " అని అడిగాడు.

యాభై వేల చెక్ అది. క్రాస్ చేయబడి ఉంది.

"చెక్కు వెనక మీరు సంతకం చేసి మీ అక్కౌంటు నెంబరు రాయండి" అన్నాడు. ఆవిడ అతను చెప్పినట్లు చేసి "పి.ఎఫ్. లోను తీసుకొన్నాను. అల్లుడుగారికి పంపాలి కదా" అంది చెక్కు అతని చేతికిస్తూ.

శశాంక్‌కు ఆవిడ కూతురి పెళ్ళికి కట్నం ఎంత ఇస్తోందో తెలుసుకోవాలని చాలా సార్లు అనుకొన్నా సంస్కారం అడ్డొచ్చి అడగలేదు. కాని ఇప్పుడు యాభై వేలు మోహన్ చేతికి పోతూందని తెలిసి అడగకుండా ఉండలేకపోయాడు.

"మోహన్ కట్నం తీసుకొంటున్నారా? " ఆశ్చర్యం నటిస్తూ అన్నాడు.

"అవును" 'అది సాధారణమైన విషయమే కదా' అన్నట్టు చూచింది ప్రమీలమ్మ.

"ఎంతకు ఒప్పుకొన్నారు? "

"రెండు లక్షలు కేష్‌గా కావాలన్నారు. నగలు మన ఇష్టం. పెళ్ళి కూడా మనకెంతలో వీలైతే అంతలోనే చేయమన్నారు. నిశ్చితార్థం రోజు యాభై వేలిచ్చాము. రేపు ఈ యాభై పంపాలి. అన్నట్టు నాకు మోహన్ పేరు మీద డ్రాఫ్టు కూడా కావాలి శశాంక్"

'రెండు లక్షలు! ఎంత ఫూలిష్‌గా ప్రవర్తిస్తారు వీళ్ళు. ఇరవై ఏళ్లు కంటికి రెప్పలా చూసుకొన్న కూతుర్ని మరో వ్యక్తి చేతిలో పెడుతున్నప్పుడు అతను ఎలాంటి వాడు అని తెలుసుకోవడానికి కనీసం రెండు రోజులు వెచ్చించరు. ఆవిడకు నెలంతా కష్టపడితే ఇరవై వేలు వస్తుందేమో. ఓ ఏడాది కష్టార్జితం ఓ హంతకుడి చేతిలో పోసి, పైగా తన కూతుర్ని కూడా అతని చేతిలో పెడుతూంది. వీళ్లు ఎప్పుడు మారుతారో' అనుకొన్నాడు.

"డ్రాఫ్టు నేను తీసుకొస్తానులెండి. రేపు నేను చెన్నై వెళ్తున్నాను. రాగానే మీ బ్యాంకు పని చేసి పెడతాను"

"రేపే వెళ్తున్నావా? చెక్కు కాస్త ముందు వచ్చి ఉంటే డ్రాఫ్టు నీతోనే అల్లుడికి పంపేదాన్ని".

"ఫర్వాలేదులెండి. డ్రాఫ్టు క్రాస్ చేసి కొరియర్‌లో పంపిద్దాం"

"అల్లుడుగారిని కలుస్తున్నావా? "

"అవును. వస్తాను. గుడ్‌నైట్" అంటూ కదలబోయాడు.

"ఉండండి. అమ్మా. శశాంక్‌గారికి పాయసం యిచ్చావా?" అని అడిగింది సాహితి. "చూశావా? మాటల్లో పడి మర్చి పోయాను. నీ పుట్టిన రోజు కదా. నీకిష్ట మని సేమియా పాయసం చేశాను. కూర్చో తిని వెళుదువుగాని" అంటూ కప్పులో వేసి ఇచ్చింది.

శశాంక్‌కు కళ్లలో నీరు తిరిగింది వాళ్ళ అభిమానానికి.

"ఎందుకండీ యింత శ్రమ తీసుకుం టారు?" అన్నాడు.

"ఇందులో శ్రమేం ఉంది శశాంక్. పది నిమిషాల పని అది. నీవు యీ రోజు చిత్తూరులో ఉండి ఉంటే మీ అమ్మగారు పాయసం చేసి ఉండే వారు కదా? అప్పుడు యిలాగే మీ అమ్మతో మాట్లాడే వాడివా?"

"అవును. మాట్లాడేవాణ్ణి కాను. ఇక్కడ కూడా అలా మాట్లాడను" అన్నాడు కళ్ళలో నీళ్లు తుడుచుకుంటూ.

తర్వాత మేడపైకి వచ్చి కాసేపు కూర్చుని ఆలోచిస్తూ ఉండిపోయాడు. 'ఆ యాభై వేలు మోహన్‌కు పంపేలోగా అతని గురించి పూర్తిగా తెలుసుకోవాలి. అందుకు తను చేయవలసినది రాత్రి యిక్కడే కూర్చుని ప్లాన్ చేసుకోవాలి. రెండు రోజులు ఆలస్యమయినా చెన్నైలోనే ఉండి తన అను మానాలు నివృత్తి చేసుకోవాలి. ఇకపై యీ భయాలకు, సంఘర్షణలకు స్వస్తి చెప్పాలి. తను మునుపటి శశాంక్ కావాలి' అనుకొ న్నాడు.

లేచి నిలబడి టైము చూశాడు. ఎనిమిద యింది. రేపు ఎటూ ఊర్లో ఉండడు కాబట్టి యిప్పుడెళ్ళి కొంతమంది డాక్టర్లను కలవడం మంచిది. చివరగా డాక్టర్ మాధవిని కల వాలి. సాయంత్రం తనకు ఫోన్ చేసి యీ రోజు తనను పర్సనల్‌గా ఒకసారి కలవా లని ఉందని చెప్పింది. ఆమె చిన్న కోరిక తీర్చడం తన కనీస ధర్మం అనుకొంటూ డ్యూటీకి వెళ్లడానికి సిద్ధమవసాగాడు శశాంక్.

★ ★ ★

చెన్నైలో రామకృష్ణ కొనవలసిన వస్తువు లన్నీ కొన్నాక తనకు వేరొక పనుందని, వెళ్తానని చెప్పాడు శశాంక్.

"నేను యీ రాత్రి మా పిన్నివాళ్ళింట్లో ఉండి ఉదయం బయలుదేరి నెల్లూరు వెళ తాను. నీవూ రాకూడదూ మా పిన్ని యింటికి" అన్నాడు రామకృష్ణ.

"ఇంకోసారి వస్తాలే. నాకు చాలా పనులు న్నాయి యిప్పుడు"

"మోహన్ విషయం లోనా"

అవునన్నట్టు తలూపాడు శశాంక్.

"జాగ్రత్త శశాంక్. నీవు వీటిల్లో తలదూ ర్చడం నాకిష్టం లేదు. నువ్వు చెప్పినవన్నీ విన్నాక నీవు చాలా సాహసం చేస్తున్నా వేమో అనిపిస్తూంది నాకు. హసీనా మోహన్ను హంతకుడిగా గుర్తించిందని చెప్పావు కదా. నీవు ప్రమీలమ్మతో చెప్పి పెళ్ళి కాన్సిల్ చేయించెయ్. నీకు కావల సింది సాహితి జీవితం బాగుండటం. అంతే కదా. ఇంకా ఏం తెలుసుకోవాలనుకొంటు న్నావ్?"

"మోహన్ హంతకుడని యింకా పూర్తిగా నిర్ధారణ కాలేదు. హసీనా ఎవరి ఒత్తిడి వల్లనైనా అలా చెప్పి ఉండవచ్చు కదా. అందువల్ల హసీనాను యింకోసారి కలవాల నుకొంటున్నాను. రెండు రోజులు ఆలస్యమ యినా సరే యిక్కడే ఉండి అన్ని అనుమా నాలు తీర్చుకొని వస్తాను" అన్నాడు శశాంక్.

రామకృష్ణ శశాంక్ వైపు ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు. 'సాహితి అతనికి

జీవించినంత కాలం ఎలా జీవించాలన్న పాఠాన్ని నేర్చుకుంటూ వుండు.
– న్యూకంబర్



తోబుట్టువు కాదు, బంధువు కాదు. అయినా ఆమె గురించి ఎంత తపన ఇతనికి? ఆమె కోసం ఎటువంటి సాహసమైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇలా నిస్వార్థంగా ఎదుటి మనిషి శ్రేయస్సు కోసం తపించే వాళ్ళు నిజంగా గొప్పవాళ్లు' అనుకొన్నాడు.

"నా మొహంలో సంధ్య రూపం కనిపిస్తూందా ఏమిటి? అంత ఆరాధనగా చూస్తున్నావ్" అన్నాడు శశాంక్ నవ్వుతూ.

సంధ్య ప్రస్తావన రాగానే రామకృష్ణ ముఖం వెలిగింది.

"సంధ్య దూరంగా ఉన్నప్పుడు ఆమెను గుర్తుచేయడం ఎంత తప్పో తెలుసా? " అన్నాడు రామకృష్ణ.

"నేను గుర్తు చెయ్యకపోతే నీకు గుర్తే రానట్లు" అన్నాడు శశాంక్.

తర్వాత రామకృష్ణ ఆటోలో తన పిన్ని ఇంటికి వెళ్లాడు. శశాంక్ ఉదయ్ సెల్‌కు ఫోన్ చేసి తను అతని దగ్గరికి వస్తున్నానని చెప్పాడు. ఉదయ్ తన యింటి దగ్గరికే రమ్మని చెప్పడంతో ఆటో ఎక్కి "అడయార్‌కు పోనివ్వు" అన్నాడు.

★ ★ ★

ఉదయ్ తన యింటి ముందు నిలబడి శశాంక్ కోసం ఎదురుచూస్తున్నాడు. శశాంక్ ఆటో దిగగానే దగ్గరికొచ్చి "హలో" అన్నాడు. శశాంక్ ఆటో అతనికి డబ్బులిచ్చి పంపేసి "ఎక్కడికైనా బయలుదేరుతున్నారా? " అని అడిగాడు.

"లేదు. మీ కోసమే చూస్తున్నాను. మౌంట్ రోడ్డులో కాస్త పనుంది. కానీ దానికేం అర్జెంటు లేదు. ఏదైనా హోటలు కెళ్లి టిఫిన్ తింటూ మాట్లాడుకొందాం" అంటూ మోటర్ బైక్ స్టార్ట్ చేశాడు. శశాంక్ అతని వెనుక కూర్చున్నాడు.

పదిహేను నిమిషాల డ్రైవ్ తర్వాత నూంగంబాక్కంలోని ఓ హోటల్ ముందు

బైక్ ఆపాడు ఉదయ్.

హోటల్‌లో కూర్చున్నాక టిఫిన్ ఆర్డర్ చేసి, శశాంక్ వైపు తిరిగి "ఆ రోజు రైల్వేస్టేషన్ నుంచి ఫోన్ చేసి హసీనా మోహన్‌ను గుర్తించిందని మీరు చెప్పగానే ఎంతో ఎగ్జైటెట్ అయ్యాను. మీ పని చాలా చక్కగా పూర్తిచేశారు. సాహితి పెళ్లి ఆపు చేయించారా? " అని అడిగాడు.

"ఆపు చేయించాలనే యిక్కడి నుంచి బయలుదేరి వెళ్లాను. హసీనాను ఎవరైనా భయపెట్టి, బెదిరించి నేను చూపిన ఫోటోను గుర్తించమని చెప్పి ఉంటే, ఆవిడ ఆ విధంగానే చేసి ఉంటే అనవసరంగా పెళ్లి చెడగొట్టినట్లవుతుంది కదా' అన్నారు మాధవిగారు. నాకూ ఆ మాట నిజమే అనిపించింది. పైగా మొన్న మోహన్ నెల్లూరు వచ్చాడు. అతని ప్రవర్తన, మాటలూ చూస్తే మంచివాడిలాగే అనిపించాడు. కానీ మళ్లీ అనుమానం వచ్చేలా రెండుసార్లు ప్రవర్తించాడు" అంటూ మోహన్ పాడైపోయాయని చెప్పిన ఫోటోలు తెచ్చివ్వడం, అతని బ్యాగ్‌లో ఖాళీ బాటిల్ కనిపించడం గురించి చెప్పాడు.

"తాగడం గురించి అంత పట్టించుకోనక్కరలేదు. ఈ రోజుల్లో అది సహజం. ఇక పోతే ఫోటోల విషయంలో కూడా అతను నిజమే చెప్పి ఉండొచ్చు. మీకు మోహన్‌పై అనుమానం రాకుండా ఉంటే ఫోటోల విషయం మీరు నమ్మేవారా కాదా చెప్పండి"

"అవును. అనుమానం అంటూ వచ్చిందంటే యిక ఏ విషయంలోనూ నమ్మబుద్ధేయదు, అతను నిజం చెప్పినా కూడా"

"కాబట్టి ఆ రెండు పాయింట్లు మనం యిగ్నోర్ చెయ్యవచ్చు. మాధవక్కకు వచ్చిన అనుమానం గురించి మనం ఆలోచించాలి. రేపు మనం హసీనా ఇంటికెళ్లి మాట్లాడుదాం" అన్నాడు ఉదయ్.

"ఇంకో విషయం కూడా నేను ఆలోచిస్తున్నాను. నాకు మోహన్‌పై అనుమానం అంటూ మొదలైంది. స్వప్నతో అతను కలిసి ఉన్న ఫోటో చూసి. అసలే కూతురు పోయిన దుఃఖంతో ఉన్న స్వప్న తల్లిని ఆ ఫోటో గురించి అడగలేకపోయాను. కాని స్వప్న చెల్లెళ్లను అడిగితే జవాబు దొరుకుతుంది కదా అనిపించింది, ఒక్కోసారి తల్లితో చెప్పని విషయాలు తోబుట్టువులతో పంచుకొంటారు ఆడపిల్లలు".

ఉదయ్ ఒక్క క్షణం ఆలోచించి "ఆ పని చేయడం కంటే ముందు హసీనాతో నిజం రాబట్టడమే మంచిదనిపిస్తూంది. మోహన్‌కు ఆ హత్యతో సంబంధం ఉందా లేదా అన్న విషయమే కదా మనకు కావల్సింది" అన్నాడు.

"హసీనాను రేపు ఉదయం కలుద్దామనుకొంటున్నాను. ఇప్పుడెలాగూ నేను ఫ్రీయే కాబట్టి వెళ్దామనుకొంటున్నాను."

బేరర్ వస్తే కాఫీలు తెమ్మన్నాడు ఉదయ్.

శశాంక్ లేచి చేయి కడుక్కొని వచ్చేసరికి ఉదయ్ సీట్లో కనిపించలేదు. తర్వాత కాస్త దూరంలో సెల్‌లో మాట్లాడుతూ కనిపించాడు. శశాంక్ కాఫీ అందుకొని సిప్ చేస్తుంటే ఉదయ్ వచ్చాడు.

"సారీ, ఫ్రెండ్ ఫోన్ చేశాడు" అంటూ కాఫీ కప్పు అందుకొన్నాడు.

కాఫీ త్రాగి బిల్లు చెల్లించాక "పదండి మిమ్మల్ని స్వప్న యింటి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు ఉదయ్.

"నేను ఆటోలో వెళ్తాను లెండి. మీరు మౌంట్ రోడ్ వైపు వెళ్లాలన్నారు కదా. మళ్లీ అంత దూరం వెనక్కు రావడం ఎందుకు? రేపు ఉదయం మీకు ఫోన్ చేసి మీ ఇంటికి వస్తాను. ఇద్దరం కలసి హసీనా ఇంటికి వెళ్దాం"

"అలాగే. ఆల్ ది బెస్ట్".

ఉదయ్ వెళ్లిపోయాడు. ఖాళీగా వెళ్తున్న ఆటో ఆపి శశాంక్ అందులో ఎక్కాడు.

★ ★ ★

శశాంక్ స్వప్న ఇంటిలోకి అడుగుపెట్ట

గానే ఇద్దరు అమ్మాయిలు సోఫాలో కూర్చుని టీవీ చూస్తూ కనిపించారు. శశాం క్‌ను చూసిన వెంటనే లేచి నిలబడి ఎవరు కావాలన్నట్టు చూశారు.

"డాక్టర్ మాధవి స్నేహితుడిని. నెల్లూరు నుంచి వచ్చాను" అన్నాడు శశాంక్.

"రండి కూర్చోండి. మీరు ఇదివరకు మా ఇంటికి ఒకసారి వచ్చారని అమ్మ చెప్పింది" వాళ్లిద్దరిలో కాస్త పెద్దగా ఉన్న అమ్మాయి అంది.

శశాంక్ సోఫాలో కూర్చున్నాక వాళ్లిద్దరినీ పరిశీలనగా చూశాడు. స్వప్న పోలికలు బాగా ఉన్నాయి వాళ్లిద్దరిలో. వాళ్ల మొహాల్లో భయం, దిగులు కనిపించింది. తమ అక్క మరణాన్ని వాళ్లు ఇంకా మరచి పోలేదని, తన రాక వాళ్ల అక్క లేదన్న విషయం వాళ్లకు మరోసారి గుర్తుచేసిందని అనుకొన్నాడు.

"మీ అమ్మగారు లేరా?"

"లేదు. గుడికెళ్లింది"

"ఆవిడ ఇప్పుడు ఇంట్లో లేకుండా ఉండ టమే తనకు కావలసింది" అనుకొన్నాడు.

వాళ్లిద్దరిలో పెద్దగా ఉన్న అమ్మాయే అత నితో మాట్లాడుతోంది. రెండో అమ్మాయి టీవీ చూస్తూ, మధ్యమధ్యలో శశాంక్‌ను చూడసాగింది.

శశాంక్ తన జేబులోని ఫోటో తీసుకొని ఆ అమ్మాయికి చూపిస్తూ "ఇతనెవరో చెప్ప గలరా మీరు?" అన్నాడు.

ఆ అమ్మాయి కళ్లు ఆశ్చర్యంతో వెడల్పు య్యాయి.

"ఈ ఫోటో మీ చేతికెలా వచ్చింది?"

"మీ అక్కయ్య పాస్‌బుక్‌లో దాచి ఉంచింది. చెప్పండి. ఎవరితను?" అని ఆత్రంగా ఆమె జవాబు కోసం ఎదురు చూడసాగాడు.

"అతను మా అన్నయ్య. మా పెదనాన్న కొడుకు"

"అన్నయ్యా?" అంటూ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు శశాంక్.

"మరి స్వప్నగారు ఆ ఫోటోను అంత రహస్యంగా దాచవలసిన అవసరమే ముంది?" అని అడిగాడు.

"అదంతా ఓ పెద్ద కథ".

"చెప్పండి పరవాలేదు."

"మా నాన్నగారికి, పెదనాన్నగారికి ఆస్తి విషయంలో గొడవలు వచ్చాయి. కోర్టులో పెదనాన్నగారే గెలిచారు. మాకు నయా పైసా కూడా రాలేదు. అప్పట్నించీ ఆ ఇంటి మీది కాకి ఈ ఇంటి మీద వాలకూడదని మా నాన్న చెప్పారు. అయితే మేమూ, మోహన్ చిన్నప్పటి నుంచీ కలసిమెలసి ఆడుకొన్నవాళ్లము. మా యింట్లో మగ పిల్లవాడు లేడు కనుక మోహన్ అంటే మాకు ప్రాణం. అందుకే మోహన్ చెన్నై వచ్చినప్పుడల్లా మేం ముగ్గురం ఎక్కడో ఒక చోట అతన్ని కలిసేవాళ్లం. మా నాన్నగారు పోయాక అమ్మ కూడా అదే రూలు పెట్టింది. అందుకే అక్కయ్య ఆ ఫోటోను అంత రహస్యంగా దాచి ఉంటుంది."

చిన్నమ్మాయి టీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

"మా అమ్మకు మాత్రం మోహన్ ఫోటో చూపడం కాని, అతని విషయం అడగడం కాని చెయ్యొద్దు. ఆవిడని మేము మోసం చేశామని బాధపడుతుంది" అంది ఆ అమ్మాయి.

"అలాగే. మీ అన్నయ్యకు పెళ్లయిందా?"

"నిశ్చితార్థం అయిందని ఫోన్‌చేసి చెప్పాడు. నెల్లూరు అమ్మాయిట. ఈ మధ్యలో అతన్ని కలవలేదు. అక్క పోయిన దుఃఖంతో మేము కాలేజీకి తప్ప ఇంకెక్క డికీ వెళ్లటం లేదు".

"మీకు మదన్ అన్న వ్యక్తి తెలుసా?"

ఆ అమ్మాయి పెదవి విరిచి "తెలీదు" అంది.

"మీ అక్కగారు ఎవరినన్నా ప్రేమిం చారా?"

ఆ అమ్మాయి కోపంతో లేచి నిలబడి

"ప్రేమిస్తే మీకెందుకు? ప్రేమించకపోతే మీకెందుకు? అసలు ఎవరు చెయ్యమన్నారు యీ సి.బి.ఐ. పనులు మిమ్మల్ని? అసలే అక్క పోయిన బాధలో మేముంటే మీ ప్రశ్నలతో మమ్మల్ని కూడా చంపేస్తారా? " అంది.

"ఐ యామ్ సారీ. మిమ్మల్నిక ఇబ్బంది పెట్టను. వస్తాను" అంటూ బయటకు నడిచాడు.

"ఆగండి. మీరు అక్కయ్య విషయంలో ఎలాంటి ఎంక్వయిరీలు చేసినా ముందు నేను మీ గురించి పోలీసులకు రిపోర్ట్ చేస్తాను" అంది కఠినంగా.

శశాంక్‌కు ఎంతో అవమానంగా అనిపించింది ఆమె అలా మాట్లాడుతుంటే. అతనికి బుద్ధి తెలిసి ఎవరితోనూ అలా మాటలు పడలేదు. ఆమెతో ఏదో చెప్పబోయి, మళ్లీ మానుకొని బయటకు నడిచాడు.

అతను వచ్చిన ఆటో అక్కడే నిలబడి ఉంది. అతను కాసేపు ఉండమని ఆటో డ్రైవర్‌తో చెప్పాడు కనుక ఆటో ఎక్కి "మైలాపూర్" అన్నాడు.

★ ★ ★

శశాంక్ బావ రమేష్ సెంకడ్‌షో ప్రోగ్రాం వేశాడు. నీరజ తను రానని చెప్పడంతో శశాంక్, రమేష్ బయలుదేరారు. ముందుగా బయటికొచ్చిన శశాంక్ రమేష్ కోసం ఎదురు చూస్తూ నిల్చున్నాడు. అతనికి ఒకసారి మోహన్‌తో మాట్లాడాలనిపించింది. సెల్ ఆన్ చేసి మోహన్ నెంబరు నొక్కాడు. అవతలిప్రక్క రింగవడం వినిపిస్తోంది.

"హలో" మోహన్ గొంతు వినిపించింది.

"హలో మోహన్‌గారు, నేను శశాంక్‌ని"

"నెంబరు చూసి అనుకున్నాను. ఎక్కడ్నించి"

"మైలాపూర్ నుంచి"

"నా గదికి రండి మాట్లాడు కొందాము"

"ఇప్పుడా? తొమ్మిదవుతోంది టైము"

"అయితే ఏం? సిటీ నిద్రపోదు"

"కుదరదు లెండి. మేం సెకండ్ షో సినిమాకెళుతున్నాం"

"ఏ సినిమా? " చెప్పాడు శశాంక్.

'నేను చూశాను. బాగుంది. వెళ్లిరండి. రేపు ఉదయం వస్తారా? "

"ప్రయత్నిస్తాను. ఏ విషయం మీకు ఫోన్ చేసి చెబుతాను. బై" అంటూ సెల్ ఆఫ్ చేశాడు. రమేష్ రావడంతో ఇద్దరూ రమేష్ స్కూటర్‌పై బయలుదేరారు.

★ ★ ★

ఇంటర్వెల్‌లో టాయిలెట్ వైపు నడుస్తున్న శశాంక్‌కు స్నేహితులతో మాట్లాడుతున్న ఉదయ్ కనిపించాడు. ఉదయ్ శశాంక్‌ని చూసి ఆశ్చర్యపోయాడు. శశాంక్ దగ్గరికి వచ్చి "మీరు సినిమాకు వెళ్తున్నట్టు సాయంత్రం నాకు చెప్పలేదే" అన్నాడు.

"అప్పటికి నాకూ తెలియదు. మా బావగారు ప్రపోజ్ చేయటంతో సరేనన్నాను"

"ఆయన ఏరీ? "

"లోపలికి వెళ్లారు. అన్నట్లు మీకొక షాకింగ్ న్యూస్."

'ఏమిటది? " కుతూహలంగా చూస్తూ అడిగాడు.

"సాయంత్రం స్వప్న ఇంటికి వెళ్లాను కదా. అక్కడ నాకొక క్రొత్త విషయం తెలిసింది. మోహన్ స్వప్నకు కజిన్ అట" అంటూ స్వప్న చెల్లెలు తనతో చెప్పినదంతా ఉదయ్‌కు చెప్పాడు.

"వెరీ ఇంటరెస్టింగ్. సో మీ అనుమానితుల లిస్ట్‌లో నుంచి మోహన్ పేరు తొలగించెయ్యవచ్చు మీరు"

"అవును. ఆ పని హసీనాతో మాట్లాడాక

అంతా పోయిందని అనిపించినప్పుడు భవిష్యత్తు ఉందన్న విషయాన్ని గుర్తుంచుకోండి. – లిజెట్టీ

చేస్తాను. మీరు రేపు ఉదయం తొమ్మిది గంటలకు రెడీగా ఉండండి."

"అలాగే. సినిమా మొదలైనట్టుంది. నేను లోపలికి వెళతాను."

"మీరు వెళ్లండి" అంటూ టాయిలెట్ వైపు నడిచాడు. అక్కడ తన పని ముగించుకొని వస్తూంటే ఎవరో తన వెనకే ఉన్నట్లు అనుమానం వచ్చింది అతనికి. గబుక్కున వెనక్కి తిరిగి చూశాడు. ఎవరూ లేరు. కాని టాయిలెట్‌లోనే యింకో వ్యక్తి ఉన్నట్లు అతని సిక్స్‌సెన్స్ చెబుతూంది. సినిమా మొదలు పెట్టేయడంతో కనుచూపు మేరలో ఎవరూ లేరు. హాలు లోపలికి వెళ్లాలంటే కనీసం యిరవై అడుగులు నడవాలి. ఈలోపల అతను తన మీదికి దాడికి దిగితే? ఇంతకూ లోపల ఉన్నది ఒక్కరా? ఇద్దరా?

టాయిలెట్ వైపు ముఖం పెట్టి వెనక్కి నడవసాగాడు అతన్ని ఎవరూ వెనుకనుంచి దెబ్బతీయకుండా.

అయితే దెబ్బ అతను ఊహించిన వైపు నుంచి రాలేదు. వెనుక నుంచి అతని తలపై పడింది దెబ్బ.

"అమ్మా" అంటూ కుప్పకూలిపోయాడు శశాంక్.

★ ★ ★

కాలింగ్‌బెల్ శబ్దం విన్న నీరజ తలుపు తెరిచి తలకు కట్టుతో నిలబడి ఉన్న శశాంక్‌ను చూసి భయపడిపోయింది. "ఏమైందిరా?" అంటూ ఏడవబోతున్న ఆమెను రమేష్ కళ్లతోనే వారించాడు. రమేష్, ఉదయ్‌లిద్దరూ చెరోవైపు శశాంక్‌ను పట్టుకుని నడిపించుకొంటూ వచ్చి మంచంపై పడుకోబెట్టారు.

"శశాంక్. హౌఆర్ యు నౌ" ఉదయ్ అడిగాడు.

ఫర్వాలేదన్నట్టు తల ఊపాడు శశాంక్.

"రమేష్‌గారూ. నేను వెళ్లి వస్తాను. మళ్లీ రేపు ఉదయం వస్తాను. ఆయన్ను జాగ్రత్తగా చూసుకోండి" అని చెప్పి ఉదయ్ వెళ్లిపోయాడు.

శశాంక్‌కు దుప్పటి కప్పి, అతను నిద్రపోవడం చూసి హాల్లోకి వచ్చాడు రమేష్. సోఫాలో కళ్లనీళ్లతో కూర్చుని ఉంది నీరజ.

"అసలేం జరిగిందండీ? నేను మంచి నిద్రలో ఉన్నా 'మీరిద్దరూ ఇంకా రాలేదే' అన్న ఆలోచనతో మధ్య మధ్య లేచి టైం చూస్తూఉన్నాను. మూడు గంటలైనా మీరు రాకపోయేసరికి నాలో భయం మొదలైంది. కాలింగ్ శబ్దం విని నా ప్రాణం లేచి వచ్చింది. మీ గొంతు విని తలుపు తెరిచాను. తీరా చూస్తే వీడిలా..." అంటూ ఏడవసాగింది.

"ఏం కాలేదు. ఏడవకు. ఇంటర్వెల్‌లో టాయిలెట్‌కు వెళ్లివస్తానని వెళ్లాడు. సినిమా మొదలుపెట్టేయడంతో నేను హాల్లోకి వెళ్లి కూర్చున్నాను. ఇతను ఎంతసేపటికీ రాకపోవడంతో నేను అనుమానంతో లేచి బయటకు నడిచాను. నాతోపాటు, ఇందాక వచ్చాడే ఉదయ్ అని, ఆయన లేచి బయటకు వచ్చాడు. నన్ను చూసి "మీరు శశాంక్ బావగారా?" అని అడిగాడు. అవునన్నాను. "శశాంక్ కోసమే నేనూ వెళుతున్నాను. హర్రియప్" అంటూ పరుగెత్తాడు. నేనూ పరిగెత్తాను. మేం వెళ్లేసరికి శశాంక్ టాయిలెట్‌లో కిందపడిపోయి ఉన్నాడు.

ఏం జరిగి ఉంటుందో మాకర్థం కాలేదు. వెంటనే ఆటోలో కిరణ్ నర్సింగ్ హోంకు తీసుకెళ్లాము. డాక్టర్ మాధవన్ డ్యూటీలో ఉన్నారు. మొదట పోలీసు కేసవుతుందేమో నన్న భయంతో ట్రీట్‌మెంట్ యివ్వడానికి వెనుకాడారు. తర్వాత నన్ను చూసి ట్రీట్‌మెంట్ యిచ్చారు. కొద్దిసేపట్లోనే శశాంక్ స్పృహలోకి వచ్చాడు. తలపై ఎవరో కొట్టారని చెప్పాడు. అయితే దెబ్బ గట్టిగా తగల్లేదు. కొద్దిగా చిట్లి రక్తం వచ్చింది అంతే. కట్టుకట్టి పంపేశారు. తలకు తగిలిన గాయం కన్నా ఎక్కువగా భయపడటం వల్ల, దెబ్బ పడగానే షాకవడం వల్ల స్పృహ తప్పి పడిపోయాడని, దెబ్బ చాలా చిన్నదని డాక్టరు చెప్పారు"

"ఎవరు కొట్టి ఉంటారు వాణ్ణి? వాడి వాచీ, పర్సు అన్నీ ఉన్నాయా?"

"అనీ ఉన్నాయి. డబ్బు కోసం అతన్ని కొట్టలేదు. అతను థియేటర్‌కు వస్తాడని ముందే తెలుసుకొని అతని కోసం కాచుకొని దెబ్బతీశారని నాకు అనిపిస్తుంది. అసలు శశాంక్ యిదివరకు ఉన్నంత ఉల్లాసంగా ఉండటం లేదు. దేని గురించో ఆలోచిస్తూ ఉంటాడు. ఇంత తక్కువ గ్యాప్‌లో ఇన్ని సార్లు చెన్నైకి రావడం కూడా ఆశ్చర్యంగా ఉంది"

"నాకెందుకో భయంగా ఉందండీ. వాడు ఎందులోనూ ఇరుక్కొని ఉండడు కదా?"

"భయమెందుకు? నాకు తెలిసి శశాంక్ ఎటువంటి గొడవల్లోనూ తల దూర్చే రకం కాదు. రేపు ఉదయం నేను మాట్లాడి విషయం కనుక్కొంటాను. నువ్వు వర్రీ కాకు. పడుకో"

భర్త ధైర్యం చెప్పాక నిశ్చింతగా పడుకొంది నీరజ. రమేష్ శశాంక్ పడుకొన్న గదిలోనే చాప వేసుకొని పడుకొన్నాడు.

★ ★ ★

మరుసటి రోజు ఉదయం ఎనిమిది గంటలకు శశాంక్‌ను చూడటానికి ఉదయ్ వచ్చాడు శశాంక్ సోఫాలో కూర్చుని పేపరు చదువుతున్నాడు. ఉదయ్‌ను చూచి 'రండి' అన్నాడు పేపరు మడచి టీపాయ్ మీద పెడుతూ.

"నిన్న జరిగిన సంఘటన పేపర్లో వచ్చిందేమోనని వెతుకుతున్నారా?" అన్నాడు ఉదయ్ తమాషాగా.

"మీరు నన్ను అక్కడే వదిలేసి వచ్చేసుంటే పేపర్లో వచ్చేది. నాకు ఆ అదృష్టం లేకుండా చేశారు కదా" అన్నాడు తనూ తమాషా చేస్తూ.

"నిన్న మిమ్మల్ని ఇంట్లో వదిలేసి వెళ్లాను కదా. పడుకొన్నా నిద్రే పట్టలేదు నాకు. మీరు ఎక్కడ షాకయ్యారో, ఎప్పుడు రికవరీ అవుతారో అన్న ఆందోళన నాలో ఉండింది. మీరు పేపరు చదువుతూ, కనిపించగానే ఎంతో రిలాక్స్‌డ్‌గా ఫీలయ్యాను."

"మిమ్మల్నందరినీ ఇబ్బంది పెట్టినట్లున్నాను" సిగ్గుపడుతూ అన్నాడు శశాంక్.

"ఇబ్బందేం లేదు. అదృష్టం బాగుంది వాళ్లు దుడ్డుకర్రతో గాని, గడ్డపారతోగాని కొట్టలేదు. వెదురుకర్రతో కొట్టినట్టున్నారు. అందువల్లే మీరు ఇప్పుడు నాతో మాట్లాడగలుగుతున్నారు."

"అవును. దెబ్బ పడగానే నన్ను చంపేస్తారేమోనన్న భయంతో షాకయి ఉంటాను. నేను కింద పడిపోయాక వాళ్లకు నన్ను చంపే అవకాశం, సమయం ఉన్నా ఎందుకో ఆ పని చెయ్యలేదు వాళ్లు" అన్నాడు శశాంక్.

"దీన్ని బట్టి మనం తెలుసుకోవాల్సిన విషయం ఏమిటంటే వాళ్లు మిమ్మల్ని చంపాలని అనుకోవడం లేదు. బెదిరించి, భయపెట్టి మిమ్మల్ని వెనక్కు పంపాలని వాళ్ల ఉద్దేశ్యం అయి ఉంటుంది. కాని నా అనుమానం ఏమిటంటే మీరు సినిమాకు వస్తారని వాళ్లకెలా తెలుసు?"

"నేను సినిమాకు బయలుదేరేముందు మోహన్‌కు ఫోన్ చేసి సినిమాకి వెళ్తున్న విషయం చెప్పాను."

"మోహన్ విషయం ఇక వదిలెయ్యమన్నాను కదా. జరిగే సంఘటనలతో అతనికి సంబంధం లేకపోవచ్చు. ముఖ్యంగా స్వప్న మరణానికి అతను కారణం కాదు. మీరన్నట్లు హసీనాను ఎవరైనా బెదిరించి ఉంటే ఆమె మోహన్‌ను హంతకుడిగా గుర్తించి ఉండవచ్చు. మోహన్ కాకుండా మిమ్మల్ని కొట్టవలసిన అవసరం ఎవరికైనా ఉందా? "

శశాంక్‌కు కూడా ఎవరు కొట్టి ఉంటారో తోచలేదు.

"నేను ముందే చెప్పాను ఇది చాలా ప్రమాదకరమైన గ్యాంగ్ అని. మనం హసీనా ఇంటికి వెళ్లడం లేదు. మీరు హసీనా ఇంటికి వెళ్లడం యీ గ్యాంగ్‌కు సంబంధించిన వాళ్లు చూసి ఉంటారు. నిన్న మీరు సినిమా హాల్లో కనిపించగానే గుర్తుపట్టి భయపెట్టడానికి కొట్టి ఉంటారు. ముందే సిద్ధంగా లేరు కాబట్టి తమకు దొరికిన వెదురు కర్రతో మిమ్మల్ని కొట్టారు."

"నిజమే. ఈ పని ఆ గ్యాంగ్‌కు సంబంధించిన వాళ్ల పనే అయి ఉంటుంది."

"సరే. జరిగినదేదో జరిగిపోయింది. ఇంకోసారి మీరు కనిపిస్తే ఒక్క దెబ్బతోనే సరిపుచ్చుతారని నే అనుకోను. నా మాట విని మీరు నెల్లూరు వెళ్లిపోండి. ఇక వీళ్ల విషయాల్లో తల దూర్చకండి. నాకు కావలసింది మీ క్షేమం. మాధవి అక్క ఎంతో నమ్మకంతో మిమ్మల్ని నా దగ్గరికి పంపింది. మీకేదైనా అయితే ఆమెకు నేను మొహం చూపించలేను" అన్నాడు ఉదయ్.

"ఒకసారి హసీనా దగ్గరికెళ్లి నా అనుమానం తీర్చుకొన్నాక నెల్లూరు వెళ్లిపోతాను."

"ఇంత జరిగినా, ఇంత చెప్పినా మీరు మీ పట్టు విడవడం లేదు."

"హసీనాను కలవకుండా నేను నెల్లూరు వెళ్లినా మనశ్శాంతిగా ఉండలేను. ప్లీజ్. ఈ ఒక్కపని నన్ను చెయ్యనివ్వండి" అర్థింపుగా అన్నాడు శశాంక్.

ఉదయ్ ఆశ్చర్యంగా శశాంక్ వైపు చూశాడు. 'ఏమిటి ఇతని తత్వం? అన్నిట్లో తల దూరుస్తాడు. భయపడతాడు. షాక్ తింటాడు. దెబ్బలు కూడా తింటాడు. మళ్లీ తన పరిశోధన మాననంటాడు' అనుకొన్నాడు. తన మాట విననందుకు శశాంక్‌పై కోపం కూడా వచ్చింది అతనికి.

"అలాగే కానివ్వండి. హసీనా ఎవరి బలవంతం వల్ల అలా చెప్పిందో కనుక్కొని వాళ్లను పోలీసులకు పట్టివ్వండి. అంతే కాదు. చెన్నైలో కోడళ్లను తగలబెట్టే అత్తలు, మహిళల్ని వేధించే మగవాళ్లు, లంచాలు తింటున్న ఉద్యోగులు, స్మగ్లర్లు ఇంకా చాలా చాలా మంది ఉన్నారు. వెళ్లి అందర్నీ పోలీసులకు పట్టివ్వండి. ఉద్యోగం వదిలేసి ఇక్కడే ఇల్లు తీసుకొని ఆ పనిలో ఉండండి" ఆవేశంగా అన్నాడు ఉదయ్.

శశాంక్ అతన్ని ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు.

కొంతసేపటికి ఉదయ్ తన కోపాన్ని కంట్రోల్ చేసుకొని "సారీ. ఆవేశంతో ఏదేదో అన్నాను. ఐ యామ్ రియల్లీ సారీ". అన్నాడు.

"ఫర్వాలేదు. అభిమానం ఉన్నచోటే కోపం కూడా ఉంటుంది. మీరు కోరినట్లే నేను నెల్లూరు వెళ్లిపోతాను. ఇకపై ఈ విషయంలో ఎటువంటి ఎంక్వయిరీ చెయ్యను. సరేనా? " శశాంక్ నవ్వుతూ అడిగాడు ఉదయ్‌ని.

ఉదయ్ కూడా నవ్వుతూ తలాడించాడు.

నీరజ ఇద్దరికీ కాఫీ ఇచ్చింది. కాఫీ తాగాక ఉదయ్ లేచి నిలబడి "ఓకే శశాంక్‌గారూ. నేను వెళ్లొస్తాను. ఈ ఎంక్వయిరీ విషయంగా మనం కలవడం ఇదే ఆఖరిసారి కావాలి. ఈసారి మీరు నన్ను కలసినప్పుడు మంచివార్తలే చెప్పాలి. మీ పెళ్లికి కావలసిన వస్తువులు కొనడానికి గాని, మాధవి అక్క పెళ్లి విషయంగా గాని మనం కలవాలి. మీ బావగారు లోపల



### ఆరంటే అరడజనేనా?

'ఇండియా, పాక్‌ల వేర్పాటు సందర్భంగా నెలకొన్న మతవిద్వేషాల్లో పాకిస్తాన్‌లో ఎందరు భారత్‌లో ఎందరు చనిపోయారని మీ అంచనా?' అంటూ అడిగాడు నెహ్రూను ఓ విలేకరి.

నిజానికి ఏదేశం వారివైనా ప్రాణాలే. అందునా ఈ ఉదంతంలో చనిపోయింది అప్పటివరకూ భారత్‌లో కలిసున్న పౌరులు.. భారత్ పౌరులే. వేర్పాటువల్ల ఎంత ప్రాణ నష్టం జరిగిందని అడక్కుండా అక్కడెందరు ఇక్కడెందరు అని తేడా చూపుతూ అడగడం నెహ్రూకు రుచించలేదు. అందుకే-

'అక్కడో అరడజను మంది.. ఇక్కడో ఆరుగురు చనిపోయుండవచ్చు' అన్నాడు కొద్దిపాటి వ్యంగ్యంగా.

ఉన్నట్లున్నారు. ఆయనకు చెప్పండి బై" అంటూ వెళ్లిపోయాడు.

వంటగది నుంచి నీరజ, బెడ్‌రూంలో నుంచి రమేష్ వీళ్ల సంభాషణ మొత్తం విన్నారు. ఉదయ్ వెళ్లిపోయాక శశాంక్ ఎదురుగా కూర్చుని తమకేమీ అర్థం కాలేదని, మోహన్ హసీనాలు ఎవరని, అసలేం జరుగుతుందో చెప్పమని శశాంక్‌ను అడిగారు.

శశాంక్ జరిగింది చెప్పసాగాడు వాళ్లిద్దరికీ.

★ ★ ★

అంతా విన్నాక నీరజ ఆశ్చర్య పోయింది. ఏదో టీవీలో సస్పెన్స్ సీరియల్ చూసినట్లు అనిపించింది ఆమెకు శశాంక్ చెప్తూంటే. శశాంక్ ఇంతగా ఓ కుటుంబం కోసం తపించడం ఆమె మనసును కదిలించింది. అయితే అతను అన్ని రిస్కులు తీసుకోవడం ఆమెకు భయాన్ని కూడా కలిగించింది.

"అయితే ఇప్పుడేం చేస్తావు? నెల్లూరు వెళ్లిపోతావా?" అని అడిగింది.

"హసీనా విషయం తేల్చుకున్నాక వెళతాను"

"మరి నెల్లూరు వెళ్లిపోతానని ఆయనతో అన్నావు?" అంది ఆశ్చర్యంగా.

"అతని తృప్తి కోసం అలా అన్నాను. నా తృప్తి కోసం హసీనా ఇంటికి వెళ్లి నా అనుమానాలు తీర్చుకుంటాను" అన్నాడు. అతని ధైర్యానికి విస్తుబోయింది నీరజ.

రమేష్ తన చేయి శశాంక్‌కు అందిస్తూ "దిస్ మస్ట్ బి ది స్పిరిట్. కార్య సాధకుడు దెబ్బలకు భయపడకూడదు" అన్నాడు.

"వాడికి మీరు కూడా తోడయ్యారా? వాడికేదైనా అయితే వాడిమీదే ప్రాణం పెట్టుకున్న వాళ్ల అమ్మ ఏమయిపోతుందో మీరు ఆలోచించడంలేదు. ఒక్క వాళ్లమ్మే కాదు. వాడి మీద అభిమానం పెంచుకున్న

> మీ బుద్ధినీ, వివేకాన్నీ ఔన్నత్యం వైపుకు తీసుకువెళ్లే మార్గాన్ని ఎన్నుకోండి
> – మహాత్మాగాంధీ

వాళ్లందరూ ఏమయిపోవాలి? "

"పిచ్చి నీరూ. నేను చెబుతున్నానుగా. అతనికేం కాదు. శశాంక్‌ను భయపెట్టడం తప్ప చంపే ధైర్యం వాళ్లకు లేదు"

"మరి ఆయన అలా చెప్పాడు? "

"ఆయన కూడా నీలాగే శశాంక్ క్షేమం గురించి భయపడుతున్నాడు"

శశాంక్ కల్పించుకుంటూ "అక్కా. నేను గాఢంగా నమ్మే దేవుడు షిరిడీ సాయిబాబా. ఆయన ఎప్పుడూ నా వెంటే ఉండి నన్ను కాపాడుతారన్న నమ్మకం నాకుంది. నేను మంచితనాన్ని విడువనంతవరకూ ఆయన నన్ను వదలడు. నాకు నీలా ఎంతమంది ఆప్తులు ఉన్నారనుకున్నావు? వాళ్లందరి ప్రేమ, అనురాగం, ఆశీస్సులు నా చుట్టూ రక్షాకవచంలా ఏర్పడి నన్ను అనుక్షణం కాపాడుతుంటాయి. ఇలాంటి గ్యాంగులు ఒక్కటికాదు, వంద గ్యాంగులు కలిసినా నన్నేం చేయలేరు. 'దెబ్బ తినేంతవరకే భయం. తిన్నాక భయం ఉండదు' అంటారు. అలా నాలో అంతో ఇంతో ఉన్న భయం ఇప్పుడు పోయింది. కాబట్టి నిన్న జరిగింది కూడా నా మంచికేనని భావిస్తాను" అన్నాడు.

అతను చెప్పింది విన్నాక నీరజ ఏం మాట్లాడలేకపోయింది.

"నీకా ధైర్యం, నమ్మకం ఉంటే మంచిదే. ఆ 'బాబా'యే నిన్ను కాపాడాలి" అంటూ గోడమీదున్న సాయిబాబా పటానికి దండం పెట్టింది నీరజ.

"శశాంక్. నాదొక సలహా. మైలాపూర్ పోలీస్‌స్టేషన్‌లో నా ఫ్రెండ్ ఒకతను ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తున్నాడు. మనం ఒకసారి అతన్ని కలిసి మాట్లాడుదాం. అతనికి తెలియని విషయాలు మనం చెప్పినట్లుంటుంది. మనకు తెలియని విషయాలు తెలుసుకున్నట్లూ ఉంటుంది. పైగా ఇటువంటి విషయాల్లో పోలీసుల రిపోర్ట్, సహాయం ఉంటే మనకు ఎంతో ధైర్యంగానూ ఉంటుంది. సులభంగానూ ఉంటుంది. ఏమంటావు? " అన్నాడు రమేష్.

"యు ఆర్ హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్ బావా. ఈ అసైన్‌మెంట్ మొదలుపెట్టినప్పట్నుంచీ 'ఈ పెద్ద సిటీలో నాకు తెలిసిన పోలీసాఫీసరు ఎవరైనా ఉంటే ఎంత బాగుండేది' అనుకునేవాణ్ణి. గాడ్ యీజ్ గ్రేట్. మనం ముందు డాక్టర్ దగ్గరికెళ్లి ఈ కట్టు తీయించుకుని, పోలీస్‌స్టేషన్‌కెళ్దాం. ఆయన్ను నాకు పరిచయంచేసి మీరు ఆఫీసుకు వెళ్లిపోండి. నేను అన్ని విషయాలు ఆయనతో మాట్లాడుతాను" అన్నాడు శశాంక్.

"అవన్నీ అయ్యేసరికి చాలా ఆలస్యం అవుతుంది. కాబట్టి నేను ఈరోజు ఆఫీసుకు లీవు పెడతాను. పైగా రాత్రంతా నిద్రలేదు కదా. అలసటగా ఉంది. ఆఫీసుకు వెళ్లి పని చేయలేను"

"అయితే యింకా మంచిది. మనం పది గంటలకు బయలుదేరుదాం" అన్నాడు శశాంక్.

★ ★ ★

"కిరణ్ నర్సింగ్‌హోం"లో డాక్టర్ మాధవన్ లేడు. మార్నింగ్ షిఫ్ట్‌లో ఉన్న డాక్టర్ ఉన్నాడు. ఆయన కట్టువిప్పి చూసి "నథింగ్ యీజ్ దేర్. కొద్దిగా ఆయింట్‌మెంట్ రాస్తే చాలు" అంటూ నర్స్‌ని పిలిచాడు. నర్స్ వచ్చి దెబ్బ తగిలిన చోట ఆయింట్‌మెంట్ రాసింది. ఆయన మాధవన్ రాసిచ్చిన ప్రిస్క్రిప్షన్ చూసి "ఈ మందులే చాలు. ఇవి వాడి నిలిపివేయవచ్చు" అన్నాడు.

శశాంక్, రమేష్ ఆ డాక్టరుకు ధన్యవాదాలు చెప్పి బయటకు వచ్చారు. అక్కడ్నుంచి మైలాపూర్ పోలీస్‌స్టేషన్ చేరుకున్నారు. ఇన్‌స్పెక్టర్ సుందర్ స్టేషన్‌లోనే ఉన్నాడు. రమేష్‌ను చూడగానే అభిమానంగా పలుకరించాడు సుందర్.

రమేష్ శశాంక్‌ను సుందర్‌కు పరిచయం చేసి తాము వచ్చిన కారణం చెప్పాడు. శశాంక్ సుందర్‌కు స్వప్న మరణం దగ్గర్నుంచి జరిగింది మొత్తం చెప్పాడు.

"మీరు నాకు చాలా ఉపయోగకరమైన విషయాలు చెప్పారు మిస్టర్ శశాంక్. ఈ మధ్యే సిటీ పోలీసు కమిషనర్ నగరంలోని పోలీసు అధికారులతో ఓ సమావేశం నిర్వహించారు. ఆయన సేకరించిన వివరాల ప్రకారం సిటీలో ఈమధ్య ఒక కుర్రాళ్ల గ్యాంగ్ ఏర్పడింది. వీళ్లు వయసులో ఉన్న అమ్మాయిలతో స్నేహం చేయడం, స్నేహాన్ని ప్రేమగా మార్చుకోవడం, తర్వాత ఆ అమ్మాయిలతో శృంగారం జరపడం చేస్తున్నారు. అలా ఆ అమ్మాయిల్ని సెక్స్‌కు అలవాటు చేశాక ఆ అమ్మాయిలు వీళ్లు ఎప్పుడు రమ్మన్నా వెళ్లి, ఎంత డబ్బు కావాలన్నా ఇచ్చి తమ కోరికలు తీర్చుకుంటారు. ఈ కుర్రాళ్లు ఏదో ఒక కారణం నమ్మేటట్లు చెప్పి ఆ అమ్మాయిల దగ్గర్నుంచి పెద్దమొత్తాల్లో డబ్బులు తీసుకొంటారు. ఇక ఆ అమ్మాయిల దగ్గర ఏమీ మిగల్లేదని తెలిశాక మెల్లగా తప్పుకొంటారు. ఆ షాక్‌కు తట్టుకోలేక కొంతమంది అమ్మాయిలు ఆత్మహత్యలు చేసుకొంటే మరీ సున్నిత మనస్కులు మతిస్థిమితం కోల్పోతున్నారు. ఇంకొంతమంది జరిగింది మర్చిపోయి పెళ్లిళ్లు చేసుకుంటున్నారు"

శశాంక్ కళ్లు పెద్దవి చేసుకుని వినసాగాడు. ఇంతలో ఓ కుర్రాడు కప్పులతో కాఫీ తెచ్చి ముగ్గురికీ ఇచ్చాడు.

"తీసుకోండి" అని చెప్పి, సుందర్ కాఫీ తాగుతూ తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

"వీళ్లలో వీళ్లకు అండర్‌స్టాండింగ్స్ ఉన్నాయి. ఒకమ్మాయి అందాన్ని ఇష్టపడుతుందని తెలిస్తే వీళ్లలో అందంగా ఎవడున్నాడో అతన్ని ఆమెను ట్రాప్ చేయడానికి ఉపయోగిస్తారు. మొరటుగా ఉండే మగవాళ్లు ఇష్టం అని తెలిస్తే అలాంటివాణ్ణి ఆమెకు కేటాయిస్తారు. ఆ అమ్మాయిల ఆర్థిక పరిస్థితి, బ్యాంక్ బాలన్స్ టేస్టు ఇవన్నీ తెలుసుకునేందుకు వీళ్ల గ్యాంగ్‌లోని అమ్మాయిల్నే ఉపయోగించుకుని డబ్బులిస్తారు. అలాగే ఆ అమ్మాయిలు ఉద్యోగం చేసేచోట ఏదో ఒక రకంగా తమ మనుషుల్ని అక్కడే ఉద్యోగంలో చేర్పిస్తారు" కాఫీ కప్పు టేబుల్‌మీద పెట్టి కాసేపు ఆగాడు సుందర్.

"స్వప్న విషయంలో . సరిగ్గా మీరు చెప్పినట్లే జరిగింది. నాజర్ ఆమెను ట్రాప్ చేయడానికి నియమింపబడ్డవాడే" అన్నాడు శశాంక్.

"వీళ్లు ఎవరూ తమ అసలు పేర్లు చెప్పరు. వీళ్లు చేసే పనులు వాళ్ల ఇంట్లోని వాళ్లకు కూడా తెలియవు. పైకి అందంగా, వినయంగా ఉంటారు. మంచి ఇంగ్లీషు మాట్లాడతారు. ఖరీదైన దుస్తులు వాడతారు. తెలియని వాళ్లు వీళ్లని చూసి 'బిజినెస్ ఎగ్జిక్యూటివ్' అనుకుంటారు. అంత స్మార్ట్‌గా ఉంటారు. విజిటింగ్ కార్డ్సు ప్రింట్ చేయించుకుంటారు. కాని అందులోని అడ్రస్ ఎక్కడా ఉండదు"

"మోహన్ నాకు యిచ్చిన విజిటింగ్ కార్డ్‌లోని అడ్రసుకు ఉత్తరం రాశాను, వాళ్ల చెన్నై స్టాకిస్టు అడ్రసు రాయమని, అఫ్‌కోర్సు మోహన్ ఆ కంపెనీలో నిజంగా పని చేస్తున్నాడా లేదా అని తెలుసుకోవడానికే రాశాను. నాకు రిప్లై రాలేదు. అయితే నేను పంపింది రిజిస్టర్డ్ పోస్ట్‌లో. అదీ అక్‌నాలెడ్జ్‌మెంట్ కార్డు జతచేసి. అందువల్ల అక్‌నాలెడ్జ్‌మెంట్ కార్డు మాత్రం వచ్చింది. కంపెనీ స్టాంపు ఉంది నా ఉత్తరం అందినట్లు. దీన్నిబట్టి మనం ఊహించగలిగే కారణాలు రెండు. ఒకటి ఆ కంపెనీకి చెన్నైలో స్టాకిస్టు లేకుండానన్నా ఉండాలి లేదా వాళ్లు నా ఉత్తరానికి జవాబు రాయడానికి ఉత్సాహం చూపకపోయి ఉండొచ్చు మొదటిది నిజమైతే మోహన్ ఆ కంపెనీలో

ఉద్యోగం చేస్తున్నాననడం అబద్ధం. ఎందుకంటే చెన్నై లాంటి మహాపట్టణంలో లోకల్ స్టాకిస్టు లేకుండా బిజినెస్ చేయడం కష్టం. నా ఊహ నిజమైతే వీళ్లు తమ స్నేహితుల ద్వారా గానీ, బంధువుల ద్వారా గానీ దూర రాష్ట్రాలలో ఉన్న కంపెనీల పేర్లు, అడ్రసులు తెలుసుకుని వాటిని తమ విజిటింగ్ కార్డుల మీద ముద్రించుకుని అందర్నీ మోసం చేస్తున్నారు" అన్నాడు శశాంక్.

"యు ఆర్ రైట్. ఇకపోతే వీళ్ల ఆర్థిక లావాదేవీలు కూడా విచిత్రంగా ఉన్నాయి. అమ్మాయిని ట్రాప్‌చేసి డబ్బు దోచుకున్న వాడు ఒకడైతే వాడికి ఆ అమ్మాయిని చూపించినవాడు, వివరాలు సంపాదించిన వాడు ఇంకొకడు ఉంటాడు. ఆ అమ్మాయి నుంచి తీసుకున్న డబ్బును ఇలా ఇద్దరు, ముగ్గురు ఒప్పుకున్న నిష్పత్తి ప్రకారం పంచుకొంటారు. ఒకవేళ ఆ అమ్మాయి చెక్కు రూపంలో డబ్బులు ఇచ్చి ఉంటే ఆ చెక్కును బ్యాంకులో తమ అక్కౌంటుగా వేసుకుని డ్రా చేస్తారు. దీనికోసం బ్యాంకులో అక్కౌంట్లు తెరుస్తారు. ఆ అక్కౌంట్లు కూడా ఇద్దరు లేదా ముగ్గురు పేర్లతో ఉండి అందరూ సంతకాలు పెడితేనే పేమెంట్ అయ్యే కండిషన్‌తో ప్రారంభించబడి ఉంటుంది. ఒకరిపై ఒకరికి నమ్మకం లేక చేసుకున్న ఏర్పాటు ఇది" అన్నాడు సుందర్.

"చెక్కు రూపంలో యిస్తే" అన్న పదాలు సుందర్ నోటినుంచి రాగానే శశాంక్ ఆలోచించసాగాడు. స్వప్న కూడా మదన్‌కు చెక్కు ఇచ్చి ఉంటుందా? లక్షా, రెండు లక్షలు నగదు రూపంలో ఆమె తీసుకెళ్లి అతనికి ఇచ్చే అవకాశం తక్కువ. ఎందుకంటే అంత కాష్ తీసుకెళ్లడం రిస్కు కనుక. కాబట్టి స్వప్న మదన్‌కు చెక్కు ఇచ్చి ఉంటుంది. ఆ చెక్కును మదన్ తన బ్యాంకు నుంచి ప్రెజెంట్‌చేసి ఉంటాడు. అతని అక్కౌంటు ఏ బ్యాంకులో ఉందో, ఏ బ్రాంచిలో ఉందో తెలుసుకోగలిగితే, ఆ బ్రాంచిలో అక్కౌంటు ఓపెనింగ్ ఫారంలో ఎవరి ఫొటో ఉందో చూస్తే సరి. స్వప్నను మోసం చేసినవాడు దొరికిపోతాడు' అనుకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" సుందర్ శశాంక్‌ను అడిగాడు. శశాంక్ తన మనసులోని మాటను చెప్పాడు. సుందర్ అతనివైపు ప్రశంసాపూర్వకంగా చూశాడు.

"మంచి ఆలోచన. మనకు బ్యాంకులో పనిచేసేవాళ్లు ఎవరైనా తెలిసుంటే వాళ్ల ద్వారా ఆ ప్రొసీజర్ గురించి తెలుసుకోవచ్చు"

"నా క్లోజ్ ఫ్రెండ్ రామకృష్ణ స్టేట్‌బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. అతనికి ఫోన్‌చేసి కనుక్కుంటాను. మరో విషయం ఏమిటంటే స్వప్న ఇంట్లో నేను చూసిన పాస్‌బుక్‌లో లక్ష, రెండు లక్షల ఎంట్రీలు లేవు. కాబట్టి ఆమెకు ఇంకో అక్కౌంటు ఉండి ఉండాలి. ఆ అక్కౌంటు నెంబరు మనం కనుక్కోవాలి"

"ఒకవేళ ఆమె ఫిక్స్‌డ్ డిపాజిట్లు చేసుకొని క్యాష్ తీసుకుని ఉండొచ్చుగా" అన్నాడు రమేష్.

"యాభైవేలు దాటితే అక్కౌంటు ద్వారానే చెల్లిస్తారు. ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్ నిబంధనల వల్ల" అన్నాడు శశాంక్.

"అవును. ఆ విషయం నాకు తెలుసు. కాని తోచలేదు" నవ్వుతూ అన్నాడు రమేష్.

"ఒక వేళ మదన్ స్వప్నతో పాటు బ్యాంకుకు వెళ్లి ఆమెచే క్యాష్ డ్రా చేయించి తీసుకొని వెళ్లి ఉంటే? సుందర్ అడిగాడు.

"అలా జరిగుంటే మదన్‌ను కనుక్కోవడం కష్టం. ప్రస్తుతానికి స్వప్న మదన్‌కు చెక్కు రూపంలోనే ఇచ్చి ఉంటుందని భావించుకుందాం. ఆ ఏంగిల్‌లో మన ప్రయత్నాలు చేద్దాం. ముందు మనం హసీనాను కలవాలి".

"ఇప్పుడే బయలుదేరుదాం" అని, రమేష్‌తో "మీరు ఇంటికెళ్లిపోవచ్చు. నేను, శశాంక్ వెళ్లొస్తాం" అన్నాడు సుందర్.

రమేష్ స్కూటర్‌పై ఇంటికి వెళ్లిపోయాడు. సుందర్ మోటార్‌బైక్ పైన సుందర్, శశాంక్ బయలుదేరారు.

దారిలో శశాంక్ "సిటీలో ఆ దుర్మార్గులు ఇన్ని కార్యకలాపాలు జరుపుతున్నా వాళ్లెవరో పోలీసు డిపార్ట్‌మెంట్‌కు తెలియకపోవడం ఆశ్చర్యకరం" అన్నాడు సుందర్‌తో.

"చెప్పానుగా వాళ్లను చూస్తే ఎవరూ అలాంటివాళ్లు అనుకోరని. వాళ్ల అసలు పేరు అసలు అడ్రస్ ఎవరికీ ఇవ్వరు. ఒక మ్మాయి వీరిచే మోసగించబడి, ఆ విషయంలో సైదాపేట్ పోలీసుస్టేషన్‌కు ఫోన్ చేసి చెప్పి ఇద్దరు కుర్రాళ్లు పేర్లూ, అడ్రసులూ చెప్పిందట. తీరా మావాళ్లు వెళ్లి విచారిస్తే అటువంటి అడ్రసూ లేదు, మనుషులూ లేరు. వీళ్లు తమ ఫోటోలు కూడా ఎవరికీ ఇవ్వరు. ఎవరూ తమని ఫోటోలు తీయకుండా జాగ్రత్తపడతారు. వీళ్ల గురించి బాగా తెలిసిన వాళ్లు కూడా ఉండవచ్చు. అయితే 'ఆ కుర్రాళ్లు తాము పోలీసులతో చెప్పిన విషయం తెలుసుకొని తమకు హాని చెయ్యొచ్చు' అన్న భయం వల్ల మాకు రిపోర్టు చేయకపోగా ఉండొచ్చు పైగా 'పోలీసులకు చెబితే తరచుగా స్టేషన్‌కు రమ్మని పిలుస్తారు. అదో న్యూసెన్స్' అనుకొని ఊరుకున్నవాళ్లూ చాలామంది ఉండొచ్చు."

"నిజమే."

"మాకు ఆ గ్యాంగ్‌లో ఒక్కడు దొరికినా చాలు, మిగిలిన వాళ్లను పట్టేయగలము" అన్నాడు సుందర్.

బైక్‌ను హసీనా ఇంటి ముందు ఆపించాడు శశాంక్. బైక్ దిగి ఆమె ఇంటి వైపు చూసి నిశ్చేష్టుడయ్యాడు.

"ఆమె ఇంటికి తాళం వేసి ఉంది."

★ ★ ★

శశాంక్ హసీనా పక్కింటి కాలింగ్ బెల్ నొక్కాడు. లోపలినుంచి మనిషి రావడం కోసం ఎదురుచూస్తూ ఆ ఇంటిని పరిశీలనగా చూశాడు. హసీనా ఇంటికి పూర్తిగా విరుద్ధంగా ఉంది ఆ ఇల్లు. చక్కటి ఎలివేషన్, కాంపౌండ్ వాల్, గ్రిల్ గేటు, చూడముచ్చటైన పెయింటింగ్‌తో చాలా ఆకర్షణీయంగా ఉంది యిల్లు.

నిమిషం తర్వాత ఓ స్త్రీ బయటకు వచ్చింది. ఆమెకూ హసీనా వయసే ఉంటుంది. గేటు దగ్గర నిలబడ్డ శశాంక్‌ను చూచి దగ్గరకొచ్చి "ఎవరు కావాలండీ?" అని అడిగింది.

"హసీనా ఇల్లు తాళం వేసి ఉంది. ఆవిడ బయటికెళ్లారా? అని అడిగాడు శశాంక్.

"అవునండీ. నిన్న సాయంత్రం నుంచీ ఆమె కనబడలేదు."

"సాయంత్రం నుంచీ కనబడలేదా?" అనుకుంటూ సుందర్‌వైపు చూచి దగ్గరకు రమ్మని సైగ చేశాడు. సుందర్ దగ్గరకు రాగానే విషయం చెప్పాడు శశాంక్. సుందర్‌ను పోలీసు డ్రస్‌లో చూచి ఆమె కొద్దిగా భయపడింది.

"మామూలుగా హసీనాగారు బయటకు వెళుతున్నపుడు మీకు చెప్పి వెళతారా?" అని అడిగాడు సుందర్.

"ఆవిడతో నాకు పెద్దగా పరిచయం లేదు. నిన్న సాయంత్రం నేను మొక్కలకు నీళ్లు పోస్తుంటే ఓ యువకుడు ఆమె ఇంట్లోకి వెళ్లడం కనిపించింది. ఈమధ్య ఆమె ఇల్లు అమ్మకానికి పెట్టిందని విన్నాను. ఆవిషయంగా అతను వచ్చి ఉంటాడని అనుకొన్నాను. నా తోటపని అయ్యాక గేటు దగ్గరకి వెళ్లి నిలబడ్డాను. ఆమె అతనితో మోటార్‌బైక్ మీద కూర్చుని వెళ్లడం కనిపించింది' ' అంది ఆమె.

"ఎలా ఉన్నాడు ఆ యువకుడు?" శశాంక్ అడిగాడు.

> మనుషులకు సంబంధించిన అన్ని వ్యవహారాల్లో బలం రహస్యం ఏకాగ్రతతో దాగి ఉంటుంది. – ఎమర్సన్

"సన్నగా పొడుగ్గా ఉన్నాడు"

ఆ గుర్తులు చాలదన్నట్లు చూశాడు సుందర్ శశాంక్ వైపు.

"అతను లోపలికి వెళ్లగానే ఇంట్లోనుంచి అరుపులుగాని, గొడవలు గాని మీకు వినిపించాయా? " సుందర్ అడిగాడు.

"నేను గమనించలేదు. మీరు అడుగుతుంటే గుర్తొస్తుంది ఆమె ముఖం ప్రసన్నంగా కనిపించలేదు బైక్‌లో వెళ్తున్నపుడు"

"మీరు ఏమీ అనుకోనంటే ఓ ప్రశ్న అడుగుతాను. హసీనాకు మగవాళ్లతో పరిచయాలు ఉన్నాయా? " అని సుందర్ అడిగాడు.

"నాకు తెలిసి లేవు. ఆమె బయటకు వెళ్లడం చాలా తక్కువ. ఆమె ఇంటికి వచ్చే వాళ్లు దాదాపు లేరనే చెప్పాలి."

"థ్యాంక్యూ వెరిమచ్. మరో చిన్న సహాయం చేయండి. ఆమె ఇంటికి రాగానే నాకు ఫోన్ చేయండి" అన్నాడు సుందర్. ఆమె ఇబ్బందిగా చూసింది. అది గమనించిన శశాంక్ "ఓకే మీరు నాకు ఫోన్ చేయండి. నేను ఆమె శ్రేయోభిలాషిని. నా పేరు శశాంక్. ఆవిడతో ఇదివరకే రెండు సార్లు మాట్లాడాను నేను. తన గురించి మీరు పోలీసులకు ఫోన్ చేశారని తెలిస్తే ఆవిడ బాధపడుతుంది. మీ ఆలోచన కూడా అదే అనుకొంటాను. నేను పోలీసును కాను. మీరు ఫోన్ చేసినట్లు ఆవిడతో చెప్పను. మా ప్రయత్నం, తపన అన్నీ ఓ ఆడపిల్ల జీవితం కాపాడటం కోసం. అందుకు ఆవిడ నుంచి తెలుసుకోవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. ఇందులో భయపడవలసింది కూడా ఏమీ లేదు" అన్నాడు శశాంక్.

"అలాగే. నేను మీకు ఫోన్ చేస్తాను" అంది శశాంక్‌తో. శశాంక్ తన పేరు, సెల్ నెంబరు ఓ కాగితంపై రాసిచ్చాడు.

"మేం వెళ్తాం. సారీ టు బాదర్ యూ" చేతులు జోడించి అన్నాడు శశాంక్.

ఆమె కూడా చేతులు జోడించింది. శశాంక్‌ను చూస్తుంటే ఎందుకో తెలియని గౌరవ భావం కలిగింది ఆమెకు. అతను వయసులో తనకన్నా చిన్నవాడని స్పష్టంగా కనబడుతున్నా.

★ ★ ★

"ఈరోజు హసీనాతో మాట్లాడి ఉంటే నా పని పూర్తయిపోయి ఉండేది. నేను ఏం చెయ్యాలో నిర్ణయించుకొని ఉండేవాడిని. ఆమె లేకపోవడం వల్ల మొత్తం అప్సెట్ అయింది" నిరుత్సాహంతో అన్నాడు శశాంక్ మోటార్‌బైక్ వైపు నడుస్తూ.

"మీ పనేకాదు. నాపని కూడా కొంతవరకు అయి ఉండేది" అన్నాడు సుందర్.

"నాకు హసీనా క్షేమం గురించి ఆందోళనగా ఉంది. తనకు నావల్ల ఏ ఇబ్బందీ కలగదని హామీ ఇచ్చాను. నావల్లే తను ఇబ్బందుల్లో పడింది. హసీనాను ట్రేస్ చేయలేరా మీరు? " అని అడిగాడు శశాంక్.

"అది అంత సులభం కాదు. అసలు ఆమెను ప్రాణాలతో ఉంచుతారన్నది కూడా అనుమానమే. ఆమె హంతకుణ్ణి చూసింది కనుక ఏనాటికైనా తమను పట్టి ఇస్తుందని ఆమె ప్రాణం తీయవచ్చు వాళ్లు. లేదా ఎక్కడైనా దాచిపెట్టి మీరు నెల్లూరుకు వెళ్లిపోగానే తగిన విధంగా హెచ్చరించి వదలివేయవచ్చు"

శశాంక్ ఎంతో బాధపడ్డాడు. తనవల్ల ఒక ఆడదానికి ఇబ్బందులు ఎదురయ్యాయన్న నిజం అతన్ని కలవరపరచింది.

"మీరు బాధపడకండి. ఇదంతా మీ వల్లే జరుగలేదు. ఏదో ఒక రోజు నిజం తెలిసి మేమూ ఆమె ఇంటికి వచ్చేవాళ్లం. అప్పుడూ యీ పరిస్థితే ఎదురయ్యేది ఆమెకు."

"నేను నెల్లూరు వెళ్లిపోవాలో ఇక్కడే ఉండి హసీనా కోసం ఎదురుచూడాలో నాకర్థం కావడం లేదు."

"మీరు నెల్లూరు వెళ్లిపోండి. ఇక్కడున్నా

లాభం లేదు. హసీనా ఎక్కడికెళ్లిందో, ఎన్ని రోజులకు తిరిగి వస్తుందో మనకు తెలియదు. వస్తే ఎటూ పక్కింటావిడ ఫోన్ చేస్తానన్నారు కదా. నేను మా కానిస్టేబుల్‌ను అప్పుడప్పుడూ మఫ్టీలో వచ్చి చూస్తూండమంటాను."

"మీరు చెప్పినట్లు చేయడమే మంచిదనిపిస్తుంది నాకు. నేను సాయంత్రం నెల్లూరుకు బయలుదేరుతాను. హసీనా వచ్చినట్లు తెలియగానే నాకు ఫోన్ చేయండి. వెంటనే బయలుదేరి వచ్చేస్తాను"

"అలాగే. మిమ్మల్ని ఎక్కడ డ్రాప్ చేయను? "

"మీ స్టేషన్ దగ్గరే డ్రాప్ చెయ్యండి. నేను నడుచుకుంటూ వెళ్లిపోతాను"

ఇంతలో శశాంక్ సెల్ మోగింది. నెంబరు చూపి "నా ఫ్రెండ్ ఉదయ్" అని సుందర్‌తో చెప్పి "హలో ఉదయ్‌గారూ" అన్నాడు.

"హలో గాయం ఎలా ఉంది. నొప్పేం లేదు కదా? "

"లేదు. డాక్టరు దగ్గరికి వెళ్లాం. కట్టు కూడా అవసరం లేదన్నాడు."

"మీ టైం బాగుంది. ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు? "

శశాంక్ ఒకక్షణం ఆలోచించి "సాయిబాబా గుడికి వచ్చాను. గుడి బయట నిలబడి మాట్లాడుతున్నాను" అన్నాడు సుందర్ ఆశ్చర్యంగా చూశాడు శశాంక్ వైపు. శశాంక్ కళ్లతోనే సంజ్ఞ చేశాడు విషయం తర్వాత చెప్తానని.

"అలాగా? హసీనా ఇంటికి వెళ్లలేదా? "

" వెళ్లాలనే ఉంది. నేనుగా అక్కడికి వెళ్లిపోయినా వెళ్లిపోవచ్చు. మీకు కోపం వస్తుంది కదూ? "

"లేదులే చెప్పండి"

"దయ చేసి నా పరిస్థితి అర్థం చేసుకోనండి ఉదయ్. సాహితి జీవితం బాగుండాలని నేను ఎంతగా ఆరాటపడుతున్నానో మీకు తెలుసు. మోహన్ స్వప్నకు అన్నయ్య అని తెలియగానే మోహన్, మదన్ ఒకరు కాదు అని నిర్ధారణ అయ్యింది. థియేటర్‌లో నన్ను కొట్టింది మోహన్ అయి ఉండడు అని మీరే అన్నారు. నిజంగా కూడా అతనికి ఆ అవసరం లేదు. ఇవన్నీ తెలిశాక ఫోటోల విషయంలో కూడా అతను నిజమే చెప్పి ఉంటాడనిపిస్తుంది. ఇకపోతే రెండే రెండు విషయాల్లో అతని గురించి నాకు అనుమానాలు మిగిలాయి. ఒకటి - హసీనా మోహన్ని హంతకుడని ఎందుకు చెప్పింది? మదన్‌కూ, నాజర్‌కు స్నేహం ఉంది గాని మోహన్‌కు, నాజర్‌కు స్నేహం ఉండే అవకాశం చాలా తక్కువ. ఒకవేళ మోహన్‌కు నాజర్‌తో స్నేహం ఉండి ఉంటే మదన్‌తో కూడా స్నేహం ఉండి ఉండాలి. అటువంటప్పుడు మదన్ తన చెల్లెల్ని మోసం చేస్తూంటే చూస్తూ ఊరుకొనేవాడు కాదు. మోసం చేశాక మదన్‌ని వదిలిపెట్టి ఉండేవాడూ కాదు. రెండవ విషయం అతని తాగుడు గురించి ఆఫ్‌కోర్సు మొదటిదాంతో పోలిస్తే ఇదేమంత పెద్ద విషయం కాదు. అదో బలహీనత. అంతే. అదీ సరిదిద్దుకొనే అవకాశం ఉన్న బలహీనత. అందువల్ల ఆ ఒక్క పాయింట్ నేను హసీనాకు అడిగి కన్‌ఫర్మ్ చేసుకొని, ఎగురుకుంటూ నెల్లూరు వెళ్లి సాహితి పెళ్లి పనుల్లో ఉత్సాహంగా పాలు పంచుకొంటాను."

"సరే, మీరు అక్కడే ఉండండి. నేను పది నిముషాల్లో మీ దగ్గరకి వస్తాను" "మళ్లీ మీకెందుకు శ్రమ? నేనొక్కడినే వెళ్లి వస్తాను."

"మీరున్న పరిస్థితిలో అక్కడికి ఒంటరిగా వెళ్ళడం ఏమాత్రం మంచిది కాదు. దయచేసి నా మాట వినండి"

"సరే. మీ యిష్టం. మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను" నీరసంగా సుందర్‌వైపు చూసి సెల్ ఆఫ్ చేశాడు శశాంక్.

"ఏమంటారు ఆయన? " సుందర్ అడిగాడు

"నేను ఈ ఎంక్వయిరీలు మాని నెల్లూరు వెళ్ళిపోతానని ఉదయ్‌కి మాటిచ్చాను. నేను హసీనా ఇంటికి వచ్చానని తెలిస్తే అతనికి కోపం రావచ్చు. మీరు తోడుగా ఉన్నారని చెబితే పోలీసులతో ఎందుకు చెప్పావని నాపైన ఎగుర్తాడు. అందుకే అసలు విషయం చెప్పకుండా గుడి దగ్గర ఉన్నానని చెప్పాను. పది నిమిషాల్లో అక్కడికి వచ్చి నన్ను హసీనా ఇంటికి పిలుచుకొని వెళతానని అన్నాడు. నేను అర్జెంటుగా సాయిబాబా గుడి దగ్గరికి వెళ్ళాలి ఇప్పుడు"

"హసీనా ఇంటికి వెళ్తున్నానని ఎందుకు చెప్పారు మీరు? మీరు ఆ మాట అనకపోయి ఉంటే అతను ఇప్పుడు మీ దగ్గరికి వచ్చేవాడు కాదు కదా? " అన్నాడు సుందర్

"నేను తర్వాత ఎప్పుడైనా మాటల్లో హసీనా ఇంటికి వెళ్ళిన విషయం బయటపెట్టేస్తానేమోనన్న భయంతో ముందు జాగ్రత్త కోసం అలా చెప్పాను. నేను అనుకొన్నదొక్కటి, అయినదొక్కటి"

"కూర్చోండి డ్రాప్ చేస్తాను'

శశాంక్ కూర్చుని 'దారిలో ఏదైనా ఆటో కనబడితే ఆపండి. నేను ఆటోలో వెళ్ళిపోతాను. మీతోగాని నన్ను చూశాడంటే అతని ప్రశ్నలకు నేను బదులివ్వలేను. నేనంటే ఎంత ఇష్టం చూపిస్తాడో అతని మాట వినకపోతే అంతే కోపం చూపిస్తాడు. బట్ ఇట్ ఈజ్ ఓన్లీ అవుటాఫ్ కన్సర్న్" అన్నాడు.

వీధి మలుపులోనే ఆటో కనిపించడంతో సుందర్ దగ్గర శెలవు తీసుకొని ఆటో ఎక్కాడు శశాంక్.

★ ★ ★

శశాంక్ సాయిబాబా గుడి దగ్గర ఆటో దిగి చుట్టూ చూశాడు. ఉదయ్ కనిపించ లేదు. నేరుగా గుడిలోకి నడుచుకొంటూ వెళ్ళి బాబా ఎదురుగా నిలబడి చేతులు జోడించాడు. ఇప్పుడు అతను మాధవి గురించి, సాహితి గురించి ఆలోచించడం లేదు. హసీనా గురించి ఆలోచిస్తున్నాడు. బాబా కళ్ళవైపే చూసి, తర్వాత కళ్ళు మూసుకొని బాబాను ధ్యానించి తన మనసులోని కోరికను బాబాకు విన్నవించుకొన్నాడు.

"బాబా ఇంతవరకు నా వల్ల చాలామందికి అంతో యింతో ఉపకారమే జరిగింది. కాని అపకారం జరుగలేదు. ఈరోజు మొదటిసారిగా నా వల్ల ఓ ఆడది యిబ్బందిలో పడింది. ఓ ఆడదాని జీవితాన్ని కాపాడే ప్రయత్నంలో మరో ఆడదాని జీవితాన్ని ప్రమాదంలో పడేశాను. దయచేసి ఆమెను కాపాడు. ఏ హానీ కలుగకుండా రక్షించు తండ్రీ"

కళ్ళు తెరచి మరోసారి బాబాకు నమస్కరించి ఆలయం వెలుపలికి వచ్చాడు. ఉదయ్ అప్పుడే అక్కడికి వచ్చి గుడి ఎదురుగా బైక్‌ని నిలపడం చూచి చెయ్యూపాడు. తరువాత రోడ్డు దాటి ఉదయ్‌ని సమీపించాడు.

"పోదామా? " అన్నాడు ఉదయ్. వెళదామంటూ అతని వెనుక కూర్చున్నాడు శశాంక్. పదినిమిషాల్లో హసీనా ఇంటికి చేరుకొన్నారు. శశాంక్ బైక్ దిగి హసీనా ఇంటికున్న తాళం చూసి 'అయ్యో ఇల్లు లాక్ చేసి ఉంది" అన్నాడు బాధగా మొహం పెడుతూ.

"నేను అనుకుంటూనే ఉన్నాను ఇలాంటిది ఏదో జరుగుతుందని. మీకోసం పాపం తను ఇబ్బందుల్లో పడింది. సరే ఏం చేద్దాం ఇప్పుడు? " అన్నాడు ఉదయ్.

"చేసేదేముంది తిరిగి వెళ్ళిపోవడమే" అన్నాడు శశాంక్. ఇంతలో అతనికి హసీనా పక్కింటావిడ గేటు దగ్గరే నిలబడి తమ వైపు చూస్తుండటం కన్పించింది.

అమె వచ్చి తనతో మాట్లాడితే తను ఇంతకు మునుపు ఇక్కడకు వచ్చిన విషయం ఉదయ్‌కు తెలుస్తుంది. తను ముందు ఇక్కడ్నుంచి వెళ్ళిపోవాలి అనుకొని

"పదండి ఉదయ్ వెళ్దాము" అన్నాడు. ఉదయ్ వెహికల్ స్టార్ట్ చేసి వెనక్కి తిప్పాడు. శశాంక్ అతని వెనుక కూర్చుని మొహం ఆమెకు కనిపించకుండా మరోవై పుకు తిప్పుకొన్నాడు.

శశాంక్‌ను అతని అక్కయ్య ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు ఉదయ్.

"నేను వెళ్ళి వస్తాను. మీకు చాలా శ్రమ ఇచ్చాను, విసిగించాను, కోపం తెప్పించాను. అయినా మీరు అనుక్షణం నా క్షేమం కోసం తపనపడ్డారు. మీవంటి మంచి స్నేహితు డిని నాకు ఇచ్చిన భగవంతుడికి, మిమ్మల్ని నాకు పరిచయం చేసిన మాధవి గారికి నేను కృతజ్ఞతలు చెప్పుకోవాలి"

"భలేవారే. మీరు మంచివారు కనుక అందరిలో మంచే కనబడుతుంది మీకు. అయితే నేను మిమ్మల్ని కోరేదొకటే. మీరు పెరిగిన ప్రపంచం వేరు, మీరు చూడాలని ప్రయత్నిస్తున్న ప్రపంచం వేరు. మీరు హాయిగా మీ ప్రపంచంలోనే ఉండిపొండి"

"అలాగే. లోపలికి రండి. భోజనం చేసి వెళుదురుగాని"

"ఫరవాలేదు. మా అమ్మ నా కోసం ఎదు రుచూస్తూంటుంది"

"నేను సాయంత్రం నెల్లూరు వెళ్తున్నాను. థాంక్యూ వన్స్ అగైన్ అండ్ బై"

★ ★ ★

శశాంక్ ఇంట్లోకి వెళ్ళగానే అతను వెళ్ళిన పని ఏమైందని ఆత్రంగా అడిగారు నీరజా రమేష్‌లు. శశాంక్ జరిగింది చెప్పాడు.

"ఈరోజు నెల్లూరు వెళ్తున్నావా? " అని అడిగింది నీరజ భోజనాల సమయంలో.

"సాయంత్రం బయలుదేరుతాను. ఈలోపల ఒకసారి మోహన్ దగ్గరికి వెళ్ళి రావాలను కొంటున్నాను"

"మోహన్ దగ్గరికి ఎందుకు? అతని మీద ఉన్న అనుమానాలన్నీ తీరిపోయా యని అన్నావుగా" అన్నాడు రమేష్

"మోహన్‌ను కలసి మాట్లాడి వస్తానని సాహితికి మాట ఇచ్చాను. అందువల్ల వెళ్ళి ఓ పది నిమిషాలు మాట్లాడి వస్తాను"

"నన్నూ రమ్మంటావా? "

"వద్దు బావా. మీరు పడుకొని రెస్ట్ తీసు కోండి. నేను వెళ్ళివస్తాను. మోహన్ దగ్గ రకు వెళ్తున్నప్పుడు ఇకపై భయపడనవ సరం లేదు"

భోజనాలయ్యాక శశాంక్ మోహన్‌కు ఫోన్ చేసి తన అతని గదికి వస్తున్నట్టు చెప్పాడు. "తప్పకుండా రండి" అంటూ టి.నగర్‌లో ఉన్న తన గదిని ఎలా చేరుకో వాలో చెప్పాడు.

"మూడు గంటలకు రండి. ఈ లోపల నాకు ఒకటి రెండు చిన్న పనులున్నాయి. అవి ముగించుకొని మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను"

"శశాంక్ టైము చూశాడు. 'రెండు గంట లయింది. తను గంట సేపు నిద్రపోవచ్చు' అనుకొని మంచంపై పడుకొన్నాడు. అయితే అతనికి నిద్ర రాలేదు. మోహన్ పరిచయం అయిన రోజునుంచీ జరిగిన సంఘటనలన్నీ ఒక్కొక్కటిగా అతనికి గుర్తు రాసాగాయి.

మోహన్ రాత్రి పన్నెండు గంటలకు తన గదికి వచ్చినప్పుడు తను ఎంతగా భయప డ్డాడో గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు. అలాగే ప్రమీలమ్మ కుటుంబం సెకండ్ షోకి వెళ్ళిన ప్పుడు మోహన్ తనను చంపేస్తాడేమో అనుకొని భయపడటం కూడా గుర్తుకొ చ్చింది. సాహితిని, ప్రమీలమ్మను చూసి తాను మనసులోనే విపరీతంగా జాలిప డడం, మదన్, స్వప్నల పేర్లు పదే పదే ఉచ్చరించి మోహన్‌ను చిరాకుపరచడం గుర్తుకొచ్చి ముసిముసిగా నవ్వుకోసాగాడు.

వంట గదిలోంచి హాల్లోకి వస్తున్న నీరజ నకు శశాంక్ తనలో తాను నవ్వుకోవడం

ఆత్మ నిగ్రహం వినయానికి దారితీస్తుంది. – సంస్కృత సూక్తి



కనిపించింది. గబగబా అతని దగ్గరకు వచ్చి "శశాంక్, ఏమిట్రా నీలో నీవే నవ్వుకొంటున్నావ్? నాకేదో భయంగా ఉందిరా" అంది.

శశాంక్ లేచి కూర్చుని నవ్వుతూ "మోహన్‌ను చూచి నేను ఎంతగా భయపడేవాణ్ణో, ఎంతగా అనుమానించేవాణ్ణో తలచుకొంటూంటే నాకు నవ్వొచ్చింది. అది సరేగాని నీకు ఆనందాన్ని, అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించే విషయం చెప్పనా" అన్నాడు.

"చెప్పు" అంది కుతూహలంగా అతని వంకే చూస్తూ.

"నీకు తట్టుకొనే శక్తి ఉందా?"

"ఉందిలే. త్వరగా చెప్పు" విసుగు, ఆత్రం కలసిన స్వరంతో అంది.

"నేను డాక్టర్ మాధవిని పెళ్ళి చేసుకోబోతున్నాను"

'ఆ...' అంటూ నోరు తెరచి కూర్చుండిపోయింది నీరజ.

"అందుకే నీకు తట్టుకునే శక్తి ఉందా అని అడిగాను. మంచినీళ్ళు ఇవ్వనా?"

"చాల్లేరా నీ వేళాకోళాలు. నీవు చెప్పింది విని షాకయ్యాను గాని ఆనందాన్నిచ్చిన షాక్ ఇది. ఆ రోజు మా యింటికి వచ్చి వెళ్ళింతర్వాత చాలా రోజులు ఆ అమ్మాయి రూపం నా మదిలో మెదులుతూనే ఉంది. ఆ తెల్లని తెలుపు, మెరిసే కళ్ళు, ఆహ్లాదం కలిగించే చిరునవ్వు, చక్కని పర్సనాలిటీ- ఎంత బాగుంది యీ అమ్మాయి? అనుకున్నాను. మీరిద్దరూ ఒకటైతే బాగుంటుందని కూడా అనుకున్నాను. నా కోరిక ఫలించింది. కంగ్రాట్స్‌రా శశాంక్" చేయందిస్తూ అంది.

"సరేగాని నీవు అప్పుడే బావ చెవిలో ఊదేయకు. అన్నీ కుదిరాక చెబుదువుగానీ"

"ఇప్పుడు నేను 'సరే' అంటాను. నువ్వలా వెళ్ళగానే ఆయనకు చెప్పేస్తాను. ఇంత

ఆనందాన్ని దాచుకోవడం నా వల్ల కాదు' అంటూ వెళ్ళిపోయింది.

శశాంక్ నవ్వుకుంటూ మోహన్ దగ్గరికి వెళ్ళడానికి సిద్ధమవసాగాడు.

★ ★ ★

మోహన్ చెప్పిన అడ్రసు ప్రకారం అతని గదిని వెతుక్కుంటూ వచ్చి ఆటో దిగాడు శశాంక్. మోహన్ బయటే నిలబడి ఉన్నాడు. శశాంక్‌ను చూడగానే దగ్గరకు వచ్చి "రండి" అంటూ చేయి అందుకొని లోపలికి పిలుచుకెళ్ళాడు. గది విశాలంగా ఉంది. అన్ని వస్తువులూ వాటి వాటి స్థానాలలో అందంగా అమర్చబడి ఉన్నాయి. టేబుల్ మీద మోహన్ కిట్ ఉంది. దానిమీద మోహన్ పనిచేసే కంపెనీ పేరు, ఎంబ్లమ్ ఉన్నాయి.



"ఏం చేస్తున్నారు?" అని అడిగాడు టేబుల్ పైన ఉన్న కాగితాల వైపు చూస్తూ.

"సేల్స్ ఫిగర్స్ చూసుకొంటున్నాను. సాహితి ఎలా ఉంది? ప్రమీలమ్మ గారు, ముకుందరావుగారు, కీర్తన అందరూ బాగున్నారు కదా?" అన్నాడు మోహన్.

"అందరూ బాగున్నారు. మిమ్మల్ని అడిగినట్లు చెప్పమన్నారు"

రెండు నిమిషాల తర్వాత ఓ కుర్రాడు రెండు కూల్‌డ్రింక్స్ తెచ్చి ఇద్దరికీ ఇచ్చాడు.

"ఇదేమిటి? ముందే అరేంజ్ చేశారా?" ఆశ్చర్యంగా అడిగాడు శశాంక్.

"అవును. ఎదురుగా ఉన్న షాపులో చెప్పాను. మీరు వచ్చిన పది నిమిషాల తర్వాత తెమ్మన్నాను. అయిదు నిమిషాలకంతా తెచ్చేశాడు" అన్నాడు మోహన్ నవ్వుతూ.

"వద్దండీ. రెండు గంటలకు భోజనం చేశాను నేను"

"అందుకే కాఫీ తెప్పించలేదు. ఫర్వాలేదు తాగండి" అన్నాడు మోహన్. తర్వాత ఇద్దరూ తమ కంపెనీల గురించి, తమ ఉద్యోగంలో ఉన్న సమస్యల గురించి మాట్లాడుకొన్నారు. ఉన్నట్టుండి శశాంక్‌కు స్వప్న గుర్తొచ్చింది.

"మోహన్ గారూ. మీ తల్లిదండ్రులకు మీరు ఒక్కడే కొడుకని విన్నాను. నిజమేనా!"

"అవును" 'అయితే ఏం' అన్నట్టు చూశాడు మోహన్.

"మీకు కజిన్స్ ఎవరైనా ఉన్నారా?"

"ముగ్గురు ఉండేవాళ్ళు. ఇప్పుడు ఇద్దరే ఉన్నారు"

"అంటే ఒకరు..."

"అవును. ఒకమ్మాయి చనిపోయింది' బాధగా అన్నాడు.

"ఆ అమ్మాయి పేరు స్వప్నా?"

ఆశ్చర్యంగా శశాంక్‌వైపు చూశాడు మోహన్. "స్వప్న మీకెలా తెలుసు" అని అడిగాడు.

"నెల్లూరులో మాధవి అని ఒక డాక్టరున్నారు. నేను ఆవిడని తరచుగా కలుస్తుంటాను. స్వప్న ఆవిడకు ప్రాణ స్నేహితురాలు. ఒకసారి ఆవిడ క్లినిక్‌లో స్వప్నగారిని నాకు పరిచయం చేశారు. మిమ్మల్ని చూస్తుంటే స్వప్న పోలికలు బాగా కనిపించాయి నాకు. అందుకే అనుమానమొచ్చి అడిగాను"

"ఆ ముగ్గురిలోకి స్వప్న అంటే నాకు ప్రాణం. కొన్ని ఇబ్బందుల వల్ల వాళ్ల

ఇంటికి వెళ్లేవాణ్ణి కాను. అయితే నేను స్వప్నకు ఫోన్ చేయగానే నేనెక్కడున్నా వచ్చికలసి మాట్లాడి వెళ్లేది. ఆమె పోయాక ఆ ఇద్దర్నీ కలవాలన్నా నాకు. భయంగా ఉంది వాళ్ల దుఃఖం నేను చూళ్లేను" అతని కళ్లలో నీళ్లు చూసి చలించిపోయాడు శశాంక్.

"బాధపడకండి ప్లీజ్" అన్నాడు.

ఆ తర్వాత స్వప్నతో తన అనుబంధం గురించి చెప్పాడు మోహన్. తర్వాత "శశాంక్‌గారూ. మిమ్మల్ని నెల్లూరులో కంటే ఇక్కడ కలుసుంటేనే ఎంతో ఆత్మీయంగా అన్పిస్తున్నారు నాకు" అన్నాడు.

"అందుకే ప్రదేశాలు మారుతూ ఉంటే ఆలోచనల్లోనూ మార్పు వస్తాయని మానసిక నిపుణులు అంటుంటారు. అన్నట్లు మోహన్‌గారూ. మీరు మరోలా అనుకోనంటే ఓ విషయం అడగాలని ఉంది. ఓ మంచి స్నేహితుడిగా మిమ్మల్ని ఆ విషయం అడగవచ్చనే అనుకొంటున్నాను"

"అడగండి"

"మొన్న మీరు నెల్లూరు వచ్చినపుడు తాగి ఉన్నారని ప్రమీలమ్మగారు చెప్పారు. మొదట నేను నమ్మలేదు. కాని వాళ్లకు ఆ వాసన కొత్తకాదు కాబట్టి నిజమే చెబుతున్నారనిపించింది. ముకుందరావు తాగుడుతో విసిగిపోయి ఉన్న వాళ్లు మీరూ అలా తయారవుతారేమోనని భయంతో ఉన్నారు"

మోహన్ తలపంకిస్తూ "వాళ్లు అలా భయపడటం సహజమే. ఈమధ్య టార్గెట్లు మించి బిజినెస్ చేశామని మా కంపెనీ బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చింది. ఆ పార్టీలో స్నేహితుల బలవంతంవల్ల నేనూ తాగవలసి వచ్చింది. ఆ రోజునుంచీ అది అలవాటుగా మారింది. నెల్లూరుకు వచ్చినప్పుడు కూడా తాగాను. ఆ రోజు అర్థమైంది నాకు అది అలవాటు కాదని, వ్యసనంగా మారిందని. ఆరోజు రాత్రి మీరు నిద్రలో ఉన్నందువల్ల మీ గది తలుపు తీయలేదు. అత్తగారు ముకుందరావు మంచం పక్కనే నాకూ మంచం వేశారు. ఆయన్ను, ఆయన వల్ల వాళ్లు పడుతున్న బాధనూ చూసిన తర్వాత నావల్ల వాళ్లకు ఏ బాధా ఉండకూడదని నిశ్చయించుకొని ఆ రోజు నుంచి ఈ రోజు వరకూనేను. మద్యం ముట్టలేదు ముట్టను కూడా" అన్నాడు చివరి మాట స్థిరంగా పలుకుతూ.

అతని మాటలకు శశాంక్ ఎంతో సంతోషించాడు. "వెరీగుడ్! నా దృష్టిలో బలహీనతలు లేనివాడు ఎంత గొప్పవాడో బలహీనతల్ని జయించినవాడు కూడా అంతే గొప్పవాడు" అన్నాడు.

కొంతసేపు మాట్లాడుకొన్నాక శశాంక్ లేచి నిలబడి "నేను వెళ్లి వస్తాను. మీరు నెల్లూరు ఎప్పుడు వస్తారు? "అని అడిగాడు.

"నాకు రోజూ రావాలనే ఉంది. అయితే తరచుగా వెళితే వాళ్లకు ఇబ్బందిగా ఉంటుంది. నాకూ బిజినెస్ దెబ్బతింటుంది. కొద్దిరోజులాగి వీలుచేసుకొని వస్తాను"

"సరే. సాహితికి ఏం చెప్పమంటారు? " నవ్వుతూ అడిగాడు శశాంక్.

మోహన్ కూడా నవ్వుతూ "అడిగానని చెప్పండి. మా అత్తగారూ, మామగార్లను కూడా అడిగినట్లు చెప్పండి. పెళ్లి వీలైనంత సింపుల్‌గా చెయ్యమనండి. అనవసరంగా ఖర్చులు చేసి ఇబ్బంది పడవద్దని చెప్పండి. ఒకవేళ 'సాహితి పెళ్లికి ఇంత మొత్తం ఖర్చు చేయాలి' అనుకొని ఉంటే పెళ్లి సింపుల్‌గా చేసి మిగిలింది సాహితి పేరుమీద బ్యాంకులో వెయ్యమనండి. మా పిల్లల చదువులకో, మేము ఇల్లు కొనడానికో ఉపయోగపడుతుంది" అన్నాడు.

"మీరు చెప్పింది నాకూ నచ్చింది. ఆ విషయం వాళ్లతో చెబుతాను. ఉంటాను" మోహన్ రోడ్డు చివరి వరకూ వచ్చి శశాంక్‌ను ఆటో ఎక్కించాడు.

శశాంక్ సెంట్రల్ రైల్వేస్టేషన్ ముందు ఆటో దిగాడు. తన బ్రీఫ్‌కేసు తీసుకొని

స్టేషన్ లోనికి పోబోతుంటే అతని సెల్ మోగింది. జేబులోంచి తీసి 'హలో' అన్నాడు.

"శశాంకేనా మాట్లాడేది" ఆడగొంతు విని పించింది.

"అవును. మీరు..? "

"హసీనా పక్కింటివాళ్లం. ఉదయం నాతో మాట్లాడి మీ నెంబరు ఇచ్చారుగా"

"అవును. హసీనా ఇంటికి వచ్చిందా? " ఆత్రంగా అడిగాడు.

"లేదు. మిమ్మల్ని చూస్తే నాకెందుకో సదభిప్రాయం కలిగింది. నిజంగా మీరు ఓ అమ్మాయి జీవితాన్ని కాపాడే ప్రయత్నంలో ఉన్నారని నమ్మి మీకు ఫోన్ చేస్తానని ఒప్పుకున్నాను. కాని మీరు నాతో పరాచి కాలు ఆడారని తెలిసి ఎంతో అవమానంగా ఫీలయ్యాను. ఉదయమే మీకు ఫోన్ చేసి దులిపేద్దామనుకున్నాను. మళ్లీ 'మీరు ఫోను చేయడం కూడా దండగే' అనుకొని చెయ్యలేదు. అయినా మనసు పోరు పెడు తూంటే ఇప్పుడు చేశాను"

"నేను పరాచికాలాడ్డం ఏమిటి? ఎందు కలా అనుకొంటున్నారు? "

"బుకాయించకండి. ఉదయం మీతోపాటు వచ్చిందెవరు? "

"ఇన్స్పెక్టర్ సుందర్"

"మొదటిసారి కాదు. రెండవసారి వచ్చిన పుడు"

"నా స్నేహితుడు ఉదయ్"

"అతనికి హసీనాతో పరిచయం ఉందా? "

"లేదు"

"మీరు అమాయకులో, అమాయకత్వం నటిస్తున్నారో నాకు అర్థం కావడంలేదు"

"అసలు మీరు మాట్లాడుతున్నది ఒక్క ముక్క కూడా నాకు అర్థం కావడంలేదు" విసుగ్గా అన్నాడు శశాంక్.

"అయితే వినండి. నిన్న సాయంత్రం హసీనాను బైక్‌మీద తీసుకెళ్లినవాడు, మీరు రెండవసారి హసీనా ఇంటికి వచ్చినపుడు మీతోపాటు ఉన్నవాడూ ఒ...క్క...డే"

★ ★ ★

తాను విన్నది అర్థం చేసుకోవడానికి కొన్ని సెకన్లు పట్టింది శశాంక్‌కు.

"హలో... హలో" ఫోనులో ఆడగొంతు వినిపిస్తూంది అతనికి. వెంటనే తేరుకొని "మీరు చెప్పింది నాకర్థమైంది. చాలా ముఖ్యమైన, విలువైన విషయం చెప్పారు మీరు. మీకు చాలా చాలా థాంక్స్. జరిగి నదంతా ఫోనులో చెప్పడం వీలుకాదు. నేను నెల్లూరు వెళ్లిపోతున్నాను. భవిష్య త్తులో మనం మళ్లీ కలిస్తే అప్పుడు చెబు తాను. కాని ఒక్కటిమాత్రం చెప్పగలను. నా మనసులో ఎటువంటి చెడు ఆలోచనలు గాని, ఒకరికి చెడు చేయాలన్న తలంపు గానిలేదు. మీరు మాత్రం హసీనా తన ఇంటికి రాగానే కాస్త శ్రమ తీసుకొని నాకు ఫోన్ చేయండి. ఆమెను నేను కలవడానికి కాదు- ఆమె క్షేమంగా ఉందన్న విషయం తెలిసి నేను నిశ్చింతగా ఉండటానికి. బై" సెల్ ఆఫ్ చేశాడు శశాంక్.

అతనికి కళ్లు తిరుగుతున్నట్లు అన్పిం చింది. ఒంట్లో నిస్సత్తువ ఆవహించింది. గుండెలు పిండేస్తున్న బాధ. స్నేహం మోసం చేసిందన్న బాధ. నీరసంగా నడుస్తూ వెళ్లి టికెట్టు తీసుకొని ట్రైనులో కూర్చున్నాడు. అతనికి తలనొప్పి మొద లైంది. జ్వరం వచ్చినట్లు కూడా అన్పించసా గింది. తన కూపేలో ఇంకా ఎవరూ రాక పోవడంతో బ్రీఫ్‌కేస్ తలకింద పెట్టుకొని పడుకొన్నాడు.

అంతలో అతనికి తను చేయవలసిన మరొక పని గుర్తుకొచ్చింది. ట్రైను దిగి ప్లాట్‌ఫారం మీద నిలబడి సుందర్‌కు ఫోన్ చేశాడు. సుందర్ లైన్లోకి రాగానే

పుట్టుక నుండీ కాటి వరకూ సక్రమైన, సరైన జ్ఞానాన్నే ఆర్జించు.
– మహమ్మద్ ప్రవక్త

తను తెలుసుకొన్న విషయాన్ని అతనితో చెప్పాడు.

"వెరీ ఇంటరెస్టింగ్. మీరు ఉదయ్ అడ్రస్ చెప్పండి. అతనిపై నిఘా ఉంచుతాను" అన్నాడు సుందర్. శశాంక్ చెప్పాడు.

"వెరీగుడ్. ఇప్పుడే అడయార్ పోలీసుస్టేషన్‌కు ఫోన్ చేసి అతని ఇంటిముందు ఇద్దరు పోలీసులు మఫ్టీలో ఉండేలా ఏర్పాటుచేస్తాను. అతన్ని ఫాలో అయితే హసీనాను ఎక్కడ దాచారో తెలుసుకోవచ్చు ఆ గ్యాంగ్‌లోని మిగతా కుర్రాళ్లని కూడా అతని ద్వారా పట్టుకోవచ్చు"

"జాగ్రత్త. మీకు చెప్పేంతవాణ్ణి కాదు గాని ఉదయ్‌కు ఏమాత్రం అనుమానం రాకుండా ఉంటేనే మీరు హసీనాను కనుక్కోగలరు. దీనికోసం మీ డిపార్ట్‌మెంట్‌లో మెరికల్లాంటి వాళ్లని నియమించాలి. తనను ఎవరో ఫాలో అవుతున్నారన్న అనుమానం ఉదయ్‌కు వచ్చిందంటే వెంటనే అతను తన ప్లాన్లు మార్చుకొంటాడు. అతను చాలా ఇంటిలిజెంట్"

"అలాగే. మా డిపార్ట్‌మెంట్‌లో నాకున్న పలుకుబడి మొత్తం ఉపయోగించి ఉత్సాహం, సమయస్ఫూర్తి ఉండేవాళ్లనే ఈ పనికి నియమించేలా చూస్తాను"

శశాంక్ తృప్తిగా నిట్టూర్చాడు. అయితే నీరసంవల్ల అతను నిలబడలేకపోతున్నాడు. అక్కడున్న బెంచీపై కూర్చున్నాడు.

"నేను ఉండనా మరి" సుందర్ అడిగాడు.

"మరొక్క విషయం. హసీనా ఇంటికి తిరిగి రాగానే నాకు ఫోన్ చేయండి, నా మనశ్శాంతి కోసం"

సుందర్‌కు ఎంతో ఆశ్చర్యమేసింది. 'ఇంత సెన్సిటివ్ ఫీలింగ్స్ ఉన్న వ్యక్తి ఎందుకు ఈ పరిశోధనలలోకి దిగాడు?' అనుకొన్నాడు. అంతలోనే అతనికి జవాబు కూడా దొరికింది. 'శశాంక్ సున్నిత మనస్కుడు కాబట్టే తోటివ్యక్తి జీవితం నాశనం కాకూడదని. ఇటువంటి పనులు అతనికి అలవాటు లేకున్నా, అంత ధైర్యం కూడా లేకున్నా, ధైర్యం తెచ్చుకొని ముందడుగు వేశాడు. అంతో ఇంతో సాధించాడు' అనుకొన్నాడు.

"తప్పకుండా చెప్తాను శశాంక్. హ్యాపీజర్నీ".

★ ★ ★

శశాంక్ నెల్లూరు చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది. గదిలోకి రాగానే బట్టలు కూడా మార్చుకోకుండా మంచంపై వాలిపోయాడు. అలాగే నిద్రలోకి జారిపోయాడు.

అరగంట తర్వాత అతని సెల్ మోగింది. బలవంతంగా కళ్లు తెరిచాడు. అప్పటికి తలనొప్పి కొద్దిగా తగ్గినట్లు అన్పించింది. అయితే జ్వరంతో ఒళ్లు కాలిపోతూంది. అతికష్టంమీద టేబుల్‌పై ఉన్న సెల్ అందుకొని, మళ్లీ మంచంపై పడుకొని 'హలో' అన్నాడు నీరసంగా.

"శశాంక్. నేను మాధవిని"

ఆ మాట వీనులవిందుగా వినిపించింది అతనికి. "హలో మాధవిగారూ. ఎలా ఉన్నారు? " అన్నాడు.

"నేను బాగున్నాను. మీరెప్పుడొచ్చారు? "

"అరగంట క్రితం వచ్చాను. అలసటగా ఉంటే అలాగే పడుకొని నిద్రపోయాను"

"మరి భోజనం? "

"జ్వరంగా ఉంది. ఏమీ తినాలని లేదు" అన్నాడు శశాంక్.

"మీ ఇంటికి ఎలా రావాలో చెప్పండి"

"మీకెందుకు శ్రమ! నేను మాత్రలు వేసుకొంటాను"

"మీకు జ్వరమొస్తే నేను విని ఊరుకుంటాననుకొన్నారా? మీరుండేది మధ్వపతి అగ్రహారంలో అని తెలుసు. నేను ఇప్పుడే బయలుదేరి వస్తున్నాను" అంది. "పది

కావస్తోంది టైము" అన్నాడు శశాంక్.

"గాంధీగారు చెప్పిన టైముకు ఇంకా రెండుగంటల సమయముంది"

"ఇల్లు ఎలా తెలుసుకుంటారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"టెలీపతి ద్వారా తెలుసుకుంటాను"

"వద్దులెండి. మాధవీపతి ద్వారా తెలుసు కోండి" అని తన ఇంటికి ఎలా రావాలో చెప్పాడు. సెల్ ఆఫ్ చేసి మళ్లీ నిద్రలోకి జారుకున్నాడు.

పావుగంట తర్వాత మాధవి శశాంక్ గదికి వచ్చింది. "శశాంక్... శశాంక్... అంటూ శశాంక్‌ని పిలిచింది. మాధవి పిలుపు విని కళ్లు తెరచి చూశాడు శశాంక్. ఆమెను చూడగానే అతనిలో చైతన్యం వచ్చింది.

"రండి. కూర్చోండి" అంటూ లేవబోయాడు.

"మీరు లేవకండి. అలాగే పడుకోండి" అని చెప్పి కుర్చీ అతని మంచం దగ్గరగా లాక్కొని కూర్చుంది. అతని చేతిని అందు కొని పల్స్ చూడసాగింది. ఆమె అతని చేతి నలా పట్టుకొని ఉంటే అతనికి ఏదోలా ఉంది. ఆమె చేతివేళ్ళు అతని చేతికి మెత్తగా, చల్లగా తగులుతుంటే అంతవరకూ పరాయి ఆడదాని స్పర్శ ఎరుగని అతని శరీ రంలో, అంత జ్వరంలో కూడా అలజడి మొదలైంది.

ఆమె చేతిని తీసేశాక "పల్స్ రేటు చాలా ఎక్కువగా ఉంది కదూ" అని అడిగాడు. ఆమె అర్థం కానట్లు చూసింది. "మీరు నా చేతిని పట్టుకున్నారు కనుక" అన్నాడు. ఆమె అర్థం అయిందన్నట్లు నవ్వి, సిరంజి లోకి మందును ఎక్కిస్తూ "చాలా ఎక్కువగా ఉన్నది - జ్వరం" అంది.

అతని చేతికి ఇంజక్షన్ ఇచ్చి తనతోపాటు తెచ్చిన ప్లాస్టిక్ బుట్టను టేబుల్ పై పెట్టింది. బుట్టలోని బ్రెడ్ ప్యాకెట్ విప్పి ఓ ప్లేటులో నాలుగు స్లైసెస్ పెట్టింది. ఫ్లాస్కు లోని పాలను ఓ గ్లాసులో పోసి, ఆ గ్లాసును ప్లేటుపై పెట్టి, ప్లేటును శశాంక్‌కు అందించింది.

"మీకు చాలా శ్రమ ఇచ్చాను" అన్నాడు మొహమాటపడుతూ.

"కాదు. అవకాశం ఇచ్చారు. నేను డాక్ట రైనా ఇన్నాళ్లూ మీరే నాకు మందులిచ్చారు. ఈరోజు మీకు మందులిచ్చే అవకాశం నాకు వచ్చింది".

"పగ తీర్చుకున్నారన్నమాట"

"కాదు. ఋణం తీర్చుకున్నాను"

శశాంక్ బ్రెడ్ తిని పాలు తాగాక మాధవి ప్లేటు అందుకొని వాష్ బేసిన్ మీదపెట్టి, అతని మంచం పక్కన టాబ్లెట్లు పెట్టి "పావుగంట తర్వాత ఇవి వేసుకోండి. నేను రేపు ఉదయం వచ్చి చూస్తాను మిమ్మల్ని. మరి నేను వెళ్లిరానా?" అని అడిగింది.

"నేను ఉండమన్నా ఉండరుగా" అన్నాడు.

"నేను ఉందామన్నా ఉండమనరుగా. చుట్టుపక్కలవాళ్ళు ఏమనుకొంటారో అని మీకు భయం"

"ఆ భయం నాకు లేదు. అసలు ఇప్పుడు నాలో ఏ భయాలూ లేవు. మాధవిగారూ! చెన్నైలో నేను అనుకున్నవి కొన్ని జరగ లేదు. అనుకోనివి చాలా జరిగాయి. మీతో నేను చాలా విషయాలు చెప్పాలి"

"రేపు ఉదయం వచ్చినప్పుడు అన్నీ చెబు దురుగానీ ఇప్పుడు మాత్రం మీరు మాత్రలు మింగి, ఏ ఆలోచనా లేకుండా నిద్రపోండి. గుడ్‌నైట్" అంది మాధవి.

"గుడ్‌నైట్" అన్నాడు శశాంక్.

మేడ దిగి కిందకు వచ్చింది మాధవి. ప్రమీలమ్మ బయటే నిలబడి ఉంది. మాధ విని చూసి ప్రశ్నార్థకంగా మొహం పెట్టింది.

మాధవి చేతులు జోడించి "నమస్తే. నా పేరు మాధవి. డాక్టర్ని. శశాంక్ గారికి జ్వరంగా ఉంటే చూడటానికి వచ్చాను" అంది.

"శశాంక్‌కు జ్వరమా? మాకు తెలియనే లేదే. అసలు అతను ఊరినుంచి వచ్చిందే మాకు తెలియలేదు. ఇందాకే పైన లైటు చూసి ఊరి నుంచి వచ్చాడని అనుకొన్నాను. ఎలా ఉందమ్మా ఇప్పుడు? జ్వరం తగ్గిపోతుంది కదా? " అని అడిగింది ఆందోళనగా.

"రేపు ఉదయానికల్లా తగ్గిపోతుంది. మీ గురించి చెప్తూంటారు శశాంక్, మీరు ఆయన్ని సొంత కొడుకులా చూసుకుంటారని".

"నేను అతన్ని చూసుకోవడమేమిటి? అతనే మమ్మల్ని చూసుకుంటున్నాడు. లోపలికి రండి. భోజనం చేసి వెళ్దురు గాని".

"భోజనం ఇంకోరోజు చేస్తాను. ఓ గ్లాసు మంచినీళ్లు ఇవ్వండి"

'రండి లోపలికి' అంటూ లోపలికి పిలుచుకెళ్ళింది ప్రమీలమ్మ. మాధవికి సాహితిని చూడాలని కుతూహలంగా ఉంది. అందుకే కావాలని మంచినీళ్ళు అడిగింది. ఆ సాకుతో ఇంటి లోపలికి వెళితే సాహితిని చూడవచ్చని.

"కూర్చోండి" సోఫా చూపిస్తూ అంది ప్రమీలమ్మ. తర్వాత గదిలోకి వెళ్లి సాహితికి, కీర్తనకి మాధవి వచ్చిన విషయం చెప్పి, వెళ్లి మాట్లాడమని వాళ్ళను పంపి, వంట గదిలోకి వెళ్లింది.

సాహితిని చూడగానే ఆశ్చర్యపోయింది మాధవి. 'ఎంత అందంగా ఉంది ఈమె? శశాంక్ ఈమెని చూసి మనసు పడటంలో ఆశ్చర్యం లేదు. ఈమె అతనికి దక్కకపోవడం అతని దురదృష్టమైతే, అతను తనను దొరకడం తన అదృష్టం' అనుకుంది.

"నమస్తే! నా పేరు సాహితి. నా చెల్లెలు కీర్తన" అంది సాహితి మాధవితో.

"నమస్తే. శశాంక్‌గారి ద్వారా మీరంతా నాకు పరిచయమే. కూర్చోండి" అంది మాధవి. ప్రమీలమ్మ ఇచ్చిన మంచినీళ్ళు త్రాగాక "నేను వెళ్ళి వస్తాను" అంది ప్రమీలమ్మ శశాంక్‌ను జ్వరం వచ్చిందని తన కూతుళ్ళకు చెప్పడంతో వాళ్ళిద్దరూ ఆందోళనగా మొహం పెట్టారు. అది చూసి మాధవి "మీరేం కంగారు పడకండి. రేపు ఉదయానికల్లా తగ్గిపోతుంది. రేపు ఉదయం ఎనిమిది గంటలకు ఒకసారి వచ్చి ఆయన్ను చూస్తాను" అంది.

మాధవి కోసం బయట ఆటో ఎదురు చూస్తూండటం చూసి "మీరు ఆటోలో వచ్చిందే నేను గమనించలేదు" అంది ప్రమీలమ్మ.

"మీరు లోపల పనుల్లో ఉండి ఉంటారు. నేను రోజూ క్లినిక్‌కు వెళ్ళే ఆటోలో వచ్చాను. ఆటో అతను అరగంట తర్వాత మళ్ళీ ఇక్కడికి వచ్చి నా కోసం ఎదురు చూస్తానన్నాడు. ఇంత రాత్రిపూట రావొద్దని అంటారు శశాంక్. ఆయన జ్వరం వచ్చి పడుకొని ఉంటే ఓ డాక్టరుగా నేను విని ఎలా ఊరుకోగలను చెప్పండి? "

"మంచి పని చేశారు. రేపు ఉదయం ఎటూ వస్తున్నారు కాబట్టి మా ఇంటికి టిఫిన్‌కు రండి" అంది సాహితి.

"అలాగే. మీ వంట గురించి కూడా శశాంక్ చెప్పారు" అంది మాధవి ప్రమీలమ్మతో.

ఆటో కదలగానే ముగ్గురూ పరుగులాంటి నడకతో శశాంక్ గదికి వెళ్లడం మాధవికి కనిపించింది.



మరుసటిరోజు ఉదయం ఎనిమిది గంటలకు శశాంక్ గదికి వచ్చింది మాధవి. శశాంక్ మంచంమీద కూర్చుని పేపరు చదువుతూ ఉండటం కనిపించింది. అతన్ని అలా చూడగానే రిలీఫ్‌గా ఫీలైంది.

శశాంక్ మాధవిని చూడగానే సంతోషంతో "గుడ్ మార్నింగ్ అండ్ వెల్‌కం" అన్నాడు. మాధవి "గుడ్ మార్నింగ్ శశాంక్" అంటూ వచ్చి కుర్చీలో కూర్చుంది. అతని చేయి అందుకొని పల్స్ చూడాలని




## ద్వితీయశ్రేణి నాయకుడిని

"మనలాంటి ప్రముఖ నాయకులంతా అధికార రాజకీయాలనుంచి వైదొలగి ప్రజల్లోకి వచ్చి నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపడితే మంచిది" అన్నారు లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ్ నెహ్రూతో ఓసారి.

మీలాంటి ప్రముఖులంతా ఆ పనిచేయండి.. నేను ప్రముఖుడిని కాను ద్వితీయశ్రేణి నాయకుడిని. మాలాంటి వాళ్లం ఈ రాజకీయ అధికారాల విషయం చూసుకుంటాం' అన్నారు నెహ్రూ తడుముకోకుండా.

అనుకొంది మొదట. మళ్లీ అతను ముందు రోజు అన్నది గుర్తొచ్చి ఆ ప్రయత్నం మానుకొంది.

"ఎలా ఉంది? " అని అడిగింది.

"జ్వరం తగ్గింది. ఉదయం థర్మామీటర్ రీడింగ్ చూశాను. టెంపరేచర్ నార్మల్‌కి వచ్చింది". మాధవి పర్సు నుంచి టాబ్లెట్లు తీసి టేబుల్‌పై పెట్టి "ఆ మాత్రలు మూడు పూటలు వేసుకోండి. అవి అయిపొయ్యేవరకు" అంది.

తర్వాత "ఇప్పుడు చెప్పండి చెన్నై విశేషాలు? " అంది.

శశాంక్ తను రామకృష్ణ దగ్గర సెలవు తీసుకుని ఉదయ్‌ను కలిసినప్పటి నుంచి రైల్వేస్టేషన్‌లో సుందర్‌కు ఫోన్ చేయడం వరకు మొత్తం చెప్పాడు. ఉదయ్ ఆ గ్యాంగ్‌లోని వ్యక్తి అని తెలియగానే మాధవి మొహం పాలిపోయింది.

"వాడు ఎన్నో వ్యాపారాలు చేసి బాగా సంపాదిస్తున్నాడని విన్నాను గాని ఇలాంటి వ్యాపారాలు చేస్తున్నాడనుకోలేదు" అంది బాధగా.

"బాధ పడకండి. మీరేం చేయగలరు? అయితే చేసిన పాపం అతను అనుభవించక తప్పదు. ఈసారి చట్టం నుంచి తప్పించుకోలేడు".

"తప్పించుకోకూడదు కూడా. అదే జరిగితే మరికొందరి జీవితాలు పాడవుతాయి. మిమ్మల్ని వాడి దగ్గరకు పంపించి మిమ్మల్ని ఇబ్బందులపాలు చేశాను".

"భలేవారే. మీరు ఎంత మంచి పని చేశారో మీకు ఇప్పుడు తెలియదు. ఆ గ్యాంగు మొత్తం దొరికితే ఆ క్రెడిట్ మీదే. ఎందుకంటే మీవల్లే నేను ఉదయ్‌ని కలిశాను. మీ పేరు చెప్పినందుకే నన్ను చంపకుండా వదిలిపెట్టాడేమో" అన్నాడు.

మాధవి ఆ మాట వినలేనట్లు మొహం పెట్టింది.

తర్వాత శశాంక్ చెప్పసాగాడు.

"నేను మొదటిసారి ఉదయ్‌ని కలిసినప్పుడు నన్ను ఈ ఎంక్వయిరీలు మానెయ్యమని ఎంతో చెప్పాడు. నన్ను భయపెట్టాడు. నేను తన అక్కయ్య స్నేహితుణ్ణి కాబట్టి నా క్షేమం కోరి నన్ను వారిస్తున్నాడనుకున్నాను. నేను పట్టిన పట్టు విడవకపోవడంతో తప్పనిసరిగా నాతో వచ్చాడు. నన్ను మందవల్లిలోని స్వప్న పనిచేసిన కాలేజీ దగ్గర డ్రాప్ చేసి తనకు పనుందని వెళ్లిపోయాడు. నా ఊహ ప్రకారం నేను నళినితో మాట్లాడుతున్న సమయంలో



ఉదయ్ హసీనా ఇంటికి వెళ్లి ఆమెని బెదిరించి, నేను ఎవరి ఫొటో చూపితే అతన్నే హంతకుడిగా గుర్తించమని చెప్పి ఉంటాడు. తర్వాత కాలేజీ దగ్గరికి వచ్చి నా కోసం ఎదురు చూడసాగాడు. హసీనా అడ్రస్ తనకు తెలియనట్లు నన్ను అడ్రస్ అడిగాడు. నేను హసీనాకు స్వప్నతో ఉన్న మోహన్ ఫొటోను చూపితే 'మొహం సరిగ్గా కనిపించడం లేదని' చెప్పి తప్పించుకొంది. పెట్రోలు పోయించుకోవడం కోసం వెళ్లిన ఉదయ్ సరిగ్గా నేను బయలుదేరుతున్నప్పుడు వచ్చాడు. తిరిగి వెళ్తున్నప్పుడు దారిలో అడిగాడు హసీనా ఏమని చెప్పిందని. బహుళ నా సమాధానం విని తృప్తి పడి ఉంటాడు. సదాశివరావు ఇచ్చిన ఫొటో హసీనాకు చూపగానే మరో ఆలోచన లేకుండా మోహన్ని హంతకుడని చెప్పింది. నిజానికి హంతకుడు మోహన్ కాదు. ఉదయ్‌గాని, అతని సన్నిహిత మిత్రుడు గాని అయి ఉంటారు".

శశాంక్ చెప్తూంటే ఆసక్తిగా వింటూంది మాధవి.

"మొన్న సాయంత్రం నేనూ, ఉదయ్ కలిసి హోటల్‌లో టిఫిన్ తిన్నాం. మరుసటిరోజు ఉదయం హసీనా ఇంటికి వెళ్లాలని, అతన్నీ రమ్మనీ కోరాను నేను. తర్వాత నేను స్వప్న చెల్లెళ్ళతో మోహన్ ఫొటో చూపించి వివరాలు కనుక్కోవాలని వెళ్లాను. సరిగ్గా ఆ సమయంలోనే ఉదయ్ హసీనా ఇంటికెళ్ళి ఆమెను బలవంతంగా తనతో బయల్దేరదీసి ఎక్కడో దాచేశాడు. నేను మరుసటిరోజు ఆమెను కలవకుండా చేసి తన గుట్టు కాపాడుకున్నాడు.

సినిమా థియేటర్లో ఉదయ్ నాకు కనిపించినా అనుమానం రాలేదు. నన్ను కొట్టింది కూడా ఉదయ్‌గాని, అతని సహచరులుగాని అయి ఉంటారు. నేను భయంతో స్పృహ

తప్పడం వల్ల ఎవరు కొట్టారో చూడలేకపోయాను. అయితే నేను సినిమాకు బయలుదేరే ముందు మోహన్‌కు ఫోన్ చేశాను కనుక నాకు అతనిమీదికి అనుమానం పోయింది. అయితే నన్ను కొట్టింది మోహన్ అయి ఉండడని ఉదయ్ చెప్పాడు. నన్ను మరింతగా భయపెట్టడం కోసం ఇది మోహన్ పని కాదని, ఆ గ్యాంగ్ పనేనని, నేను చాలా ప్రమాదంలో ఉన్నానని, నన్ను చెన్నై విడిచిపెట్టి వెళ్లిపొమ్మని చెప్పాడు. నేను అతని మాటలన్నీ నమ్మాను. అయితే హసీనాను కలవాలనే కోరిక బలంగానే ఉండటం వల్ల వెంటనే నెల్లూరుకు బయలుదేరలేదు.

నేను హసీనా ఇంటికి వెళ్లానో లేదో తెలుసుకోవడానికి మళ్లీ ఫోన్ చేశాడు. 'నేను బయలుదేరుతున్నాను' అని చెప్పగానే తానే వచ్చి నన్ను తీసుకెళ్ళాడు. నేను ఇరుగుపొరుగు వాళ్ళతో మాట్లాడితే వాళ్ళు అతని గుర్తులు చెబుతారేమోనన్న భయంతో నన్ను ఒంటరిగా వెళ్లనివ్వలేదు. అయితే నేను ఇన్‌స్పెక్టర్ సుందర్‌తో అక్కడికి వెళ్లిన విషయం, పక్కింటావిడతో మాట్లాడిన విషయం అతనికి తెలియదు. పక్కింటావిడతో మాట్లాడటం ఎంత మంచిదైందో.

ఆవిడ ఫోన్లో చెప్పిన విషయం విన్నాక అర్థమైంది నాకు. ఇప్పుడు ఉదయ్ యింటి చుట్టూ పోలీసుల నిఘా ఉంది. త్వరలోనే అతను దొరికిపోతాడు. అయితే అతని తల్లితండ్రుల్ని తలచుకుంటే ఎంతో బాధేస్తుంది నాకు. ఎటువంటి తల్లితండ్రులకు ఎటువంటి కొడుకు? తమ కొడుకు సమాజానికి చీడపురుగులా తయారయ్యాడన్న నిజం వాళ్ళకు తెలిస్తే ఆ వార్తను వాళ్ళు ఎలా తట్టుకుంటారో పాపం"

"అవును. వాళ్ళిద్దరూ చాలా మంచివాళ్ళు. చీమకు కూడా అపకారం చేయనివారు." అంది మాధవి, తానూ చాలా బాధపడుతూ.

"అన్నట్టు మిమ్మల్నొక విషయం అడగాలి. స్వప్న చెల్లెలు మోహన్ ఫోటో చూచి 'అతను తన పెదనాన్న కొడుకని' చెప్పింది. స్వప్న మీతో ఎప్పుడైనా తనకొక పెదనాన్న కొడుకు ఉన్నాడని, అతనంటే తనకు చాలా యిష్టమని చెప్పిందా?" అని అడిగాడు శశాంక్.

"నాకు గుర్తులేదు"

"మోహన్ గురించి నా అనుమానాలన్నీ తీరిపోయాయి. మోహన్ తన విజిటింగ్ కార్డులో ఉన్న కంపెనీలోనే పనిచేస్తున్నాడు. స్వప్నకు అతను అన్నయ్య అవుతాడు కాబట్టి అతను స్వప్నను మోసం చేసే అవకాశం లేదు. అందువల్ల నాజర్‌ని చంపే అవసరం కూడా అతనికి లేదు. తన తాగుడు గురించి కూడా బాధపడి యిప్పుడు తను తాగడం లేదని చెప్పాడు. సాహితి పెళ్ళికి ఉన్న అడ్డంకులూ, అనుమానాలూ అన్నీ తొలగిపోయాయి. ఇకపోతే మదన్ ఎవరు అన్న ఒక్క విషయం పెండింగ్‌లో పడింది. మదన్- ఉదయ్ కావచ్చు లేదా ఉదయ్ స్నేహితుడెవరైనా కావచ్చు నా ఫ్రెండు రామకృష్ణ దగ్గర బ్యాంకులో క్లియరింగ్ ప్రొసీజర్స్ గురించి కొన్ని విషయాలు తెలుసుకోవాలి. అవి తెలుసుకొని ఒకసారి చెన్నై వెళ్ళి వచ్చానంటే మదన్ ఎవరో తెలిసిపోతుంది"

"మన పెళ్ళితో, సాహితి పెళ్ళితో కథ సుఖాంతం అవుతుంది"

"హసీనా క్షేమంగా యింటికి తిరిగొస్తేనే కథ సుఖాంతం అయినట్లు"

మాధవికి అతని బాధ అర్థమైంది. 'తన వల్లే ఆమె యిబ్బందుల్లో పడిందని చాలా ఫీలవుతున్నాడు శశాంక్' అనుకుంది.

"హసీనా క్షేమంగా తిరిగి వస్తుంది. కథ సుఖాంతమే అవుతుంది. నేను చెబుతున్నానుగా. అన్నట్టు మీ తలకు దెబ్బతగిలిందన్నారే. ఎక్కడ చూపండి" అంటూ లేచి అతని దగ్గరగా వచ్చింది. శశాంక్ చేయి

తలమీద పెట్టి వేళ్ళతో దెబ్బతగిలినచోటు చూపించాడు. మాధవి తన వేళ్ళతో వెంట్రుకలను పక్కకు తోసి గాయాన్ని చూడసాగింది. శశాంక్‌కు ఆమె అంత సన్నిహితంగా, సమీపంగా ఉండటం ఎంతో హాయిని కలగజేసింది. ఆమె కట్టుకొన్న బెంగాలీ కాటన్ చీర అతని మొహానికి తగుల్తోంది. చీరకు అంటిన సెంటు పరిమళం అతన్ని ఏదో లోకాలకు తీసుకెళుతోంది. ఆమె చేతివేళ్ళు తన తలవెంట్రుకల్ని సున్నితంగా తాకుతూంటే తన్మయత్వంగా ఫీలౌతూ ఒక క్షణం కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తెరచి చూచేసరికి ఎదురుగా సాహితి ఎంట్రన్స్ దగ్గర నిలబడి ఉంది.

మాధవిని, శశాంక్‌ను అంత సన్నిహితంగా చూచిన సాహితి యిబ్బందిగా చూసి వెళ్ళిపోబోయింది. సరిగ్గా అప్పుడే సాహితిని చూసిన మాధవి "సాహితిగారూ. ఒక నిమిషం రండి" అంటూ పిలిచింది. సాహితి తప్పదన్నట్లు ఆమెని సమీపించింది. తనను చూసి కూడా వాళ్ళు దూరంగా జరిగిపోనందుకు మనసులోనే ఆశ్చర్యపడింది. చిరాకు పడింది కూడా.

"ఇది చూశారా? శశాంక్‌గారు చెన్నైలో థియేటర్‌లో కింద పడ్డారట. తలకు దెబ్బతగిలింది" అంటూ దెబ్బతగిలిన ప్రదేశాన్ని సాహితికి చూపింది. సాహితి చూసి "అయ్యో" అంది. తను ఊహించినట్లు వారు సన్నిహితంగా లేరని, ఓ డాక్టరుగా ఆమె శశాంక్‌కు అయిన గాయాన్ని చూస్తోందని తెలిశాక వాళ్ళగురించి మరోవిధంగా అనుకున్నందుకు సిగ్గుపడింది సాహితి.

"మీ చెన్నై డాక్టరు చెప్పినట్లు దెబ్బ గట్టిగా తగల్లేదు. గాయం కూడా పూర్తిగా మానిపోయింది" అని సాహితి ప్రక్కన వచ్చి నిలబడింది మాధవి.

"అమ్మ టిఫిన్‌కు పిలుస్తోంది మీ యిద్దరినీ" అంది సాహితి.

"అలాగే. ఓ రెండు నిమిషాల్లో వచ్చేస్తాము" అన్నాడు శశాంక్. సాహితి వెళ్ళిపోయింది.

"మీరు సాహితిని చూడగానే దూరంగా జరిగిపోతారని భయపడ్డాను. అలా చేసి ఉంటే మనం తలుపులు తెరచుకొని అలా క్లోజ్‌గా ఉన్నామన్న ఆమె అభిప్రాయాన్ని కన్‌ఫం చేసినట్లు అయ్యేది. మీరు తెలివిగా అక్కడే నిలబడి, ఆమెకు గాయాన్ని కూడా చూపి ఆమె అపోహను పోగొట్టారు" అన్నాడు మెచ్చుకోలుగా చూస్తూ.

తర్వాత యిద్దరూ ప్రమీలమ్మ యింటికి వెళ్ళారు. అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర సిద్ధంగా ఉన్నారు. ఇడ్లీలు, కొబ్బరి చట్నీ, ఎర్రగడ్డల సాంబారు చేసింది ప్రమీలమ్మ. అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ తిన్నారు. కొబ్బరి చట్నీ మాధవికి చాలా నచ్చింది. 'చాలా రోజుల తరువాత వీళ్ళింట్లో ఎలాంటి భయాలు, బాధలూ, అలజడులూ లేకుండా తృప్తిగా తిన్నాను" అనుకున్నాడు శశాంక్.

మాధవి అందరికీ తన కృతజ్ఞతలు చెప్పి బయలుదేరింది. ప్రమీలమ్మ రవిక పెట్టి తాంబూలం యిచ్చింది మాధవికి. శశాంక్ మాధవిని ప్రేమిస్తున్నాడేమోనన్న అనుమానం ప్రమీలమ్మకు వచ్చింది. 'అదే నిజమైతే శశాంక్ నిజంగా అదృష్టవంతుడు. అతని మంచితనం అతనికి అన్నీ మంచే చేస్తుంది' అనుకుంది మనసులో.

శశాంక్ గేటు వరకూ వచ్చి మాధవికి థాంక్స్ చెప్పాడు.

'నా కోసం ఎంతో శ్రమ తీసుకొని, యింటికి వచ్చి ట్రీట్‌మెంట్ యిచ్చారు. మీకు చాలా థాంక్స్" "థాంక్స్ చెబుతున్నారు. నాకు ఫీజు యివ్వరా ఏమిటి? "

"ఎందుకివ్వను? " అంటూ జేబులో చేయి

సుఖదుఃఖాల పైన ఆధిపత్యం సంపాదించిన వ్యక్తే జీవితంలో విజయానికి చేరువవుతాడు. – విశ్వేశ్వరయ్య

పెట్టాడు శశాంక్.

"డబ్బులొద్దు. ఫీజు ఏ రూపంలో కావాలో తర్వాత చెబుతాను. శశాంక్ ఈ రోజు డ్యూటీకి వెళ్ళకండి. హాయిగా రెస్ట్ తీసుకోండి"

"రోజంతా గదిలో పడుకొని ఏం చేయను? ఈ రోజు జ్వరం కూడా లేదు. కొంతమంది డాక్టర్లను మాత్రం కలసి వస్తాను"

"జ్వరం తిరగబడితే మీకే యిబ్బంది. ప్లీజ్. నా మాట వినండి" అంది అర్థింపుగా. ఆమె తన మీద అంత అభిమానం చూపుతూంటే కాదని చెప్పలేకపోయాడు.

"ఓకే. డాక్టర్ మాట పేషెంట్ వినాలిగా వింటాను" చేతులు కట్టుకొని అన్నాడు.

"శశాంక్ ఈజ్ ఎ గుడ్‌బాయ్" అంటూ నవ్వి ఆటోలో వెళ్ళిపోయింది మాధవి.

★ ★ ★

ఈ రోజు సాయంత్రం శశాంక్‌ను చూడటానికి రామకృష్ణ వచ్చాడు.

"ఎలా ఉంది ఆరోగ్యం? జ్వరం తగ్గిందా? " అని అడిగాడు.

"తగ్గింది. నాకు జ్వరం వచ్చిందని నీకెవరు చెప్పారు? "

"సంధ్య చెప్పింది"

"సంధ్యకు ఎవరు చెప్పారు? "

"మాధవి చెప్పారు. ఆవిడకు ఎవరు చెప్పారో కూడా చెప్పాలా? " నవ్వుతూ అడిగాడు.

"వద్దులే. ఎవడో తల మాసినవాడు చెప్పి ఉంటాడు"

"తలమాసినవాడు కాదు. తలకు గాయం చేసుకున్నవాడు"

"ఆ విషయం కూడా సంధ్యకు చెప్పేశారా మాధవిగారు? " ఆశ్చర్యంగా అడిగాడు శశాంక్.

"నాకు తెలియదు. నాకు సంధ్య చెప్పింది". అన్నాడు రామకృష్ణ. అతని మాటలకు నవ్వు వచ్చింది శశాంక్‌కు. తర్వాత చెన్నైలో జరిగినదంతా రామకృష్ణకు టూకీగా చెప్పాడు శశాంక్.

"రాంకీ. మదన్ ఎవరో కనుక్కోవాలంటే స్వప్న మదన్‌కు యిచ్చిన చెక్కులు ఎవరు క్యాష్ చేసుకున్నారో తెలుసుకోవాలి. స్వప్న మదన్‌కు క్యాష్ రూపంలో కాకుండా చెక్కు రూపంలోనే డబ్బులు యిచ్చిందని అనుకొందాం. ఆ మొత్తం ఎవరి అక్కౌంటులోకి వెళ్ళిందో తెలుసుకోవచ్చుకదా? "

"తెలుసుకోవచ్చు. స్వప్న అక్కౌంటు ఏ బ్యాంకులో ఉంది"

చెప్పాడు శశాంక్.

"జాగ్రత్తగా విను. స్వప్న మదన్‌కు చెక్కులు యిచ్చిందని అన్నావు కదా. ముందు నువ్వు స్వప్న అక్కౌంటు ఉన్న బ్రాంచికి వెళ్ళి స్వప్న అక్కౌంటు నుంచి ఆ మొత్తాలు ఏ రోజున విత్‌డ్రా అయ్యాయో తెలుసుకోవాలి. అందుకోసం ఆమె అక్కౌంటు నెంబరు కౌంటర్‌లో ఉన్న వ్యక్తికి యిచ్చావంటే అతను కంప్యూటర్‌లో చూసి చెక్కులు పే అయిన తేదీలు చెబుతారు. ఆ వ్యక్తిని నీవు తగిన విధంగా కన్విన్స్ చేయగలిగితే అతను ఆ రోజు ఓచర్లు తెప్పించి చూశాడంటే వాటిల్లో స్వప్న మదన్‌కు యిచ్చిన చెక్కు ఉంటుంది. రెండు చెక్కులూ మదన్‌కే యిచ్చింది కాబట్టి ఒక తేదీ ఓచర్లు చూస్తే చాలు. ఆ చెక్కును చూస్తే దాన్ని స్వప్న ఎవరికిచ్చిందో, ఏ బ్యాంకు ద్వారా, ఏ బ్రాంచి ద్వారా ఆ చెక్కు ప్రజెంట్ చేయబడిందో ఆ చెక్కుపై ఉన్న స్టాంపు ముద్రల ద్వారా తెలుసుకోవచ్చు ఆ చెక్కుపై యితర బ్యాంకుల, బ్రాంచీల స్టాంపు ముద్రలు లేకపోతే ఆ చెక్కులోని మొత్తం స్వప్న అక్కౌంటు ఉన్న బ్రాంచిలోనే మరొకరి అక్కౌంటులో జమ అయిందని అర్థం.

సప్పోజింగ్ ఆ చెక్కు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, మైలాపూరు బ్రాంచి నుంచి ప్రజెంట్ చేయబడి ఉంటుందని అనుకుందాం. నువ్వు ఆ బ్రాంచికి వెళ్ళి ఫలానా

తారీఖున, ఫలానా నెంబరుగల చెక్కు, ఫలానా బ్యాంకుకు వాళ్ళు ప్రజెంట్ చేశారని, ఆ చెక్కు ప్రొసీడ్స్ ఏ అక్కౌంటులో జమచేశారో చెప్పమని అడుగు. వాళ్ళు 'అవుట్‌వర్డ్ క్లియరింగ్' అంటే తమ బ్రాంచి కస్టమర్లు యిచ్చిన యితర బ్యాంకుల చెక్కుల వివరాలన్నీ కంప్యూటర్‌లో ఫీడ్ చేసి, ప్రింటవుట్ ఉన తీసి భద్రపరచి ఉంటారు. ఆ రోజు షీటు చూస్తే ఆ మొత్తం ఏ అక్కౌంటులో జమచేయబడిందో తెలుస్తుంది. ఆ అక్కౌంటు నెంబరు చూసి, ఆ అక్కౌంటు ఓపనింగ్ ఫారం చూస్తే అందులో అక్కౌంటు హోల్డర్ ఫోటో అతికించబడి ఉంటుంది."

"చాలా థాంక్స్ రాంకీ. చాలా చక్కగా అరటిపండు ఒలిచి నోట్లో పెట్టినట్లు చెప్పావు. ఇంకో డౌటు. స్వప్న యింట్లో పాస్‌బుక్ దొరికితే ఆ నెంబరు నోట్ చేసుకున్నాను. అయితే ఆ అక్కౌంటులో లక్షా, రెండు లక్షల ఎంట్రీలు లేవు. కాబట్టి స్వప్నకు మరో అక్కౌంటు ఉందేమోనని నా అనుమానం. ఆ అక్కౌంటు నెంబరు ఎలా కనుక్కోవాలి? "

"బ్యాంకుల కంప్యూటీకరణ జరిగిన తరువాత యిలాంటివి సులభంగా కనుక్కోవచ్చు. ప్రతి అక్కౌంటు నెంబరులో కొంత భాగాన్ని కస్టమర్ నెంబర్ అంటారు. ఆ నెంబరు ఒకసారి కస్టమర్‌కు యిచ్చారంటే, అతను ఎన్ని అక్కౌంట్లు ఓపెన్ చేసినా కస్టమర్ నెంబర్ మాత్రం ఒకటే ఉంటుంది. ఆ కస్టమర్ నెంబర్ని కంప్యూటర్‌లో కొడితే ఆ కస్టమర్‌కు ఉన్న అన్ని అక్కౌంట్ల వివరాలూ స్క్రీన్ మీద కనబడతాయి. ఆ విధంగా స్వప్న అక్కౌంటులోని ఆమె కస్టమర్ నెంబరు కొడితే ఆమె మరో అక్కౌంటు నెంబరు తెలుస్తుంది. ఆ అక్కౌంటు తెరచి చూస్తే ఆ మొత్తాలు డ్రా చేయబడిన తేదీలు తెలుస్తాయి"

"వెరీగుడ్. ఆ సమస్య కూడా తీరిపోయినట్లే"

"అయితే యిక్కడ ఒక విషయం చెప్పాలి నీకు. స్వప్నకు ఆల్‌రెడీ తమ దగ్గర అక్కౌంటు ఉందనే విషయం తెలియక మళ్ళీ యింకొక కస్టమర్ నెంబర్ ఆ అక్కౌంటుకు యిచ్చి ఉంటే ఈ కస్టమర్ నెంబరు ద్వారా ఆ అకౌంటు నెంబరు కనుక్కొనే వీలులేదు"

"మరెలా? "

"కస్టమర్ ఆల్ఫాసెర్చ్ ద్వారా కనుక్కోవాలి. స్వప్న పేరు 'ఎమ్.స్వప్న' అనుకొందాం. 'ఎం.ఎస్.పి.' అని ఆల్ఫాసెర్చ్‌కి వెళ్లి కొడితే ఆమె నెంబరు తెలిసే అవకాశం ఉంది. ఇంకో విషయం చెబితే నీవు నీరుగారిపోతావు. స్వప్నకు ఆ రెండో అకౌంటు కూడా అదే బ్రాంచిలో ఉంటేనే నేను చెప్పినదంతా సాధ్యం. ఆ అకౌంటు ఇంకో బ్యాంకులోగాని, ఇంకో బ్రాంచిలోగాని ఉంటే ఆమె అకౌంటు పాస్‌బుక్ ఉంటే తప్ప ఏమీ చెయ్యలేం. సిటీలో ఉన్న అన్ని బ్యాంకు బ్రాంచీలకు వెళ్లి ఆల్ఫాసెర్చ్ చెయ్యలేం కదా? "

"నిజమే. స్వప్నకు అదే బ్రాంచిలో అకౌంటు ఉంటుందనే నమ్మకంతో, ఒక కస్టమర్ నెంబరు ఆమెకు ఇచ్చి ఉంటారనే నమ్మకంతో ముందడుగు వేస్తాను" అన్నాడు శశాంక్.

"వెరీగుడ్. మనిషి ఎప్పుడూ ఆశావాదిగా ఉండాలి. నేను వెళ్లివస్తాను. ఆరోగ్యం జాగ్రత్త" అంటూ బయలుదేరడానికి లేచాడు రామకృష్ణ. శశాంక్ ప్రమీలమ్మ తనకు ఇచ్చిన చెక్కును రామకృష్ణకు ఇచ్చి ఆవిడ అకౌంటులో జమచెయ్యమని, తను మరుసటిరోజు వచ్చి డ్రాఫ్టు తీసుకుంటానని చెప్పాడు.

రామకృష్ణ వెళ్లిపోయాక ప్రమీలమ్మ పంపిన ఇడ్లీలు తిని నిద్రపోయాడు శశాంక్.

★ ★ ★

ఆ తరువాతి రెండు రోజులూ పూర్తిగా డ్యూటీకే కేటాయించాడు శశాంక్. వీలై

నంత మంది డాక్టర్లను కలుస్తూ, మెడికల్ షాపులను కవర్ చేస్తూ, బిజినెస్ ఫిగర్స్ చూసుకుంటూ గడిపాడు. అతనికి తెలియకుండానే అతని బిజినెస్ ఎంతో పెరిగింది. అందుకు కారణం అతనికి తెలుసు.

'తను అందరు డాక్టర్లతో ఎంతో ఫ్రెండ్లీగా ఉంటాడు. ఒక్కోసారి వాళ్లు విసుక్కున్నా తను పట్టించుకోడు. వాళ్లే తర్వాత పశ్చాత్తాపపడి తనతో మరింత ఆత్మీయంగా మాట్లాడేవారు. ఎవరైనా డాక్టరు తన కంపెనీకి మందులు రాయడం లేదని తెలిస్తే ఆయనను ఎక్కువసార్లు కలసి, ఆయన రాసే దాకా వదిలిపెట్టేవాడు కాదు. ఒక డాక్టరు అనేవాడు కూడా 'ఏమిటయ్యా? నక్షత్రకుడిలా తగులుకున్నావు' అని. అయినా తను తన ప్రయత్నం మానలేదు. చివరికి ఆయన కొద్దికొద్దిగా రాయడం మొదలుపెట్టాడు. ఒక కంపెనీ మందులు ఒకసారి రాయడం మొదలుపెడితే తర్వాత రాయవద్దన్నా ఆపరు డాక్టర్లు. అది వాళ్ల సైకాలజీ' అనుకున్నాడు శశాంక్.

ఆ రోజు రాత్రి అతని రీజనల్ సేల్స్ మేనేజర్ నుంచి ఫోన్ వచ్చింది అతనికి.

"హలో శశాంక్. ఎలా ఉంది బిజినెస్?"

"బాగుంది సార్"

"కార్డు చేరిందా?" "ఏ కార్డు" శశాంక్ అడిగాడు.

"నా వెడ్డింగ్ ఇన్విటేషన్ కార్డు".

"చేరలేదు సార్" అన్నాడు.

"భలే వాడివే. పంపి వారం రోజులవుతూంది"

"ఎప్పుడు సార్ పెళ్లి?"

"పెళ్లి ఎల్లుండి. అయితే రేపు సాయంత్రం పెళ్లి వేడుకలూ అవీ సరదాగా ఉంటాయి. నువ్వు రేపు సాయంత్రం ఇక్కడ ఉండాలి. సౌత్‌లో ఉన్న రెప్స్ అందరూ వస్తున్నారు."

"అలాగే సార్" అన్నాడు. మ్యారేజ్ హాల్ అడ్రసు అడిగి రాసుకున్నాడు. అతనికి తన ఆర్.ఎస్.ఎం. రామచంద్రన్ అంటే ఎంతో యిష్టం. అతి చిన్నవయసులోనే ఆ పొజిషన్‌కు చేరుకున్నాడాయన. అందుకు కారణం అతని కృషి, పట్టుదల. 'ఈ ఫీల్డులో అతనే తనకు ఆదర్శం. తనకు మళ్లీ చెన్నై వెళ్లే అవకాశం వచ్చింది. రేపు ఉదయం ఐదు గంటల ట్రైనుకు బయలుదేరితే సరిపోతుంది. మధ్యాహ్నం స్వప్న చెక్కుల సంగతి చూడాలి. మదన్ ఎవరో ఈసారన్నా కనుక్కోవాలి" అనుకున్నాడు.

చెన్నై సెంట్రల్ స్టేషన్‌లో ట్రైను దిగి నేరుగా స్వప్న అకౌంటు ఉన్న బ్యాంకుకు వెళ్లాడు శశాంక్. ఆ బ్యాంకు మందవల్లిలోనే ఉంది. అతను బ్యాంకు లోపలికి అడుగుపెట్టినప్పుడు పన్నెండు కావస్తూంది టైము. బ్రాంచిలో రష్ ఎక్కువగా లేరు. నెలాఖరు రోజులు కదా' అనుకున్నాడు.

మెయిన్ గేటుకు ఎదురుగా ఉన్న కౌంటరు దగ్గరికి వెళ్లాడు. ఆ కౌంటర్‌లో ఓ అందమైన అమ్మాయి కూర్చుని కంప్యూటర్‌లో ఓచర్లను ఫీడ్ చేస్తూంది. కాస్త పొట్టిగా, అందంగా ఉంది. కళ్లజోడు ధరించి చురుకుగా కనిపించింది. శశాంక్‌ను చూసి 'ఏం కావాలన్నట్లు' కనుబొమ్మలు ఎగరేసింది.

"మీ పని పూర్తి కానివ్వండి. నేను కాసేపు వెయిట్ చేస్తాను" అన్నాడు శశాంక్.

"ఫర్వాలేదు చెప్పండి" అంటూ ఓచర్లను పక్కన పెట్టింది.

శశాంక్ స్వప్న పాస్‌బుక్ ఆమెకిచ్చి "ఈ పాస్‌బుక్ నా ఫ్రెండ్‌ది. ఆవిడకు ఈ బ్యాంకులోనే ఇంకో అకౌంటు ఉంది. ఆ నెంబరు కాస్త చూసి చెప్పగలరా?" అన్నాడు.

ఆమె వెంటనే కంప్యూటర్‌లో చూసి "ఇంకో అకౌంటు ఉందిగాని అందులో బ్యాలెన్స్ లేదు" అంది.

"ఆ అకౌంటులో మూడు లక్షలు ఉంచానని చెప్పిందే. విత్‌డ్రా చేసిందా?" అని అడిగాడు.

ఆమె చూసి "అవును. లక్ష ఒకసారి, రెండు లక్షలు ఒకసారి విత్‌డ్రా చేయబడ్డాయి" అంది.

శశాంక్ ఆనందానికి హద్దుల్లేవు.

"అలాగా, ఆ తేదీలు చెప్పగలరా?" అన్నాడు. ఆమె చెబితే ఓ కాగితంలో నోట్ చేసుకున్నాడు. ఆ అకౌంటు నెంబరు కూడా రాసుకున్నాడు.

"మరో చిన్న సహాయం" అంటూ ఆ చెక్కులు ఎలా డ్రా చెయ్యబడ్డాయో చెప్పమన్నాడు.

ఆమె చూసి అవి క్లియరింగ్‌లో ప్రజెంట్ చేయబడినాయని చెప్పింది.

అతనికి సంతోషంతో గట్టిగా ఈల వెయ్యాలనిపించింది. అతను కోరుకున్నది కూడా అదే. 'మదన్‌కు ఆ డబ్బుల్ని స్వప్న క్యాష్ రూపంలో ఇచ్చి ఉండకూడదు. అతని పేరు మీద చెక్కు ఇచ్చి, ఆ చెక్కును మదన్ తన అకౌంట్ ఉన్న తన బ్యాంకులో ఇచ్చి, ఆ బ్యాంకుచే క్లియరింగ్‌లో స్వప్న అకౌంటు ఉన్న బ్యాంకుకు ప్రజెంట్ చేయబడి, చెక్కు పే అయ్యాక మదన్ అకౌంటులో జమచేయబడి ఉండాలి' అనుకున్నాడు. అదే జరిగింది.

"మరో పెద్ద సహాయం కూడా చేయండి, ఆ చెక్కులు ఏ బ్యాంకు బ్రాంచి నుంచి ప్రజెంట్ చేయబడ్డాయో చెప్పారంటే మీ మేలు మర్చిపోలేను. మిమ్మల్ని నేను అడుగుతున్న చివరి సహాయం ఇది" అన్నాడు అర్థింపుగా.

ఆమె అసహనంగా అతనివైపు చూసి "ఆ చెక్కులు రికార్డ్ రూంలో ఉంటాయి. అంత సులభంగా దొరకవు" అంది.

"ఫరవాలేదు. నేను సాయంత్రం వస్తాను. కాస్త వెతికి చూడండి ప్లీజ్"

"సారీ. మేము అలాంటివి చెప్పకూడదు. మీరు మీ స్నేహితురాలిని పిలుచుకొని రండి. ఆవిడ కోరితే మేము చెబుతాము".

"ఆవిడ లేదు. చనిపోయింది".

ఆశ్చర్యంగా కళ్లు పెద్దవి చేసి చూసింది ఆ అమ్మాయి.

"మీరు నా కోసం తీసుకునే శ్రమ చాలా తక్కువ. కానీ చేయబోయే సహాయం చాలా ఎక్కువ. మీరు ఈ సహాయం చేస్తే నా ఫ్రెండు ఆత్మకు శాంతి కలుగుతుంది. మరో ఫ్రెండుకు దుండగుల బందీ నుంచి విడుదల లభిస్తుంది. మరెందరో అమ్మాయిల జీవితాలు ఓ దుర్మార్గుడి చేతుల్లో బలికాకుండా ఉంటాయి. నేను మీకు అన్నీ చెప్పలేను. కాని నాకు ఆ వివరాలు చెప్పడంవల్ల మీకు ఏ ఇబ్బందీ రానివ్వను. ప్రామిస్".

ఆ అమ్మాయి కొంతసేపు ఆలోచించి "సరే మీరు సాయంత్రం నాలుగు గంటలకు రండి. నేను ఆ రోజు ఓచర్లు వెతికి మీకు కావలసిన వివరాలు నోట్ చేసి ఉంచుతాను. నేను మీకు ఆ వివరాలు చెప్పానన్న విషయం మాత్రం ఎవ్వరికీ చెప్పకూడదు. మా మేనేజరుకు తెలిస్తే నన్ను చీవాట్లేస్తారు" అంది.

"ఆ పరిస్థితి రానీయను. నాకు సహాయం చేసిన వారికి ఇబ్బంది కలిగిస్తానా?" అన్నాడు శశాంక్.

తర్వాత బయటకు వచ్చి నిలబడ్డాడు. మళ్లీ బ్యాంకుకు ఇంకా మూడున్నర గంటల సమయం ఉంది. అంతవరకూ ఏం చేయాలో తోచలేదు. నీరజ ఇంటికి వెళ్దామని అనుకున్నాడు గాని అంతకంటే సుందర్ దగ్గరికి వెళితే ఏదైనా కొత్త సమాచారం తెలియవచ్చు' అనుకున్నాడు. పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేస్తే సుందర్ ఇంటికెళ్లాడనీ, ఇంకో అరగంటలో రావొచ్చనీ చెప్పాడు అక్కడి కానిస్టేబుల్. తను ఇప్పుడు బయలుదేరి స్టేషన్‌కు వెళ్లేసరికి సుందర్ వచ్చి ఉంటాడు. ఒకవేళ రాకున్నా తను కొంతసేపు అక్కడే వెయిట్ చేస్తే సరి' అనుకుని ఆటో ఎక్కాడు.

★ ★ ★

శశాంక్ స్టేషన్‌లో అడుగు పెట్టేటప్పటికి

పనిమీద వచ్చారా? " అని అడిగాడు సుందర్.

"రేపు ఉదయం మా రీజనల్ సేల్స్ మేనేజర్‌కు పెళ్లి. సాయంత్రం కూడా పెళ్లి వేడుకలు ఉంటాయి. ముందురోజే బయలు దేరి రమ్మన్నారు. ఎటూ వచ్చాను కాబట్టి మిగిలి ఉన్న పనుల్ని పూర్తి చేసి పోదామని వచ్చాను" అంటూ తాను రామకృష్ణ నుంచి తెలుసు కున్న విషయాల గురించి, తను బ్యాంకుకు వెళ్లి చేసిన ప్రయత్నం గురించి చెప్పాడు.

"మళ్లీ నాలుగు గంటలకు వెళ్లాలి నేను. ఈలోగా మిమ్మల్ని కలసి ప్రోగ్రెస్ తెలుసుకుందామని వచ్చాను".

"ప్రోగ్రెస్ అంటూ ఏం లేదు ఇంతవరకూ. ఉదయ్ ఆ రోజు నుంచి కనబడటం లేదు. అతని కోసం ఎవరూ ఇంటికి రాలేదు. అతని బైక్ మాత్రం ఇంటి బయటే ఉంది. అతను వెనుక వైపు యింకో ద్వారం ఉండి, అందులోంచి బయ టకు వెళ్లాడేమో తెలియదు.



## జేబులు కొట్టడం ఎలాగ?

ఓసారి కొందరు పార్లమెంటు సభ్యులతో నెహ్రూ కులాసా ముచ్చట్లలో ఉన్నారు. అంతలో మహావీర్‌త్యాగి అనే ఆయన తటాలున నెహ్రూ జేబు నుంచి పెన్ను లాక్కుని, 'ఈ పెన్నుతో మీరు చాలా చేశారు.. ఇక విశ్రాంతి తీసు కోండి..' అన్నాడు.

వెంటనే నెహ్రూ 'అలాగేచేద్దాం.. కానీ జేబులు కొట్టడం ఇలాకాదయ్యా ముందది నేర్చుకో' అన్నారు నవ్వుతూ.

ఆయన నవ్వుతో అంతా శ్రుతి కలిపారు.

సుందర్ ఇంకా ఇంటినుంచి రాలేదు. శశాంక్ అతని సీటుకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని అతని కోసం ఎదురుచూడసాగాడు. మరో పది నిమిషాలకు సుందర్ వచ్చాడు.

"హలో శశాంక్ ఎప్పుడొచ్చారు? " అన్నాడు సుందర్.

"చెన్నైకి వచ్చి గంట అయింది. ఇక్కడికి వచ్చి పది నిమిషాలయింది."

సుందర్ కానిస్టేబుల్‌ని పిలిచి కూల్ డ్రింక్స్ చెప్పమన్నాడు.

"చెన్నైకి మీ పనిమీద వచ్చారా లేక ఆ

అయినా బైక్ లేకుండా ఈ సిటీలో తిరగడం చాలా కష్టం. అందుకే అతను వస్తాడని మావాళ్లు ఎంతో ఓపికతో అతని కోసం చూస్తున్నారు."

"అతను ఇంకోవైపు నుంచి వెళ్లి ఉంటే అతనిపై నిఘా ఉందన్న విషయం తెలుసు కున్నాడన్న మాటేగా? " శశాంక్ అడిగాడు.

అవునన్నట్టు తలూపాడు సుందర్.

"హసీనా విషయం ఏమైంది? "

"ఆమె కూడా యింకా యింటికి తిరిగి రాలేదు. ఉదయ్ మా వాళ్లకు కనబడి ఉంటే అతన్ని వెంటాడి హసీనా జాడ కను

మనం గతాన్ని మార్చలేము - కానీ భవిష్యత్తుకు సంబంధించిన దిగులు బంగారం లాంటి మన వర్తమానాన్ని పాడుచేస్తుంది. - **పార్కర్**



క్కొని ఉండేవారు"

"సరే. నేను బయలుదేరుతాను. అప్పుడప్పుడూ మీకు ఫోన్ చేస్తుంటాను. ప్రోగ్రెస్ ఉంటే తెలియజేయండి"

"మదన్ ఎవరో కనుక్కొన్నాక మీరు నాకు ఫోన్ చేయండి"

"అలాగే. థాంక్యూ ఫర్ యువర్ హాస్పిటాలిటీ"

సుందర్‌తో కరచాలనంచేసి బయటకు వచ్చాడు శశాంక్. కొంతదూరం నడచి బస్ స్టాప్ చేరుకుని అడయార్ వైపు వెళ్లే సిటీ బస్సు సిద్ధంగా ఉండటంతో అందులోకి ఎక్కాడు.

★ ★ ★

అడయార్‌లో ఉదయ్ ఇంటికి దగ్గరగా ఉన్న స్టాపింగులో దిగి ఉదయ్ ఇంటివరకూ నడుచుకుంటూ వెళ్లాడు శశాంక్. ఇంటి బయట నిలబడి లోపలికి చూశాడు. ఎవరూ కనబడలేదు. ఆ ఇంటిని పోలీసులు గమనిస్తున్నారన్న విషయం గుర్తుకు రాగానే ఇబ్బందిగా అనిపించింది అతనికి.

లోపలికి వెళ్లాక ఉదయ్ కనబడితే అతనితో తను ఏం మాట్లాడాలి? హసీనాను తీసుకెళ్లి దాచేసింది అతనేనని తెలిసీ తను మామూలుగా మాట్లాడగలడా? తను ఊహిస్తున్నట్లే బయట పోలీసుల నిఘా ఉందని అతనికి తెలిసిపోయి ఉంటే తనను క్రూరంగా చూడడూ? 'కత్తితో కాదు కంటి చూపుతో చంపుతా' అని అదేదో సినిమాలో ఓ హీరో అన్నట్లు తనను చూపులతోనే చంపేస్తాడేమో. చూపులతో ఏం ఖర్మ? కత్తితో, బెల్టుతో - ఏది అందుబాటులో ఉంటే దానితో చంపేస్తాడు. అయితే అతను బయటకు రాకపోవడానికి కారణం అనారోగ్యం అయి ఉంటే అప్పుడు అతనికి పోలీసుల విషయం తెలిసుండకపోవచ్చు. ఏదేమైనా తను ఒకసారి ఇంట్లోకి వెళ్లి అతను ఎక్కడికి వెళ్లాడో అతని

తల్లితండ్రుల్ని అడిగి కనుక్కోవాలి. ఒకవేళ అతను ఇంట్లోనే ఉంటే ఎందుకు బయటకు తిరగడంలేదో కనుక్కోవాలి, అది రిస్కుతో కూడుకున్నదయినా" అనుకుని గేటు తీసి లోపలికి అడుగుపెట్టాడు.

గార్డెన్‌లో ఎవరూ కనిపించలేదు. గేటు పక్కనే ఉన్న కాలింగ్ బెల్ స్విచ్ నొక్కి ఇంటి ద్వారం వైపు చూడసాగాడు. నిమిషం తర్వాత ఉదయ్ తండ్రి ఇంట్లోంచి బయటకు వచ్చాడు. ఆయన శశాంక్‌ను చూసి 'హలో శశాంక్ గారూ. రండి' అంటూ ఆదరంగా పిలిచాడు. ఆయన్ను చూశాక ఎంతో ధైర్యం వచ్చింది శశాంక్‌కు. 'ఒకవేళ లోపల ఉదయ్ ఉన్నా తండ్రిముందు తనకు ఏ హానీ చెయ్యడు' అనుకున్నాడు.

శశాంక్ చేతులు జోడించి నమస్కారం చేస్తూ "బాగున్నారా" అని అడిగాడు.

"ఆ... రండి" అంటూ సిటౌట్‌లోని కుర్చీ జరిపి 'కూర్చోండి' అని తనో కుర్చీలో కూర్చున్నాడు ఆయన. కుర్చీలో కూర్చున్నాక శశాంక్ దృష్టి సిటౌట్‌లో ఓ మూల ఉన్న మోటార్‌బైక్‌పై పడింది. అది ఉదయ్ బైక్ కాదు. 'ఈ బైక్‌ను చూసి ఉదయ్ బైక్ అనుకుని పొరబడ్డారు పోలీసులు' అనుకున్నాడు.

"ఈ బైక్ ఉదయ్‌ది కాదనుకుంటాను" అని అడిగాడు ఆయన్ను.

"అవును. వాడి స్నేహితుడిది. నార్త్ టూర్‌కు వెళుతూ యిక్కడ పెట్టి వెళ్లాడు. చాలా రోజులు వాడకుండా ఉంటే వెహికల్ చెడిపోతుందని ఉదయ్‌ని అప్పుడప్పుడూ వాడమన్నాడు"

మళ్లీ ఆయనే "ఉదయ్ ఊర్లో లేడు. ఏదో అర్జంటు పనిమీద మధురై వెళుతున్నానని, నాలుగు రోజుల్లో వస్తానని ఫోన్ చేశాడు."

"అలాగా! అయితే ఇక నేను వస్తాను. ఉదయ్ వస్తే నేను వచ్చి వెళ్లానని చెప్పండి" అంటూ బయల్దేరాడు శశాంక్.

★ ★ ★

సరిగ్గా నాలుగు గంటలకు బ్యాంకులోకి అడుగుపెట్టాడు శశాంక్. ఆ అమ్మాయి కౌంటర్‌లోనే ఉంది. శశాంక్‌ను చూడగానే ఒకసారి గోడకున్న గడియారం వైపు చూసి మళ్లీ అతనివైపు చూసి నవ్వింది.

శశాంక్ ఆమెను సమీపించి "ఇండియన్ పంక్చువాలిటీని పాటించకపోయినా నేను ఇండియన్నే" అన్నాడు. 'ఆమె మళ్లీ నవ్వి "మీకు కావలసిన వివరాలు రాసుకోండి" అంటూ చెక్కులు ప్రెజెంట్ చేసిన బ్యాంకు పేరు, బ్రాంచి పేరు చెప్పింది. శశాంక్ రాసుకున్నాడు.

"చెక్కు ఎవరి పేరు మీద డ్రా చేశారో కూడా చెప్పాలా? " అని అడిగింది.

"నాకు తెలుసు. మదన్ పేరుమీద డ్రా చేసి ఉంటుంది"

"కరెక్ట్. మీకెలా తెలుసు? " ఆశ్చర్యంగా అడిగింది.

"నా అనుమానం అతనిపైనే. అతని పాపం పండేరోజు దగ్గరికొచ్చింది. ఒకే. చాలా థ్యాంక్స్ మీకు. మీ మేలు యీ జన్మలో మరచిపోలేను"

"మరచిపొమ్మనే నేను చెబుతున్నాను"

శశాంక్ అర్థమైనట్లు తలాడించి "మీ మేలు ఈ క్షణం నుంచీ మరచిపోతాను" అన్నాడు మొహంలో కృతజ్ఞత చూపిస్తూ.

★ ★ ★

శశాంక్ బయటకు వచ్చి ఆటో ఎక్కి మౌంట్ రోడ్‌లో ఉన్న ఆ బ్యాంక్‌ను చేరుకున్నాడు. ప్రభుత్వరంగ బ్యాంక్ అది. నేరుగా మేనేజర్ క్యాబిన్‌లోకి అడుగుపెట్టాడు. మేనేజర్ ఏదో రాసుకుంటున్నాడు. శశాంక్‌ను చూసి కూర్చోమన్నట్టు కుర్చీ చూపించాడు. శశాంక్ కూర్చుని తనకు ఏం కావాలో అతనికి చెప్పాడు.

"అవన్నీ మేము చెప్పకూడదు. అలా చెప్పడం బ్యాంక్ రూల్స్‌కి వ్యతిరేకం" అన్నాడు ఆయన.

శశాంక్ మధ్యాహ్నం కళ్లజోడు అమ్మా

యికి ఏం చెప్పాడో ఆయనకు కూడా అదే చెప్పాడు. అయినా కన్విన్స్ కాలేదు.

"మీరు నాకు చెప్పవద్దు. రికార్డెడ్‌గా కూడా కమిట్ కానక్కరలేదు. నాకు అతని ఫొటో చూపించండి. చాలు. చూసి వెళ్లిపో తాను" చివరి ప్రయత్నంగా అన్నాడు.

ఆయన తల పంకించి "మరి కాసేపట్లో స్టాఫ్ మీటింగ్ ఉంది. మీరు రేపు ఉదయం పదకొండు గంటలకు వచ్చారంటే మీకు కావలసినవి సిద్ధంగా ఉంచుతాను" అన్నాడు.

ఆ మాటవిని ఎంతో సంతోషించాడు శశాంక్. తను రాసుకున్న వివరాలను మరో కాగితం మీద రాసి ఆయనకు ఇచ్చి బయటకు నడిచాడు.

★ ★ ★

శశాంక్ అక్కడ్నుంచి బయలుదేరి నీరజ యింటికి వెళ్లాడు. తలుపు తెరచిన నీరజ అతన్నిచూసి ఆశ్చర్యపోయింది.

"ఇంటికి వచ్చిన అతిధిని చూసి గుమ్మం దగ్గరే ఆశ్చర్యపోతూ నిల్చుంటారా ఎవరైనా" విసుగు నటిస్తూ అన్నాడు.



"ఇంట్లోంచి వెళ్లిన అతిథి యింకా మా సెలబ్రేషన్స్ పూర్తికాకుండానే మళ్లీవస్తే ఆశ్చర్యపోరా? షాక్ తినరా? " అంది నీరజ నవ్వుతూ. శశాంక్ కూడా నవ్వాడు. తర్వాత తాను ట్రైను దిగినప్పటినుండీ ఎక్కడెక్కడికి వెళ్లాడో ఏమేం చేశాడో చెప్పాడు.

"మరి మధ్యాహ్నం భోజనం ఎక్కడ చేశావు? "

"చెయ్యలేదు. చెయ్యడానికి అసలు టైము దొరికితేగా? "

"అయ్యో... దోసెపిండి ఉంది. దోసెలు వేసివ్వనా? "

"ఇవ్వు"

దోసెలు తింటూంటే సెల్ మ్రోగింది. నెంబరుచూసి "హలో ఉదయ్ ఎక్కడున్నారు? " అని అడిగాడు. 'తను మధురైలో ఉన్నానని, మరో రెండు రోజుల్లో తిరిగి వస్తానని, ఇందాక తండ్రికి ఫోన్‌చేస్తే శశాంక్ వచ్చిన విషయం తెలిసిందనీ చెప్పాడు.

"ఏమిటి మీ ప్రోగ్రామ్"

"రాత్రి ఓ పెళ్లికి వెళ్లాలి. రేపు ఉదయం పెళ్లిముహూర్తం వరకూ ఉండి బ్యాక్ టు నెల్లూర్"

"సరే. ఉంటాను. మీరు ఈసారి చెన్నై వచ్చినప్పుడు కలుద్దాం"

"ఈసారే కలుద్దాం. జైల్లో" అనుకున్నాడు.

ఆ తర్వాత రెడీ అయి మ్యారేజ్ హాలుకు బయలుదేరాడు. రోడ్డు మీదకు రాగానే ఓ వ్యక్తి మోటార్ బైక్‌పై కూర్చుని సెల్‌లో మాట్లాడుతూ కనిపించాడు. అతన్ని ఎక్కడో చూసినట్లు అనిపించింది. ఎక్కడ చూశాడో గుర్తురాక ఆటో ఎక్కి "మాంబళం" అన్నాడు.

తన ఆర్. ఎస్. ఎం. పెళ్లి వేడుకల్లో తనూ ఆనందంగా పాలుపంచుకున్నాడు శశాంక్. మెడికల్ రెప్స్, ఆయన బంధువులు అందరూ డ్యాన్స్ చేస్తూంటే తనూ ఉత్సాహంగా డ్యాన్స్‌చేశాడు. ఇంతలో అతని దృష్టి దూరంగా నిలబడి ఉన్న కుర్రాడిపై పడింది. తన ఇంటి బయట కనిపించిన కుర్రాడు అతను. చటుక్కున అతన్ని గతంలో ఎక్కడ చూశాడో గుర్తొచ్చింది.

'ఆరోజు సినిమా హాల్లో ఉదయ్‌తో మాట్లా డుతూ కనిపించాడు అతను. అతని హేర్ స్టైయిల్ ప్రత్యేకంగా ఉంది. తను మరో సారి చూసేలా చేసింది ఆరోజు. అంటే అతను తనను వెంబడిస్తున్నాడు. పోలీసు లకు తను ఉదయ్ సంగతి చెప్పినట్లు వీళ్లకు తెలిసిపోయింది. అందుకే తనను చంపడానికి వచ్చాడు. తనెక్కడున్నాడో తెలుసుకోవడానికే ఉదయ్ ఫోన్ చేశాడు. ఇక జాగ్రత్తగా ఉండాలి. ఒంటరిగా వీడికి దొరకకూడదు" అనుకుని ఎప్పుడూ పదిమం దితో కలిసే ఉండసాగాడు. టాయిలెట్‌కు వెళ్లవలసి వచ్చినా వెళ్లలేదు. డిన్నర్ కాగానే ఆటో ఎక్కి నీరజ ఇంటికి చేరుకున్నాడు. ఆటో దిగి దాదాపు పరుగెత్తినట్లే వెళ్లి సెకం డ్‌ఫ్లోర్‌లో ఉన్న వాళ్ల పోర్షన్‌లోకి వెళ్లాడు.

★ ★ ★

మరుసటి రోజు ఉదయం పది గంటలకు తన రీజనల్ సేల్స్ మేనేజరు పెళ్లి చూసు కొని మెల్లగా అక్కడ్నుంచి బయటపడ్డాడు శశాంక్. బ్యాంకు మేనేజరు పదకొండు గంటలకు రమ్మని చెప్పి ఉండటంతో 'ఆటోలో త్వరగా వెళ్ళి ఏం చేయాలి? బస్సులో వెళితే కాస్త టైంపాస్' అన్నా అవు తుందని అనుకుని బస్‌స్టాపు వైపు నడి చాను.

మౌంట్ రోడ్డులో బస్సు దిగి బ్యాంక్ లోకి వెళ్ళాడు. బ్రాంచి మేనేజర్‌కు విష్ చేసి ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చు న్నాడు.

'మీకు కావలసింది రెడీగా ఉంది. చూస్తారా? ' అని అడిగాడు ఆయన.

చూస్తానన్నట్లు తలూపాడు శశాంక్. అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది.

అంతలో ఫోను మోగడంతో ఆయన రిసీ వరు అందుకొని మాట్లాడసాగాడు. శశాం క్‌కు క్షణక్షణానికీ ఆతృత పెరిగిపోతోంది.



స్వప్న ఆత్మహత్య చేసుకోగానే స్వప్న ఇంట్లో మదన్ ఫోటో దొరికితే తీసుకురమ్మని కోరింది మాధవి. తను కూడా మదన్ ఫోటోను చూసి, తరువాత ఎప్పుడైనా అతను కనబడితే కసితీరా కొట్టాలని అను కున్నాడు. చెన్నైలాంటి సిటీలో అతను తనకు కనబడే అవకాశం తక్కువ. అయినా స్వప్నలాంటి అందమైన అమ్మాయి చావుకు కారణమయ్యాడన్న కోపంతో అలాంటి ఆలో చనలే వచ్చేవి. అయితే స్వప్న ఇంట్లో మోహన్ ఫోటో దొరకడంతో అతనే 'మదన్' అనే ఉద్దేశంతో, సాహితి గురించి బాధపడి, మోహన్ బారినుంచి ఆమెనెలా కాపాడాలా అనే ఆలోచించాడు. తను ఇప్పుడు చేస్తున్న పని ఆరోజే చేసి ఉంటే మదన్ ఎవరో తనకు ఎప్పుడో తెలిసిపోయి ఉండేది' అనుకున్నాడు.

మేనేజర్ రిసీవర్ పెట్టి "మీరు అడిగిన అక్కౌంటు- జాయింట్ అక్కౌంటు" అన్నాడు. 'అలాగా' అన్నట్టు తలూపాడు శశాంక్. 'ఎవరో ఆ రెండో వ్యక్తి' అను కుంటూ, ఆయన బైండు తీసిన అక్కౌంటు ఓపెనింగ్ ఫారాల మధ్య గుర్తుకోసం ఓ పేజీ దగ్గర ఉంచిన పెన్సిల్‌ని తీసేసి "చూడండి" అంటూ ఆ పేజీని తెరచి చూపించాడు.

ఆ ఫోటోలు చూడగానే కాళ్ళ కింద భూమి కదిలినట్లైంది అతనికి.

ఆ ఫోటోల్లో ఉన్న యిద్దరిలో ఒకడు 'ఉదయ్' అయితే మరొకడు 'మో...హ...న్'

★ ★ ★

"శశాంక్ యుహేవ్ డన్ యిట్" అంటూ శశాంక్ చేతుల్ని పట్టుకుని ఊపేసింది మాధవి ఆనందంగా. ఆమె టేబుల్ మీద చెన్నై నుంచి విడుదల అయిన తమిళ్, ఇంగ్లీష న్యూస్‌పేపర్లు ఉన్నాయి. సిటీలో అమ్మాయిల్ని ట్రాప్‌చేసి డబ్బులు దోచుకునే గ్యాంగ్ పట్టుబడ్డ విషయం గురించి అన్ని పేపర్లూ ప్రముఖంగా రాశాయి. మోసగా ళ్ళను పోలీసులకు పట్టిచ్చిన 'ఆంధ్రా

వీరుడు' అంటూ శశాంక్ ఫొటోను కూడా ప్రచురించారు. శశాంక్ ఫొటోను పేపర్లో చూసిన మాధవి ఆనందానికి హద్దుల్లేవు. "యు ఆర్ రియల్లీ గ్రేట్ శశాంక్. యు ఆర్ ఎ హీరో" అంటూ మరోసారి మెచ్చుకుంది అతన్ని.

"నేను యీ విజయాన్ని పూర్తిగా ఎంజాయ్ చేయలేకపోతున్నాను. సాహితిని తలచుకుంటే నాకెంతో బాధగా ఉంది. మోహన్ నేరస్తుడు కాకుండా ఉండాలనే మొదట్నుంచీ కోరుకున్నాను. అయితే అతని గురించి నా అనుమానాలన్నీ తీరిపోయి 'ఇతను మదన్ కాదు' అని నేను పూర్తిగా నమ్మిన తరవాత అతనే వీళ్ళ గ్యాంగ్ లీడర్ అని తెలిసి ఆ షాక్‌ను తట్టుకోలేకపోతున్నాను" అన్నాడు.

'మరి స్వప్న చెల్లెలు గీత మోహన్ని తన అన్నయ్య అని ఎలా చెప్పింది?' అని అడిగింది మాధవి.

"చెప్పలేదు. చెప్పించారు. ఆ రోజు సాయంత్రం ఉదయ్‌తో కలిసి టిఫిన్ తిన్నాక నేను వాష్ బేసిన్ దగ్గరికి వెళ్లి తిరిగి వచ్చి చూస్తే ఉదయ్ దూరంగా నిలబడి సెల్‌లో మాట్లాడుతూ కనిపించాడు. తర్వాత ఫ్రెండ్ ఫోన్ చేశాడని నాతో చెప్పాడు. నేను అప్పటికే అతనికి స్వప్న ఇంటికి బయలుదేరుతున్నానన్న విషయం చెప్పాను. ఉదయ్ ఆ విషయం సెల్ నుంచి ఫోన్ చేసి మోహన్‌కు చెప్పాడు. మోహన్ నాకంటే ముందే అక్కడికి చేరుకొని, తను చెప్పినట్లు వినకపోతే వాళ్ళ తల్లిని చంపుతానని స్వప్న చెల్లెళ్ళను బెదిరించి, వాళ్ళు నాతో ఏం చెప్పాలో తనే ప్లాన్‌చేసి వాళ్ళకు చెప్పాడు. వాళ్ళు మొహాల్లో భయం చూసి వాళ్ళు ఇంకా స్వప్న మరణం ఇచ్చిన షాక్‌నుంచి తేరుకోలేదని నేను అనుకొన్నాను. కాని వాళ్ళు భయానికి కారణం మోహన్. తమాషా ఏమిటంటే నేను వాళ్ళతో మాట్లాడుతున్నంతసేపూ మోహన్ ఆ యింట్లోనే వంటగదిలో దాక్కొని, వాళ్ళు నాతో ఏం చెప్తున్నారో వింటూ ఉన్నాడట"

ఆశ్చర్యంతో చూసింది మాధవి. "ఆ విషయం మీకెలా తెలిసింది? మళ్ళీ స్వప్న ఇంటికి వెళ్ళారా? " అని అడిగింది.

"అవును. బ్యాంక్‌లో మోహన్ ఫొటో చూడగానే ఎంతో షాకయ్యాను. ఆ షాకు నుండి తేరుకోవడానికి నాకు చాలా సమయం పట్టింది. అక్కడ్నుంచి స్వప్న ఇంటికి వెళ్ళాను. స్వప్న తల్లి ఇంట్లోనే ఉంది. నేను ఆవిడ బావగారి గురించి ఆరా తీయబోయాను. ఆవిడ తనకు బావగారే లేరని, తన భర్త వాళ్ళ తల్లిదండ్రులకు ఒకడే కొడుకని చెప్పింది. మోహన్ గురించి అడిగితే అతనెవరో తెలియదంది. మధ్యాహ్నం వరకూ అక్కడే ఉండి గీత వచ్చాక ఆమె మోహన్‌ను తన అన్నగా ఎందుకు గుర్తించిందో చెప్పమన్నాను. ఆమె చాలాసేపు చెప్పలేదు. ఆమెకు ఏ ఇబ్బందీ రాదని, మోహన్ అరెస్ట్ అయి జైల్లో ఉన్నాడని చెప్పాక జరిగింది చెప్పింది. తను నాతో అంత కోపంగా మాట్లాడటానికి కారణం మోహన్ అలా మాట్లాడమని ఫోర్స్ చెయ్యడం వల్లనే అని కూడా చెప్పింది"

"మోహన్ అరెస్టయ్యాక అతన్ని మీరు కలిశారా? "

"అరెస్టు అయినప్పుడు నేను అక్కడే ఉన్నాను. నావైపు కోపంగా చూశాడు. 'నీవు అనవసరంగా నన్ను ఇరికిస్తున్నావు. నిజంగా నాకే విషయం తెలియదు. నువ్వు చేసిన పనికి పశ్చాత్తాప పడతావు' అన్నాడు. నేనేం మాట్లాడలేదు. మాట్లాడాలని అనిపించలేదు. తర్వాత అతని మొహం చూడాలని

ఇతరులకు మంచి చేయడం అన్నది కర్తవ్యం కాదు. మంచి చేయడం అన్నది మీ ఆరోగ్యాన్ని ఆనందాన్ని పెంపొందించి సుఖాన్ని ఇస్తుంది.– జూరాస్టర్

కూడా అనిపించలేదు."

"ఎక్కడ దొరికాడు మోహన్ మీకు?"

"నేను స్వప్న ఇంటి నుంచి నేరుగా సుందర్ దగ్గరికి వెళ్ళి నేను కనుక్కొన్న విషయాలన్నీ చెప్పాను. అతను వెంటనే తన పై అధికారులతో ఫోనులో మాట్లాడాడు. అతన్ని ప్రొసీడ్ అవమని, తమ సపోర్ట్ అతనికి పూర్తిగా ఉంటుందని వాళ్ళు హామీ యిచ్చారు. సుందర్ నన్ను మోహన్‌కు ఫోన్ చేసి అతనెక్కడ ఉన్నాడో కనుక్కోమన్నాడు. నేను ఫోన్ చేసి యాభైవేలు క్యాష్ తెచ్చానని, ప్రమీలమ్మ ఇచ్చి పంపిందని చెప్పాను. 'గదికే తీసుకురండి. మీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను' అన్నాడు. సుందర్, అతని టీమ్‌తో బాటు నేనూ జీప్‌లో వెళ్ళి మోహన్‌ను వాళ్ళకు చూపించాను. అతను అమాయకంగా మొహం పెడుతూ ఏదో చెప్పబోయాడు. సుందర్ వినలేదు. స్టేషన్‌కు వచ్చి చెప్పుకో' అన్నాడు. అతన్ని అరెస్ట్ చేసి స్టేషన్లో చితకబాదితే పదిహేను మంది కుర్రాళ్ళ పేర్లూ, ఫోన్ నెంబర్లూ, అడ్రసులూ చెప్పాడు. సాయంత్రం లోపు చాలా మందిని అరెస్టు చేశారు. నాకు తెలిసి ఇంకా ఒకరో, యిద్దరో అరెస్ట్ చేయడానికి మిగిలి ఉండొచ్చు. అరెస్ట్ అయిన వారిలో ఉదయ్ కూడా ఉన్నాడు. ఇంతమంది అంత గుట్టుగా తమ కార్యకలాపాలు సాగించారంటే వీళ్ళు ఎంతో తెలివితేటలు ఉన్నవాళ్ళని మనం అర్థం చేసుకోవచ్చు. వీళ్ళందరికీ నాయకుడు మోహన్.

"ఉదయ్ దాదాపు వారం రోజులు ఇంటికి రాలేదని చెప్పారు కదా. ఎక్కడ ఉన్నాడట అన్ని రోజులు?"

మొదట శశాంక్ తటపటాయించాడు చెప్పడానికి. తర్వాత చెప్పాడు.

"హసీనా యింటి దగ్గర్నుంచి నన్ను మా అక్కయ్య యింటి దగ్గర డ్రాప్‌చేసిన ఉదయ్ అక్కడ్నుంచి హసీనాను దాచి ఉంచిన యింటికి వెళ్ళాడు. ఆ తర్వాత అతని యింటి ముందు పోలీసులు ఉన్న విషయం అతని స్నేహితులు తెలుసుకొని అతనికి ఫోన్ చేశారు. ఈ వారం రోజులూ అతను అక్కడే ఉండిపోయాడు హసీనాను బలవంతంగా అనుభవిస్తూ" అంటూ బాధగా కళ్ళు మూసుకున్నాడు శశాంక్.

ఆ మాట విన్నాక మాధవి మనసు కూడా ఏదోలా అయిపోయింది.

"ఛీ. రాక్షసుడు. వాడు నా ముందు ఉండి ఉంటే వాణ్ణి చంపి జైలుకెళ్ళేదాన్ని" ఒళ్ళు మరచిన కోపంతో అంది.

'ఈ పాపం మాత్రం నాదే. నావల్లే ఆవిడకు ఆ కష్టం వచ్చింది' అన్నాడు శశాంక్ కళ్ళనీళ్ళతో. అతన్ని అలా చూస్తుంటే ఆమె కంట్లో కూడా నీరు తిరిగింది.

"ప్లీజ్. శశాంక్. బాధపడకండి. కర్మ సిద్ధాంతాన్ని నమ్మండి. ఆమె ఎప్పుడో తెలియక చేసిన పాపానికి ఫలితం అనుభవించింది కాని మీ వల్ల కాదు. పైగా ఎంతో మంది అమ్మాయిలను ఆ రాక్షసుల బారి నుంచి కాపాడారు కదా. అది పుణ్యం కాదా? హసీనా కూడా ప్రాణాలతో బయటపడిందంటే అందుకు మీరే కారణం అవునూ. హసీనా విషయం పేపర్లో వెయ్యలేదే?"

"పేపర్లో ఆమె పేరు వస్తే ఆమెకు ఇబ్బంది అవుతుందని నేనూ, సుందర్ ముందే మాట్లాడుకొని ఆమె విషయం ప్రెస్‌కు చెప్పలేదు. ఉదయ్ ఆమెని వడపళని అనే ఓ లొకాలిటీలో తన స్నేహితుడి ఇంట్లో దాచాడు. మోహన్ ద్వారా ఆమె ఇంటి అడ్రస్ కనుక్కొని వెళ్ళి ఉదయ్‌ని అరెస్ట్ చేసి హసీనాను ఆమె ఇంటికి పంపాము" అన్నాడు శశాంక్.

కొంతసేపు యిద్దరూ మౌనంగా ఆలోచించుకుంటూ ఉండిపోయారు.

"కాఫీ చెప్పనా?" అని అడిగింది మాధవి.

"మీకు భోజనానికి ఆలస్యమవుతున్న

దేమో? " అన్నాడు.

"ఫర్వాలేదు. నాకు ఇప్పుడే ఫోంచేయాలని లేదు" అంటూ నర్స్‌ని పిలిచి రెండు కాఫీలు పంపించమని చెప్పింది.

శశాంక్ ఏదో ఆలోచిస్తూ, అంతలోనే అర్ధ మైనట్టు తలూపుతుంటే ఏమిటని అడిగింది మాధవి.

"ఆ రోజు నా తలపై కొట్టిన వ్యక్తి మోహన్ అయి ఉండవచ్చని, ఎందుకంటే నేను బయలుదేరేముందు మోహన్‌కు ఫోన్ చేశానని నేను ఉదయ్‌తో చెబితే మోహన్ అయి ఉండడని, అతన్ని అనుమానితుల లిస్టులో నుంచి తీసెయ్యమనీ ఉదయ్ పదే పదే చెప్పినా నాకు అనుమానం రాలేదు. ఇప్పుడు ఆలోచిస్తే అతను తన ఫ్రెండును ప్రొటెక్ట్ చేయడానికే అలా చెప్పాడని అర్థమవుతూంది'

"అంటే ఆరోజు మిమ్మల్ని కొట్టింది మోహన్ అయి ఉంటాడంటారా? "

"కాదు. కొట్టించింది మోహన్. నేను సెకండ్‌షోకు వెళ్తున్నట్లు ఉదయ్‌కు తెలియదు. కాని మోహన్‌కు నేను ఫోన్ చేసి చెప్పాను కాబట్టి అతనికి తెలుసు. వెంటనే నన్ను కొట్టి, భయపెట్టి, తిరిగి నెల్లూరుకు పంపించడానికి ఇదే అవకాశమని భావించాడు మోహన్. అతని మనుషులను పంపినా నన్ను వాళ్ళకు చూపించడానికి ఉదయ్‌గాని, మోహన్‌గాని ఉండాలి. మోహన్ సినిమాకు వస్తే నాకు అనుమానం వస్తుందని ఉదయ్‌కు ఫోన్ చేసి అతన్ని పంపించాడు. వీళ్ళందరి దగ్గరా సెల్ ఫోన్లు ఉన్నాయి. కనుక ఇన్‌ఫర్మేషన్ చాలా త్వరగా ఒకరి నుంచి మరొకరికి చేరుతుంది. పెరిగిన టెక్నాలజీని మంచి పనులకు కాకుండా ఇలా దుర్మార్గాలకు వాళ్ళు వాడుకోవడం బాధాకరం."

కాఫీ వచ్చాక మాధవి నర్స్‌తో "నీకు లేటవుతూంటే వెళ్ళు. నేను లాక్ చేసుకుంటాను'' అంది. అలాగేనంటూ తాళం, తాళం చెవులు టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయింది నర్స్.

"ఇంకో అమ్మాయి ఉండాలిగా. కనబడ లేదే" అని అడిగాడు శశాంక్.

"ఈరోజు శెలవు పెట్టింది. కాఫీ తీసుకోండి"

కాఫీ తాగాక ఆమె టేబుల్ డ్రా లాక్ చెయ్యడానికి అవస్థ పడుతూంటే

"మీరిలా వచ్చెయండి. నేను లాక్ చేస్తాను" అన్నాడు. ఆమె జరిగాక అతను డ్రాను ఒకసారి పూర్తిగా తెరచి మరలా లోపలికి తోస్తూ ఆగాడు.

డ్రా లోపల ఓ ఫోటో ఉంది. అయిదేళ్ళ పాప ఫోటో అది.

"ఆ ఫోటో ఎవరిదో చూసి చెప్పండి" అంది మాధవి.

శశాంక్ ఫోటోను చేతిలోకి తీసుకుని చూశాడు.

"మీ చిన్నప్పటి ఫొటో ఇది. చూడగానే తెలుస్తూంది" అన్నాడు.

"అక్కడే పప్పులో కాలేశారు. అది మా అన్నయ్య ఫోటో. వాడికి అమ్మాయి వేషం వేసి తీశారు. మేమిద్దరం కవలపిల్లల్లా ఒకేలా ఉంటాం" అంది. తన అన్నయ్య అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజినీరని ఆమె శశాంక్‌తో ఇదివరకే చెప్పింది.

"అలాగా. అయితే దయచేసి మన పెళ్ళయ్యాక మాత్రం ఆయన్ని ఆడవేషం వేసుకోవద్దని చెప్పండి. మళ్ళీ చాలా ఇబ్బంది అవుతుంది" అన్నాడు శశాంక్.

మాధవి పకపకా నవ్వసాగింది. శశాంక్ డ్రా లాక్ చేసి కీస్ ఆమెకిచ్చాడు. ఆమె అందుకుంటూ "శశాంక్ ఇందాకట్నుంచీ మిమ్మల్ని అడగాలనుకుంటూనే, ఈ పాయింట్ తర్వాత అడుగుదాం అనుకొని మర్చిపోతున్నాను. ఇప్పుడు ఫోటో చూస్తే గుర్తొచ్చింది హసీనాను ఉదయ్ బెదిరించడంవల్ల మోహన్ పేరు చెప్పిందని ఇంతకు



## బుర్రే బలహీనం

నెహ్రూ, ఇందిరాగాంధీ, షేక్ అబ్దుల్లా, మియాన్ ఇఫ్‌టికుద్దీన్ నలుగురూ ఓసారి కాశ్మీర్‌లో గుర్రపు స్వారీకి బయలుదేరారు. వీరిలో మియాన్‌కు స్వారీ రాదు. అదేవిషయం నెహ్రూ గుర్తుచేయగా 'ఓస్ అదెంత.. బుర్రలో కొద్దిగా తెలివితేటలుండాలేగానీ అదోలెక్కా?' అన్నాడు మియాన్ దర్పంగా. తర్వాత నలుగురూ బయలుదేరారు. కొద్దిసేపటి తర్వాత మియాన్ గుర్రంమీద నుంచి పడిపోయాడు. ఆ విషయం తెలిసి నెహ్రూ తదితరులు వెనక్కుమళ్లి అతను పడిపోయిన చోటికివచ్చారు. అప్పటికే కొందరతన్నిలేపి కూర్చోబెడుతున్నారు.

'దెబ్బ తగిలిందా?' అడిగారు నెహ్రూ.

'తలకు తగిలింది' అన్నాడు మియాన్ బాధను బిగపట్టుకుంటూ.

'అర్రెర్రే.. నీ దేహంలో అన్నింటికన్నా బలహీనమైనది నీ బుర్రే. అయ్యో.. దానికే దెబ్బతగిలిందా?.. ఇప్పుడెలా?' అన్నారు కవ్విస్తూ నెహ్రూ.

అంతబాధలోనూ ఆయన హాస్యధోరణికి నవ్వేశాడు మియాన్.

ముందు అనుకున్నాం. మరి మోహన్ ఉదయ్‌కు ఫ్రెండు కదా. అతని పేరు చెప్పమని ఉదయ్ చెప్పి ఉండడు కదా? " అని అడిగింది.

"అప్పుడు మోహన్ మీద అనుమానం లేదు కాబట్టి అలా అనుకున్నాను. ఇప్పుడు పిక్చర్ క్లియర్‌గా అర్థమైంది. మోహన్ ఫోటో చూచిన ఉదయ్, అందులో మోహన్ ఫోటో పూర్తిగా లేదు కాబట్టి ఆమె గుర్తించలేదు అనుకున్నాడు."

అందుకే అతను హసీనాను కలసి బెదిరించలేదు. వాళ్ళు ఊహించినట్లే హసీనా మోహన్‌ను గుర్తుపట్టలేదు. ఆమె అతన్ని చూసింది రాత్రిపూట, అదీ నిద్రమత్తులో. పైగా ఫోటోలో మొహం పూర్తిగాలేదు. అయితే అనుకోకుండా సదాశివరావు ఇచ్చిన ఫోటో నా చేతికి వచ్చింది. అది చూపగానే హసీనా మోహన్‌ను గుర్తించింది. ఫోటో అంత త్వరగా నా చేతికి దొరుకుతుందని వాళ్ళు ఊహించలేదు. నేను రైల్వేస్టేషను నుంచి హసీనా మోహన్‌ని గుర్తించిన విషయం ఉదయ్‌కు చెప్పినప్పుడు పెద్ద షాక్ తిని ఉంటాడు అతను."

"అబ్బ ఎన్ని విధాలుగా ఆలోచించారు మీరు?" అతన్ని మెచ్చుకోలుగా చూస్తూ అంది.

"ఇంకో విషయం వినండి. మోహన్‌తో పాటు నాజర్ ఇంటికి వచ్చిన వ్యక్తి ఉదయ్. ఇద్దరూ కలసి నాజర్‌ను హత్య చేశారు. హసీనా 'ఇద్దరు కుర్రాళ్ళు వచ్చారు' అని చెప్పింది కాని నాకు మోహన్ మీదే అనుమానం ఉండటంవల్ల ఒక వ్యక్తి పోలికలు చెప్పగానే అవి మోహన్‌కు సరిపోయాయనుకున్నాను. రెండో వ్యక్తి గురించి అడగలేదు నేను. ఆమె తనను చూస్తే గుర్తుపడుతుందన్న భయం వల్ల బైక్‌లో



పెట్రోలు అయిపోయిందని ఉదయ్ నన్ను ఆటో ఎక్కించి పంపించాడు. నేను హసీనాతో మాట్లాడి బయట నిలబడి ఉంటే అప్పుడు వచ్చాడు అక్కడికి."

"అప్పుడు హసీనా చూడలేదా అతన్ని?" అర్థం కానట్లు మొహం పెడుతూ అంది మాధవి.

"చూసింది. నేనే పరిచయం చేశాను ఆవిడకి.

"మరి ఆమె ఉదయ్ హంతకుడని మీకు చెప్పలేదా?"

నవ్వాడు శశాంక్. మాధవి అర్థం కానట్లు చూసింది.

"మీరే చెప్పండి అతన్ని ఎందుకు గుర్తుపట్టలేదో"

మాధవి కొంతసేపు ఆలోచించి "ఆవిడ మర్చిపోయి ఉంటారు. లేదా ఉదయ్ మీసాలు తీసేసిగాని, అదివరకు లేని మీసాలు పెంచుకునిగాని కనబడి ఉంటాడు" అంది.

"కాదు. అప్పుడతను మొహం కనిపించకుండా హెల్మెట్ పెట్టుకుని ఉన్నాడు"

ఆశ్చర్యంగా చూసింది మాధవి. "ఛ. ఆ పాయింటే నాకు తట్టలేదు" అంది.

"నాతోపాటు ఇంట్లోకి వస్తే అతను తప్పని సరిగా హెల్మెట్ తియ్యాలి. తీస్తే హసీనా గుర్తుపడుతుంది. అదే బయలుదేరే ముందు వస్తే వెహికల్ దిగే అవసరం ఉండదు కాబట్టి హెల్మెట్ తీసే అవసరం కూడా ఉండదు."

"ఏం తెలివి వీళ్ళకు" అంటూ ఆశ్చర్యపోయింది.

ఇద్దరూ లేచారు. "శశాంక్ ఇంకో డౌటు. బహుశ నాకున్న చివరి డౌటు ఇదేననుకుంటాను" అంది మాధవి.

"అడగండి"

"నాజర్‌ను మోహన్ ఎందుకు హత్య చేశాడు? "

"నాజర్ మోహన్‌కు స్నేహితుడు. అతనూ ఇతని దుర్మార్గాల్లో పాలుపంచుకున్నాడు. వీళ్ళ దృష్టి స్వప్న పనిచేస్తున్న కాలేజీపై పడింది. అక్కడ చాలామంది అమ్మాయిలు పనిచేస్తున్నారు కాబట్టి వాళ్లలో ఒకర్నో, ఇద్దర్నో ట్రాప్ చేయాలని నిర్ణయించుకుని నాజర్‌ను వాచ్‌మన్‌గా ఆ కాలేజీలో ప్రవేశపెట్టారు. అందర్లోకి సీనియర్ అయిన స్వప్న దగ్గర ఎక్కువ డబ్బులు ఉంటాయని ఊహించాడు నాజర్. నిజానికి ఆమె పెద్ద కుటుంబాన్ని పోషించవలసి ఉన్నా చాలా పొదుపుగా ఖర్చులు పెడుతూ, ట్యూషన్లు చెబుతూ ఆ మూడు లక్షలూ కూడబెట్టింది. ఆమెకు నాజర్ ద్వారా మోహన్ పరిచయం అయ్యాడు. పరిచయం ప్రేమ వరకూ వెళ్ళింది. స్వప్న నాజర్ అంటే చాలా అభిమానంగా ఉండేది. అతనితో తన కుటుంబ విషయాలతో సహా అన్ని విషయాలూ చెప్పేది. క్రమంగా నాజర్‌కు స్వప్నపై సోదర భావం కలగసాగింది. అందువల్ల అతను మోహన్‌తో స్వప్నను వదిలెయ్యమని కోరాడు. మోహన్ ఒప్పుకోలేదు. అయితే స్వప్న దగ్గర ఇక డబ్బులు లేవని తెలుసుకొని మోహన్ స్వప్నను వదిలేశాడు. స్వప్న ఆత్మహత్య చేసుకోవడం నాజర్ భరించలేకపోయాడు. మోహన్‌కు ఫోన్‌చేసి అతన్ని పోలీసులకు పట్టిస్తానని బెదిరించాడు. ఆ రాత్రి మోహన్, ఉదయ్ నాజర్ ఇంటికి వచ్చి ఎంతో చెప్పి చూశారు. అతను వినకపోయేసరికి బెల్టుతో ఉరితీసి చంపేశారు"




"ఈ విషయాలన్నీ మీకెలా తెలిశాయి. మీరు మోహన్‌తో మాట్లాడలేదన్నారు కదా? "

"మోహన్‌తో చెప్పించాడు సుందర్"

నాజర్ మంచివాడుగా మారినందుకు అతనికి శిక్షపడటం ఎంతో బాధగా అన్పించింది ఇద్దరికీ.

"అబ్బ తల తిరిగిపోతూంది నాకు. పదండి వెళదాం. మీరూ మా ఇంటికి రండి. మాతో కలసి భోంచేద్దురుగాని"

"వద్దు. మీ ఇంట్లో పెద్దలు ఏమైనా అనుకుంటారు" మొహమాటంగా అన్నాడు.

"ఇన్ని అడ్వెంచర్స్ చేసిన మీరు మా ఇంట్లో వాళ్ళను చూసి భయపడుతున్నారా? షేమ్. పదండి మా ఇంట్లో ఏం అనుకోరు. పైగా నేను మన విషయం వాళ్ళకు చెప్పాను. వాళ్ళు సూచనప్రాయంగా అంగీకరించారు" అంది మాధవి.

"అయితే ఓకే" అన్నాడు శశాంక్ నవ్వుతూ.

" 'ఓకే' పెళ్ళికి ముందు అనకూడదట"

"ఎందుకు? "

""ఓకే అంటే వన్ కిస్ కదా? "

"నా భాషలో 'ఓన్లీ కిసెస్, నథింగ్ ఎల్స్' అని అర్థం" అన్నాడు శశాంక్.

క్లినిక్ లాక్ చేశాక "మీరు నన్ను చాలా బాగా ఇంటర్వ్యూ చేసి జవాబులు రాబ

మానవుని అసహనం కారణంగా మానవాళికి గొప్ప నష్టం, హాని కలుగుతోంది. – హెలెన్ కెల్లర్

ట్టారు. మీరు అడగని, మీకు తోచని ఇంకో ప్రశ్న ఉంది. అది ఈసారి కలిసినప్పుడు అడగండి" అన్నాడు. "అలాగే" అంది మాధవి.

బైక్‌లో ఇద్దరూ మాధవి ఇంటికి వెళ్ళారు.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం మాధవి ప్రమీలమ్మ కుటుంబ సభ్యులు నలుగురినీ కూర్చోబెట్టుకుని జరిగిన విషయం మొత్తం చెప్పింది. శశాంక్ సాహితి జీవితం కాపాడటం కోసం ఎంతగా తపన పడ్డాడో, ఎన్ని ప్రమాదాలను ఎదుర్కొన్నాడో చెప్పింది. వాళ్ల కుటుంబానికి ఓ గండం తప్పిందని చెప్పింది. ఎంతో ధైర్యం చెప్పింది. సాహితికి మంచి వ్యక్తిని చూసి పెళ్లి చేసే బాధ్యత తనదంది. యాభై వేలతో పీడ వదిలినందుకు సంతోషించమంది. సాహితి జీవితం పాడు కానందుకు అదృష్టవంతుల మంది. మరో యాభై వేలు మోహన్‌కు ఇవ్వకుండా తిరిగి తెచ్చిన శశాంక్‌ను మెచ్చుకుంది.

అంతా చెప్పాక ఆ నలుగురి నుంచీ రెస్పాన్స్ కోసం ఎదురు చూసింది. మొదటి రెస్పాన్స్ సాహితి నుంచి వచ్చింది. అయితే ఆమె ఊహించని రెస్పాన్స్ అది.

"మాధవిగారూ. మీరు చెప్పినదంతా విన్నాక నాకు బాధ కలుగలేదు. ఎంతో సంతోషం కలిగింది. మోహన్‌ను పెళ్లి చూపుల్లో చూసినప్పుడు నాకు ఎంతో నచ్చారు. అందుకే అతనితో పెళ్లికి నా అంగీకారం తెలిపాను. అయితే నిశ్చితార్థానికి ముందే 'అతని గురించి పూర్తిగా తెలుసుకున్నారా?' అని నా తల్లిదండ్రులను అడగకపోవడం నా తప్పు. వీళ్ల మీద నమ్మకంతో, మా మామయ్య మీద నమ్మకంతో పెళ్లికి ఒప్పుకున్నాను. ఆయన రెండు మూడు సార్లు నెల్లూరు వచ్చారు. ఆయన నచ్చినంతగా ఆయన ప్రవర్తన నాకు నచ్చలేదు. ఆయనలో సంస్కారం లోపించిందని మొదటి రోజే నాకు తెలిసింది. పాజిటివ్ థింకింగ్ లేదు. ఎప్పుడూ ఎదుటి మనిషి నుంచి ఎంత డబ్బులు లాగుదామా అని ఆలోచించే మనిషి. ఆయన్ను చూశాక శశాంక్ ఎంత గొప్ప మనిషో నాకు తెలిసింది. ఇది చాలదన్నట్టు ఆయనకు తాగుడు అలవాటు కూడా ఉంది. అందుకే ఈ పెళ్లి రద్దయిపోతే బాగుంటుందని అనుకునేదాన్ని."

"మరి ఈ విషయాలన్నీ నాతో చెప్పలేదేమమ్మా?" అని అడిగింది ప్రమీలమ్మ.

"నా బాధ నీకూ పంచడం ఎందుకని చెప్పలేదు. అయితే ఏదో ఒకనాడు నీతో చెప్పేదాన్నే. అయితే అంతలోనే మరో యాభై వేలు అతని చేతికి వెళ్లిపోయి ఉండేది. ఈ విషయంలో శశాంక్ గారే నాకంటే ఎక్కువ తపించి ఆ డబ్బును మనకు దక్కించారు. మనం ఎదురుగా కనిపించే దేవుణ్ణి పెట్టుకొని కనిపించని దేవుళ్ళకు మొక్కుతున్నాం యిన్నాళ్ళూ" అంటూ వెక్కి వెక్కి ఏడవసాగింది. మాధవి సముదాయించినా ఆమె ఏడుపు ఆపలేదు. ఆమె శశాంక్‌ను మొదట్లో ఈసడించుకున్న విషయం గుర్తొచ్చి ఏడుస్తున్నదని మాధవి అనుకుంది.

సాహితి ఏడవడం చూసి ప్రమీలమ్మ కూడా ఏడవసాగింది. ముకుందరావు ఎప్పటిలా మౌనంగా వింటూండిపోయాడు. కీర్తన కూడా చిన్నగా ఏడవసాగింది. అప్పుడే శశాంక్ లోపలికి అడుగు పెట్టాడు. ప్రమీలమ్మ లేచి వేగంగా అతన్ని సమీపించి అతని రెండు చేతులూ తీసుకుని, తన కళ్లకు ఆనించుకుని ఏడవసాగింది. శశాంక్ కూడా కళ్లనీళ్ళు పెట్టుకున్నాడు. గత మూడు నెలలుగా అతను మనసులో పడినఆందోళన, వ్యధ, భయం అన్నీ కన్నీటి రూపంలో బయటకు వచ్చింది.

ముందుగా శశాంక్ తేరుకుని "అమ్మా, ఏడవకండి. ఇప్పుడేమయిందని బాధపడతారు. అంతా మంచేగా జరిగింది. సాహి

తికి మంచి వరుణ్ణి చూసి పెళ్ళి చేసే బాధ్యత నాది" అన్నాడు.

"దాని పెళ్ళి తప్పిపోయినందుకు నేను ఏడవటం లేదయ్యా. మా కోసం నీవు పడ్డ బాధ తలచుకుని ఏడుస్తున్నాను. నీకు మేము ఏమౌతామని అన్ని బాధలు పడ్డావయ్యా"

"అదేమిటమ్మా అలా అంటారు? అమ్మలా అన్నం పెట్టారు. అక్కలా ఆదరించారు. మీకు నేనేమౌతానని ఇవన్నీ చేశారు? " అన్నాడు శశాంక్.

"ఇక అందరూ రిలాక్స్ కండి. 'ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్' అంటారు. అంతా మన మంచికే జరిగింది. శశాంక్ గారూ. వీళ్లందర్నీ కాసేపు నవ్వించండి" అంది మాధవి

శశాంక్ కీర్తనతో జోక్స్ చెబుతూంటే మిగిలిన వాళ్లు కూడా వింటూ, క్రమంగా నవ్వసాగారు. వాతావరణం తేలిక కావడంతో శశాంక్ తృప్తిగా నిట్టూర్చాడు. 'ముఖ్యంగా మోహన్ గురించి ప్రమీలమ్మ కుటుంబానికి చెప్పడం అయిపోయింది' అనుకున్నాడు.

★ ★ ★

రామకృష్ణ తన చెల్లెలు విజయ నిశ్చితార్థం రోజున తన బ్యాంక్ స్టాఫ్, బంధువులతో పాటు శశాంక్‌ను, మాధవిని కూడా భోజనానికి పిలిచాడు. భోజనాలు రామకృష్ణ ఇంటి మేడపైన షామియానా వేసి అరేంజ్ చేశారు.

శశాంక్, మాధవి పక్క పక్కనే కూర్చున్నారు.

"శశాంక్ గారూ, ఆ రోజు నేను ఒక ప్రశ్న అడగలేదని అన్నారు. ఆ ప్రశ్న ఏమిటో సాహితి వాళ్లింట్లో గుర్తొచ్చింది. చెన్నైలో ఉన్న మోహన్‌కి, నెల్లూరులో ఉన్న సాహితికి సంబంధం ఎలా కుదిరింది? "

"మోహన్ ఇన్నాళ్లూ చేసింది జాయింట్ వెంచర్స్. అందువల్ల తాను అమ్మాయిల నుంచి దోచుకున్న డబ్బుల్ని ఫ్రెండ్స్‌కు పంచివ్వాలి. అందుకే ఈసారి ఇండిపెండెంట్‌గా ఓ వెంచర్ చేయాలనుకున్నాడు. సాహితి చెన్నైలో చదువుకుంటున్నప్పుడు మోహన్ ఆమెను చూడటం జరిగింది. అందంగా, అమాయకంగా కనిపిస్తున్న ఆమె వివరాలు కనుక్కున్నాడు. తల్లితండ్రులు ఉద్యోగస్తులని తెలుసుకుని, ఆమెను పెళ్ళి చేసుకుంటే కట్నం రూపంలో, వేధింపుల రూపంలో ఎన్నో లక్షలు పొందవచ్చనుకున్నాడు. పైగా ఇంట్లో అన్నీ చేసి పెట్టడానికి ఓ మనిషి, మరో 'షి' దొరకనప్పుడు మంచం మీదికి ఉపయోగపడుతుందని భావించాడు. ప్రమీలమ్మ తన కూతురికి పెళ్ళి కుదిర్చే బాధ్యత బెంగుళూరులో ఉన్న తన అన్నయ్యకు ఒప్పజెప్పిందని తెలుసుకుని బెంగుళూరులో తన పథకానికి నాంది వేశాడు. మిగిలింది మీరే ఊహించుకోవచ్చు".

"ఎందుకంత బాధ. ఉద్యోగం తెచ్చుకుని, పెళ్ళి చేసుకుని హాయిగా ఉండొచ్చుగా".

"ఉద్యోగం అంటే కష్టపడి పని చెయ్యాలి. ఈ పద్ధతిలో అయితే సులభంగా సంపాదించుకోవచ్చు. సుఖం, ధనం, థ్రిల్ అన్నీ లభిస్తాయి."

"ఛ. ఏం మనుషులో వాళ్లు" అంది మాధవి. ఇద్దరూ భోజనంముగించి రామకృష్ణ కోసం ఎదురు చూస్తూ అక్కడే నిలబడ్డారు. ఇంతలో అతని సెల్ మ్రోగింది. నెంబరు చూసి "సుందర్" అని, అతనితో మాట్లాడి సెల్ జేబులో పెట్టుకుని "మీకు ఇంకో గుడ్ న్యూస్" అన్నాడు.

ఏమిటన్నట్టు కుతూహలంగా చూసింది.

"తమిళనాడు ప్రభుత్వం నాకు లక్ష రూపాయలు అవార్డుగా ఇస్తుందట".

మాధవి సంతోషంతో అరచినంత పని చేసింది. క్షణాల్లో ఆ వార్త అక్కడున్న వారందరికీ తెలిసింది. అందరూ శశాంక్‌ను అభినందించారు. కొంతమంది అవార్డు ఎందుకు ఇస్తున్నారని అడిగారు.

ఇంతలో రామకృష్ణ అక్కడికి చేరుకుని, శశాంక్‌ను అభినందించి, తర్వాత అందరికీ శశాంక్ సాధించిన విజయం గురించి చెప్పాడు.

"సాధారణ ధైర్య సాహసాలున్న శశాంక్ ఓ స్నేహితురాలి కోసం, ఓ కుటుంబం క్షేమం కోసం, పరాయి రాష్ట్రంలో, పూర్తిగా తెలియని భాషతో, ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని, ఎంతో సమయం, డబ్బు వెచ్చించి, ఆడపిల్లల జీవితాలతో ఆడుకొనే ఓ భయంకరమైన ముఠాను పోలీసులకు పట్టిచ్చాడు. ప్రతి క్షణం భయపడుతూ, ప్రమాదాలతో ఆడుకుంటూ, 'ఆ కుటుంబానికి చెడు జరగకూడదు' అన్న ఒకే ఒక్క తపనతో పోరాడి, విజయం సాధించి హీరో అయ్యాడు. శశాంక్ నా స్నేహితుడని చెప్పుకోవడానికి నేనెంతో గర్వపడుతున్నాను" అన్నాడు ఉద్వేగంతో.

తర్వాత అందరి దగ్గరా శెలవు తీసుకుని బయలుదేరారు శశాంక్, మాధవి.

మాధవిని ఆమె ఇంటి దగ్గర డ్రాప్ చేసి "నేను రాత్రికి చిత్తూరు వెళుతున్నాను. జరిగిన విషయాలన్నీ అమ్మా నాన్నలతో పర్సనల్‌గా చెప్పాలని ఉంది. అలాగే మన పెళ్ళి విషయం కూడా మాట్లాడి వస్తాను" అన్నాడు.

"అలాగే! ఆల్ ది బెస్ట్, మీ అమ్మా నాన్నలకు నా నమస్కారాలు అందజేయండి".

"అలాగే. గుడ్ నైట్".

"గుడ్ నైట్".

★ ★ ★

మాధవి క్లినిక్ ముందు బైక్ ఆపాడు శశాంక్. బ్యాగ్ తీసుకొని లోపలికి అడుగు పెట్టగానే నర్స్ ఎదురుపడి అతన్ని చూసి నవ్వింది.

"ఒక్క నిమిషం కూర్చోండి. ఆఖరి పేషెంట్ ఉన్నారు లోపల" అంది కుర్చీ చూపిస్తూ.

శశాంక్ కుర్చీలో కూర్చుని చుట్టూ చూడసాగాడు. డాక్టర్ మాధవి ప్రాక్టీసు ఈ మధ్యలో బాగా పెరిగింది. ఆమె హస్తవాసి బాగుందని, ఓపికగా చూస్తుందని పేరు రావడంతో పేషెంట్ల సంఖ్య పెరిగింది. ఇన్ పేషెంట్లుగా చేరేవారూ ఎక్కువయ్యారు. అందువల్ల క్లినిక్ రూపు రేఖలు మరింతగా మారిపోయాయి.

"సర్, మేడమ్ రమ్మంటున్నారు" నర్స్ పిలిచింది.

"గుడ్ మార్నింగ్ డాక్టర్" అంటూ లోపలికి అడుగు పెట్టాడు.

"ఈ మధ్యే వచ్చారుగా. మళ్ళీ వచ్చారేమిటి? " అంది మాధవి విసుగ్గా మొహం పెడుతూ.

"మీరు నన్ను వీలైనన్నిసార్లు రమ్మనేవారు. అందువల్ల వచ్చాను" అంటూ శాంపిల్స్ బ్యాగ్ నుంచి తీసి ఆమె టేబుల్‌పై పెట్టాడు.

"శాంపుల్స్ ఇస్తే చాలా? డీటైలింగ్ చేయరా? "

"ఇదివరకు నేను చేస్తే మీరు వద్దనేవారు" అంటూ డీటైలింగ్ చేశాడు.

"మా కంపెనీకి మీ సపోర్టు ఇలాగే కొనసాగించండి" అన్నాడు.

"మార్కెట్లో ఎన్నో మంచి కంపెనీలు ఉన్నాయి. మీ కంపెనీకే ఎందుకు సపోర్ట్ చేయాలి నేను? " అంది సీరియస్‌గా.

"ఎందుకంటే ఆ కంపెనీలో నేను పని చేస్తున్నాను కనుక"

"సో వాట్? " కనుబొమలు ఎగరేస్తూ అంది.

"నేను మీ భర్తను కనుక".

"ఐసీ" అంటూ నవ్వసాగింది. శశాంక్ కూడా నవ్వసాగాడు.

తర్వాత ఇద్దరూ బయటకు వచ్చారు. శశాంక్ బైక్ స్టార్ట్ చేయగానే అతని వెనుక కూర్చుంది 'డాక్టర్ మాధవీ శశాంక్'. బైక్ వాళ్ళ ఇంటివైపు కదిలింది.

✷

# చతురర కతలు

## డిటో

టైప్‌రైటర్ కీ బోర్డు మీద కదులుతున్న ఆమె చేతి(వేళ్ళు హఠాత్తుగా ఆగిపోయాయి. ఎదురుగానిల్చుని తన వైపే చూస్తూ 'క్షమించండి, మీరు లావణ్య కదూ' అంటున్న యువకుడిని చూసి తనలో కలిగిన ఏదో కొత్త ఫీలింగ్‌ని కప్పిపుచ్చే (ప్రయత్నంలో కళ్ళు కిందికివాల్చి 'అవును' అన్నట్లుగా తలూపింది.

'నా పేరు శ్రీరామ్' అన్నాడతను తననితనే పరిచయం చేసుకొంటూ.

లావణ్యకు వెంటనే గుర్తుకు వచ్చాయి- రెండు రోజులు (క్రితం అమ్మ చెప్పిన మాటలు. "నిన్ను చూడ్డానికి మీ ఆఫీస్‌కు శ్రీరామ్ అన్నతను వస్తాడని' అయితే ఇతనే నన్నమాట... గుండె ఝల్లుమంది.

శ్రీరామ్ కూర్చున్న తరువాత కొన్ని క్షణాలు మౌనంగా గడిచి పోయాయి. ఎందుకు కలిశారో, జరగబోయే సంభాషణ ఏమిటో ఇద్దరికీ తెలుసు. అయితే ఎలా (ప్రారంభించాలో మా(త్రం ఇద్దరిలో ఎవరికీ తోచడంలేదు.

శ్రీరామ్ ఎలాగో సంభాషణ (ప్రారంభించి తన ఉద్యోగం గురించి, రాబోయే (ప్రమోషన్ల గురించి చెబుతున్నప్పుడు ఇట్టే ఆకర్షించే చురుకైన అతని కళ్ళ వైపు చూస్తూ అతని మాటలకు ఊc కొడుతూ ఉండిపోయింది లావణ్య.

అతను అసలు విషయానికి వస్తున్నట్లు సీరియస్‌గా ముఖంపెట్టి అతి మర్యాదగా- 'నేనెందుకు వచ్చానో మీకు తెల్సు. నా అభి(ప్రాయం మీకు ఒక స్లిప్ మీద రాసి స్తాను. అలాగే మీరు మీ అభి(ప్రాయం రాసి వ్వండి' అన్నాడు.

'సరే' నన్నట్లుగా తల ఊపింది లావణ్య.

అక్కడున్న ఒక



కాగితం తీసి గబగబా ఏదో రాసి మడత బెట్టి ఆమెకిస్తూ, 'ఒక్కషరతు. దీనిని మీరు నేను వెళ్ళిన తరువాత మాత్రమే చూడాలి' అన్నాడు నవ్వుతూ.

'మీరూ అంతే' అంటూ తను రాసిన కాగితం ఇచ్చింది లావణ్య.

శ్రీరామ్ వెళ్ళగానే అదురుతున్న గుండెలతో అ కాగితం విప్పిన లావణ్య 'సారీ! మీరెందుకో నాకు నచ్చలేదు' అని రాసి ఉండటం చూసి పేలవంగా నిట్టూర్చింది.

హుషారుగా గేటుదాటిన శ్రీరామ్ లావణ్య ఇచ్చిన స్లిప్ తెరిచాడు. దాంట్లో సింపుల్‌గా 'డిటో' అని రాసి ఉండటం చూసి నివ్వెరపోయాడు.

*- బద్దిగం పాండురంగారెడ్డి*

---

## అదిగో పులి...

**లంచ్ టైమ్.**

శోభ ఎకౌంట్స్ సెక్షన్‌లోకి వచ్చి నళిని పక్కనే కూర్చుంది.

"తొందరగా వచ్చేయ్" అన్నది నళిని తాళం చెవి ఇస్తూ.

శోభ తల ఊపి నళిని ఇచ్చిన తాళం చెవి తీసుకుని హేండ్‌బ్యాగ్ తగిలించుకుని వెళ్ళిపోయింది.

గత కొద్ది రోజులుగా రెవిన్యూసెక్షన్లో పని చేస్తున్న శోభ లంచ్ టైమ్‌లో ఎకౌంట్స్‌సెక్షన్లోకి వచ్చి నళిని ఇంటి తాళం చెవి తీసుకుని వెళ్ళడం, లంచ్‌టైమ్ ఆమె ఇంట్లో గడిపి రావడం సునిశితంగా గమనిస్తున్నాడు ఎకౌంటెంట్ సుబ్బారావు. లంచ్ టైమ్‌లో శోభ అక్కడ ఏంచేసి వస్తున్నదనేది అతనికి మిలియన్ డాలర్ల ప్రశ్నగా మిగిలింది. కుతూహలం చంపుకోలేక రెవిన్యూసెక్షన్‌కి వెళ్ళి దయానందం పక్కనే కూర్చున్నాడు.

"ఏంటోయ్ సంగతులు? " అని పలకరించాడు దయానందం. సుబ్బారావు రెవిన్యూసెక్షనంతా కలయజూసి నిట్టూర్చాడు. "అంతా ముసలాళ్ళేగా? " అన్నాడు.

సుబ్బారావు అలా ఎందుకన్నాడో దయానందానికి అర్థం కాలేదు.

"ఏంటి? " అని అడిగాడు.

"మీ సెక్షన్లో అంతా ముసలాళ్ళే! కాని ఏంలాభం? " అని చప్పరించాడు సుబ్బారావు.

"లాభం ఏమిటి? ఎవరికి? " అయోమయంగా అడిగాడు దయానందం.

"మీ సెక్షన్లో పనిచేస్తున్న శోభ లంచ్‌టైమ్‌లో మా సెక్షన్ నళిని ఇంటి కీస్ తీసుకుని వెళ్ళి గడిపి వస్తున్నది." నెమ్మదిగా అన్నాడు సుబ్బారావు.

దయానందం ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"ఎవరితో? " గుసగుస లాడాడు.

"ఏమో? మీ సెక్షన్లో అందరూ ఇక్కడేవున్నారు. మన ఆఫీసులో వాడై ఉండడు". అన్నాడు సుబ్బారావు.

"ఇన్నాళ్ళూ శోభ మంచిది అనుకున్నాను.' 'అన్నాడు దయానందం.

"ఏమండోయ్ సుబ్బారావుగారూ! ఏంటీ చాలా సేపట్నుంచి దయానందం గారి చెవి కొరుకుతున్నారు." అంటూ బాక్స్ కడగడానికి సింక్ దగ్గరికి వెళ్ళింది అదే సెక్షన్‌లో పని చేస్తున్న కస్తూరి.

లంచ్‌టైమ్‌లో శోభ నళిని ఇంటి కీస్ తీసుకుని వెళ్ళి గడిపిరావడం, సుబ్బారావు అదంతా కనిపెట్టిన విషయం చెప్పాడు దయానందం.

అంతలో శోభ వచ్చితన సీట్లో కూర్చుంది.

"ఐనా ఎవరెట్లా పోతే మనకెందుకూ? " అని చేతులూపుకుంటూ వెళ్ళిపోయింది కస్తూరి.



మర్నాడు మామూలుగా శోభ, నళిని దగ్గరికి వచ్చి తాళం చెవులు తీసుకుని వెళ్ళింది.

కస్తూరి త్వరత్వరగా లంచ్ చేసి వెళ్ళి నళిని పక్కన కూర్చుని "ఏమిటోయ్ విశేషాలు? " అన్నది.

"ఏముంటాయి? నువ్వే చెప్పాలి." అన్నది నళిని.

ఆ మాటా ఈ మాటా మాట్లాడి చివరకు అసలు విషయంలోకి వచ్చింది కస్తూరి.

"నువ్వేంటి శోభకి అంత సహకరిస్తున్నావు? " అడిగింది కస్తూరి.

"ఫ్రెండ్స్ అన్నాక ఆ మాత్రం కోపరేట్ చెయ్యకపోతే ఎట్లా? " అన్నది నళిని నవ్వుతూ.

"ఇటువంటి విషయాల్లోనా కోపరేషన్? ఇదేం బాగాలేదు. అందరికీ తెలిస్తే బాగుండదు. నీకు చెడ్డపేరు." అన్నది కస్తూరి.

"ఏమిటి నువ్వనేది? "

"శోభ లంచ్‌టైమ్‌లో మీ ఇంటికెళ్ళి ఎవరితోనో గడిపి వస్తున్నదటగా!" అన్నది కస్తూరి.

"ఛ...ఛ... ఎవరన్నారు.? " ఆశ్చర్యపోతూ అడిగింది నళిని.

"అందరూ అనుకుంటున్నారు."

"అదిగో పులి అంటే ఇదుగో తోక అంటారు జనం. అసలు విషయం ఏమిటంటే శోభ వాళ్ళ రూమ్‌లో నలుగురుంటున్నారు. అక్కడ వాటర్ ప్రాబ్లమ్ వుంది. అందుకే లంచ్‌టైమ్‌లో నారూమ్‌కి వెళ్ళి స్నానం చేసి వస్తుంది. దీనికే ఇన్ని కథలు అల్లాలా? " అన్నది నళిని.

కస్తూరి ముఖం మాడ్చుకుని "అలాగా!" అంటూ వెళ్ళిపోయింది.

– వాణిశ్రీ

## సీ'రియల్'

ఉదయం బస్సుస్టాండులో ఎనిమిది గంటలకు వేచి ఉండవలసి వచ్చింది.

బస్సురాలేదు అనుకున్న మిత్రుడూ రాలేదు. అరగంట దాటింది.

విసుగ్గా పక్కనున్న పాన్‌షాపుకు వెళ్లాను. న్యూస్‌పేపరు అడిగాను.

"ఇదిగోండి" అంటూ ఈనాడు పేపరు అందించాడు.

"రాయగడ బస్సు రాలేదా? " అడిగాను.

"పార్వతీపురం టు రాయగడ ట్రిప్పుల బండి రావాలి ఇంకా రాలేదు ఎందుకో" అంటూ పాన్‌షాప్ యజమాని "పాన్ కావాలా? " అని అడిగాడు.

"ఇవ్వు" ముక్తసరిగా అడిగాను.

"ఏది సార్" అడిగాడు

"మిఠాయి కిళ్లీ కట్టు" అన్నాను.

"సార్! బస్సు వచ్చేసరికి లేటు కావచ్చును. ఆ స్టూలు మీద కూర్చోండి" అంటూ చూపించాడు.

నేను కూర్చొని పేపరు తిరగేస్తున్నాను. ఇద్దరు అమ్మాయిల మాటలు వినబడుతున్నాయి.

"నేను రాత్రి సీరియల్ చూడలేదు. ఏం జరిగిందే" అడిగింది ఒకమ్మాయి.

"ఏ సీరియల్ రమా!"

"అమ్మాయి పెళ్ళి!!? ? " రమ చెప్పింది.

"జగన్, నివేదిత ప్రేమించుకోవడం చూపించాడు"

"సరే కాని నీలూ! అదీ మొన్నే చూపించాడు. తరువాత!!... ..."

"చూడు రమా! పెళ్ళి చేసుకుంటాడని జగన్, నివేదిత షికార్లు తిరిగారు. కార్లలో లాడ్జీలకు తిరిగారు" నీలు చెప్పుకుపోతోంది.

"నివేదిత, తల్లిదండ్రులు ఒప్పుకున్నారా? " రమ ప్రశ్నిస్తున్నట్లు వినబడింది.

"లేదు! లేదు! నివేదిత తల్లి అస్సలు ఒప్పుకోలేదు. అయినా ప్రేమ షికార్లు బాగా చూపించాడు. మరి నివేదిత ప్రెగ్నెంటు అయింది" నీలిమ చెప్పుకుపోతోంది.

"అదీ సరే తల్లిదండ్రులకు ఇష్టంలేదు కదా! పైగా ప్రెగ్నెంటు మరి!..."

"హాస్పిటల్‌కు తీసుకుపోయి అబార్షన్ చేయించాడు జగన్!"

"ఏయ్ రాండి! రాండి! పిల్లలూ! ఏయ్ రమా! ఏయ్ నీలూ!" అరిచాడు మేస్త్రీ. "పనిలోకి పోవాలి" అంటూ ఇద్దరూ కదిలారు.

ఇద్దర్నీ చూశాను. వాళ్లకు ఎనిమిదేళ్లకు మించి ఉండవు.

"చూడండి! ఇంత చిన్న వయసులో వారి మాటలు, కథలు! ఇదిగోండి కిళ్లీ" అంటూ పాన్ అందించాడు పాన్‌షాపు వాడు. ఆలోచనలో పడ్డాను.

టి. వి. కార్యక్రమాలు



చిన్న పిల్లలను ఏ దిశకు మళ్ళిస్తున్నాయి? ఇదా టి.వి.లు చూసి పిల్లలు నేర్చుకుంటున్న విద్య?

– బెహరా ఉమామహేశ్వరరావు

✦

# 'హారిణి'పై సమీక్షలు

**ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన మునిపల్లె లక్ష్మీరమణకుమారి నవల 'హారిణి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

## రసాత్మక కావ్యం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

కథానాయకి పాదం లేతగులాబీ రంగులో పువ్వులా మెరుస్తూ కారు దిగుతున్నప్పుడు ప్రత్యక్షంకావటం, కథానాయకుడు పవన్ దృష్టి పాదంమీద నుండి వదనందాకా ప్రసరించటం, ఆమె అందానికి పరవశుడై కళ్లు తిప్పుకోలేకపోవడం నవలలో రసవత్తరమైన వర్ణన!... "మృదుపల్లవకోమల తత్పదద్వయీ... యదునందను డర్మిలిమ్రొక్కె అన్నాడు ముక్కుతిమ్మ పారిజాతాపహరణం కావ్యంలో సత్యభామ పాదాల కాంతిని వర్ణిస్తూ.

ఈనవలలో పవన్‌కి అలా మొక్కే అవకాశంలేకపోయినా ఆమె అందానికి పరవశుడైపోవటంవుంది. రసవత్తర సన్నివేశకల్పనతో వుంటే రచన నవల అయినా నాటకమైనా ఒకకావ్యమే! రచయిత్రి మునిపల్లెలక్ష్మీరమణ కుమారిగారికి సాహిత్యపరిజ్ఞానం, చారిత్రక పరిజ్ఞానం రెండూ ఉన్నాయి.

షేర్ని అసలు పేరు హరిణి. బాల్యంలో సున్నితమనస్కురాలు. ఆమె మేనత్త రాణిపద్మిని. దృఢసంకల్పంగల మహిళ! వాస్తవికవాది. క్రియాశీలి! ఆమెకు సంతానంలేదు. సంపదబాగావుంది. తండ్రినికోల్పోయిన హరిణికి ఒకగురువుగా మారింది. మృదుస్వభావిగావున్న మేనకోడలికి గుండెబలం, కండబలం, తెగింపు వచ్చేలాగా మానసికవైద్యం, మూలికావైద్యం పట్టుదలతో చేయించింది. ధీరవనితగా ఉక్కుమనిషిగా తీర్చిదిద్దింది.

భూమి గుండ్రంగావుంది అన్నట్లు షేర్ని ఇండియానుండి అమెరికా చదువుకోసం చేరి, అక్కడ మరో ఘటనతో మళ్లీ హరిణిగా మారి కరుణామయి అయింది. పవన్ ప్రేమని ఆమోదించింది. కథ సుఖాంతం అయింది.

పారిజాతాపహరణం కావ్యంలా నవల ప్రారంభమై, పాతాళభైరవి చలనచిత్రంలా నడుమవిచిత్రగతులతోనడిచి, అమెరికాలో ఆంగ్ల చిత్రంలా కనబడి, ఆఖరికి తెలుగు నవలలా ముగిసింది. వైవిధ్యం వున్న నవల!

– సూర్యదేవర వెంకటేశ్వరరావు
హైద్రాబాదు

## మానవతా విలువలకు దర్పణం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

హరిణి నవల చదివాను. రచయిత్రి మునిపల్లె లక్ష్మీరమణకుమారి చాలా చక్కని శైలిలో చిక్కని కథని, ఉన్నతమైన విలువలు కలిగిన కథని రాశారు. కాలేజీ జీవితంలో కుర్రకారు చిలిపితనాన్నీ, పరిస్థితులకు మనుషులు ఎలా మారిపోతారూ అన్న విషయాన్నీ, మంచితనాన్ని, చేతగానితనంగా తీసుకుని అన్నంపెట్టిన చేతినే కరిచేసే దుర్మార్గాన్నీ చాలా చక్కని ఉదాహరణలతో వివరించారు. జీవితంలోని అన్ని సంఘటనలూ, ఆయా పాత్రల ద్వారా చాలా సహజంగా సృష్టించారు. సన్నివేశాలకు తగ్గ సంభాషణలు మంచి మంచి ఉపమానాలతో నవల చదవటం మొదలుపెట్టాక పూర్తయ్యేవరకూ చదివిస్తాయి. దెయ్యాలూ భూతాలు కేవలం అభూతకల్పనలని రాణిపద్మిని హరిణికి బోధిస్తూ, అడవిలో దెయ్యాలుంటే నక్సలైట్లు, వేటగాళ్లు

ఎట్లా తిరుగుతారు? కాబట్టి అదంతా అబద్ధం అని చాలా చక్కగా ఆమె భయాన్ని పోగొట్టి ధైర్యం చెబుతుంది. అన వసరంగా ఏవేవో ఊహించుకుని భయపడే వారు ఇది చదివి నిజానిజాలు తెలుసుకో వాలి. షేర్ని (హరిణి)ని ప్రేమించిన పవన్ ప్రేమ గురించి ఇచ్చే వివరణ స్వచ్ఛమైన ప్రేమ ప్రేమించిన వారి సుఖాన్ని కాంక్షిస్తూ, తాను ఏ త్యాగం చెయ్యడానికైనా ఎలా సిద్ధ పడుతుందో చక్కగా వివరించారు. ఇది మానవతా విలువలకు దర్పణం పట్టే నవల. నా స్పందనను పత్రికా ముఖంగా తెలిపి రచయిత్రిని అభినందించాలనే ఉద్దే శంతోనే ఈ లేఖ రాస్తున్నాను.

*- శారదా అశోకవర్ధన్*
*హైదరాబాద్*

## మేలు కొలుపు!

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

ఓ మంచి నవల చదువుతున్నామన్న ఫీలింగ్ కలిగించింది ఏప్రిల్ చతుర నవల- హరిణి! రచయిత్రి మునిపల్లె లక్ష్మీ కుమారి గారు ఆద్యంతం అద్భుత శైలితో ఆసక్తిక రంగా రాశారు.

అసలు 'మంచి' అనేది ఎలా వంచనకి, స్వార్థానికి గురై కుంగిపోతుందో కృష్ణప్రసాద్ పాత్ర ద్వారా చెప్పారు. హరిణి అనే అమ్మాయి తండ్రి కృష్ణప్రసాద్ జీవితంలో జరిగిన చేదు ఘటనలు, దాంతో హరిణి షేర్నీగా ఎలా మారిందీ బలమైన సంఘట నలతో రాశారు. అందుగ్గానూ ఆమె మేనత్త పద్మిని హరిణి హృదయాన్ని ఎలా మళ్ళిస్తూ వెళ్లిందో కూడా బాగా చిత్రించారు.

ఓ గొప్ప పాయింటుకు ఊతం ఇస్తూ బలపరిచే సంఘటనలు పేరుస్తూ క్లైమా క్స్‌లో చెడు భావనలు ఉండటం, మంచి వాళ్ళు కూడా చెడుగా ప్రవర్తించటం ఎంత వినాశ హేతువో చెప్పిన రీతి చాలా బాగుంది. మనకెక్కడో చెడు జరిగిందని, మనం కూడా చెడు మార్గం పట్టి మొత్తం వ్యవస్థనే నేల కూల్చటం సబబు కాదన్న అంశం బాగా రాశారు. అయితే ఈ విషయం హరిణి పాత్ర ఫీలయి మారినట్టు చిత్రించి ఉంటే మరింత గొప్పగా ఉండేది. హరిణిని మంచి కోణంలో చూసిన పవన్ షేర్నీగా చూడలేక మంచి మార్గంలోకి రప్పించే ప్రక్రియలో ముఖ్యంగా క్రైసిస్ తర్వాత క్లైమాక్స్ కరెక్టుగానే వచ్చినా తీరా పవన్ సంస్కరణ దిశకి తగిన సంఘట నలు, సంభాషణలు నవల్లో కనిపించక గొప్పగా ముగియ వల్సిన నవల కాస్తా ఓ మంచి నవలగా సమాప్తం అయింది!

*- వారణాసి రామకృష్ణ*
*హైద్రాబాద్-62.*

## ప్రేమకు అర్థం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

తొలి పేజీనుంచి చివరిపుట వరకూ ఆలోచింపచేస్తూ ఆశ్చర్యపరుస్తూ ఉత్కంఠ రేకెత్తించి మంచి ముగింపుతో అలరించింది నవల. హరిణి యువతిగా ఎదిగి షేర్నీగా మార్పు చెందే కథనం ఊపిరి బిగబట్టి చది వించింది. దాతయిన తన తండ్రి సాయం పొందిన వాళ్ళు చేసిన కుట్ర, దాపురించిన దుస్థితి కారణంగా తండ్రి మృతి చెందడం తో హరిణి పసి మనసు బాధ క్రోధం, కసి, కక్ష కార్పణ్యంతో రగిలిపోయింది. అందుకు అహంభావి రాణి పద్మిని ఈటెల్లాంటి మాటలు చేతలు అగ్గికి ఆజ్యం తోడైనట్టు హరిణి హృదిని తీవ్రంగా మండించాయి. నరనరాల్లో పరులపట్ల ద్వేషం, ఆగ్రహం అహం తిష్ట వేసిన పొగరుతో గుండె బండ బారిపోయి నవ్వుతూ మాట్లాడే క్రూర జంతువు మనిషి ఒక్కడే అని నమ్మి చివ రికి షేర్నీగా మారింది. ఆమెని మనసారా

ప్రేమించిన పవన్ మానవతా దృక్పథం, మనిషికి గల నైతిక బాధ్యత జీవన మార్గ దృఢ నిశ్చయానికి ప్రతీక. అందుకే ఇత రుల పట్ల ఏహ్యత కసిని నా కెవరి అవ సరం తోడు అక్కర్లేదు సర్వ స్వతంత్రురా లిని అని విర్రవీగిన షేర్నీలో "ఏ వ్యక్తీ ఏకాకి కాదు. స్వతంత్రుడు కాదు. పరుల సహాయ సహకారాలు లేక బ్రతకడం దుర్లభం. ప్రతీ మనిషి మరొక వ్యక్తిపై ఆధారపడక తప్పదు. అది నిత్యావసరాలకే కాదు మానసిక శక్తి కోసం అవశ్యం ఆధా రపడాలి. అలాగే కనపడని సంస్కృతి, సంస్కారం, దైవచింతనలపై వ్యక్తి ఆధారప డాలి. ఇన్ని బలమైన బంధాలు ఆవరించిన ప్పుడు నాకెవరి అవసరం ఆసరా లేదనుకో వడం కేవలం భ్రాంతి తప్ప నిజంకాదు. ఆ బంధాలే విధంగా కాపాడతాయో పవన్ నిరూపించి చెప్పి షేర్నీ బండ గుండెని ఆర్ద్ర పరిచి పరివర్తన తెచ్చి హరిణిని చేపట్టి తన స్వచ్ఛమైన ప్రేమకి అర్థం పరమార్థం తెలి పాడు.

–ఎమ్. కృష్ణ
కాకినాడ

## చక్కటి ముగింపు

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మారుతున్న కాలంలో మంచికి మానవ తకు చోటు లేదు, అవి అందని ద్రాక్ష పండ్లన్న కఠినమైన సత్యాన్ని వినూత్నమైన కథా కథన శిల్పంతో పాఠకులను ఆద్యంతం ఆకట్టుకొనేటట్లుగా రాయబడిన చక్కని సస్పెన్స్ గల మంచి నవల హరిణి.

హరిణి షేర్నిగా మారడానికి కల బల మైన కారణాన్ని విజయ్ పవన్‌కి తెలియప రిచి చిన్నప్పుడు నిన్ను కాపాడిన కరుణా మూర్తి ఈ షేర్నీ అని వివరిస్తాడు. హరిణి తండ్రి కృష్ణప్రసాద్ మంచికి మానవతకు మారుపేరు. విధి ఆడిన వింత నాటకంలో కృష్ణప్రసాద్ బలి పశువు కావడం, అతనిలో కలిగిన మార్పు పాఠకులకు కంట తడి పెట్టించేటట్లుగా చిత్రించిన తీరు రచయిత్రి సునిశిత మేధా శక్తికి నిదర్శనం.

కృష్ణప్రసాద్ చనిపోతూ చెల్లెలితో హరి ణిని దృఢంగా, కరుగ్గా ఈ లోకంలో తెలి విగా బతికేటట్లు చెయ్యమని మాట తీసు కుంటాడు. అంతే గాకుండా హరిణితో "ఎవరి గురించి ఆలోచించకు, ఎవరికీ సాయం చెయ్యకు. సున్నితమైన మనస్సు కలవాళ్ల లోకం కాదమ్మా ఇది" అని వాపో తాడు. హృదయాన్ని కలచివేసే ఈ సంఘ టనతో పాఠకులకు చైతన్యాన్ని స్పందనను కలిగించడంలో రచయిత్రి కృత కృత్యురా ల్యారనటంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

రాతి గుండెగా మారిన షేర్నిని తిరిగి హరిణిగా మార్చి, ఆమె హృదయాన్ని జయించి నీకు తల్లి, తండ్రి, సర్వం నేనై నిలుస్తాను అని పవన్‌చేత పలికించి ఈ నవలకు రచయిత్రి చక్కటి ముగింపును ఇచ్చారు.

– ఎన్. విజయలక్ష్మి
ఒంగోలు



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.




# ‘కల్లుక్’ విన్యాస లీల

ఎలుగుబంట్లలో అందమైనవి పోలార్ ఎలుగుబంట్లు. ఇవి బహుముచ్చటగా చలాకీగా ఉంటాయి. శాన్‌డీగో జూ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఆ జూలోని ఓ సరోవరంలో కల్లుక్ అనే ముద్దు పేరుగల ఎలుగుబంటి, ఓ ప్లాస్టిక్ లాంతరుతో తమాషాగా ఆడుకొంటూ విన్యాసాలు చేస్తోంది. ఈ దృశ్యం ఆనందం కలిగిస్తోందికదూ! ఆ జూను సమర్థవంతంగా నిర్వహిస్తున్న అధికారులకు మనం అభినందనలు చెప్పాలి.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78

## ఇట్టే కరిగిపోయే ఇడ్లీలు - ఇంకా తినాలనిపించే దోశలు - ఇంత అద్భుతమా అనిపించే ఉప్మా...

# ... అన్నీ ఒకే ఒక్క చిటికెలో!




ఔను అద్భుతమైన ఇడ్లీ - దోశ - ఉప్మా - ఏం కావాలన్నా అరక్షణంలో మీకు అందిస్తాయి ప్రియ ఇన్‌స్టెంట్ మిక్స్‌లు. అనుకోకుండా చుట్టాలో - స్నేహితులో వచ్చి తలుపు తట్టినా, ఆకలని పిల్లలు మారాంచేసినా, ఆయన ఆఫీస్ నుంచి త్వరగా ఇంటికి వచ్చేసినా... ఏం కంగారు పడక్కర్లేదు. అపురూపమైన ప్రియ రుచులు - ఎప్పుడుకావాలంటే అప్పుడే సిద్ధం... ఒకే ఒక్క చిటికెలో! సుతిమెత్తని ఇడ్లీలు - నోరూరించే దోశలు - రుచికే కొత్త అర్థాన్ని చెప్పే ఉప్మా.... అబ్బ... ఇంక మీరు వదిలిపెట్టలేరు.. అన్నీ ఆరగించితీరుతారు... ఒకేఒక్క చిటికెలో...!



**priya**™

INSTANT MIXES

www.priyafoods.com